# ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక



DHRA PATRIKA 21-5-58
TRATED WEEKLY 25 నయాపైసలు



దీపగుచ్ఛము

—ఫొటో: నందగోపాల్, హైదరాబాదు]

ఆంధ్ర ప్రదేశ్
అంతటా
ప్రదర్శింపబడుతూంది



నేషనల్ టాకి డిస్ట్రిబ్యూటర్సు సమర్పించు శివకామి వారి

# వీర ఖడ్గము

తెలుగు

ఎం.జి.రామచంద్రన్...టి.ఆర్.రాజకుమారి...బి.యస్.సరోజ...
ఇ.వి.సరోజ...బాలయ్య...చంద్రబాబు...సహదేవన్

మాటలు...పాలగుమ్మి పద్మరాజు....పాటలు...ఆరుద్ర

...రాంమణ్ణ

నిర్మాత... S. మునిరత్నం

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25 న. పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 39
21-5-58

Founder : K. NAGESWARA RAO

విలంబి జ్యేష్ఠ శుద్ధ తృతీయ బుధవారం


 విషయానుక్రమణిక 

ముఖచిత్రం :
జలరుహావారి 'రాజనందిని'లో
అంజలీదేవి.






# నెహ్రూకు ఐసెన్‌హోవర్ సందేశం?

శ్రీ కృష్ణ
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

"ఐదు రోజులపాటు భారతదేశాన్ని దద్దరిల చేసినవారం" అని గత వారాన్ని వర్ణించవచ్చు. పదవినుంచి తాత్కాలికంగా విరమించదలచినటు ప్రధాని నెహ్రూ హఠాత్తుగా ప్రకటించేసరికి రాజధాని అంతా ఒక్కసారి అట్టుడికినట్లు ఉడికిపోయింది! ప్రధాని ప్రకటన ప్రప్రథమంగా ఏప్రిల్ 29-వ తేదీన వెలువడింది. మే 1-న తిరిగి మరొక ప్రకటన వెలువడింది. తన నిర్ణయానికి తిరుగు లేదన్నదే ఈ రెండో ప్రకటన సారాంశం. సన్నిహితులైన మిత్రుల, ఇతర సహచరుల అభీష్టాన్ని అనుసరించి ప్రధాని నెహ్రూ యథాప్రకారం పదవిలో వుండడానికి ఇష్టపడ్డారనే ప్రకటన మే 3-వ తేదీనగాని వెలువడలేదు. ప్రధాని తమ సంకల్పాన్ని మార్చుకున్నారనే విషయం వినగానే రాజధాని "అమ్మయ్య!" అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచి ఊరటచెందింది. ప్రతి పౌరుడి హృదయంలోనూ తిరిగి ఉత్సాహం వెల్లివిరిసింది.

*　　*　　*

ప్రధాని నెహ్రూ సంకల్పం మారడానికి కారణమేమిటి? ఢిల్లీ పత్రికలు కొన్ని ఒక కారణం చెబుతున్నాయి. మే 2-వ తేదీ సాయంత్రం 4 గంటలకు అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హోవర్ వద్దనుంచి ప్రధాని నెహ్రూకు ఒక ముఖ్యమైన కేబుల్ వచ్చిందన్నదే ఈ కారణం.

కేబుల్‌లో వున్న విషయం అతి రహస్యమే అయినప్పటికీ అసలువిషయమేమిటో కొంతవరకు చూచాయగా తెలియకపోవడం లేదు. ప్రధాని నెహ్రూకు ఐసెన్‌హోవర్ తన స్వవిషయాన్నే ఒక ఉదాహరణగా చెప్పినట్లు తెలియవస్తున్నది. "రెండుసార్లు గుండెపోటు వచ్చి అస్వస్థతో బాధపడ్డాము; మొత్తంమీద ఎవరి కాలాన్నో ఎరువు తెచ్చుకున్నట్లుగా భావించి అధ్యక్ష పదవీ బాధ్యతలను నిర్వహిస్తున్నాను. రెండవసారి ఈ అధ్యక్ష పదవిని నిర్వహిస్తున్నానన్న మాటే గాని, ఏమాత్రం హాయి కనిపించడం లేదు......అధ్యక్షపదవిలో వున్న నా స్థితి ఇలా వుంటే భారత ప్రధానమంత్రిగా వున్న మీ స్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా వున్నది. మీరింకా యువకులుగానే కనిపిస్తుంటారు. నిరంతరోత్సాహ భరితులై వుంటారు. కోటానుకోట్ల భారతీయులకు మీరు ఆరాధ్యదైవం లాంటివారు. మీ పదవీ కాలం అత్యంత జయప్రదంగా కొనసాగుతున్నది. అందుచేత తాత్కాలికంగానైనా మీ పదవీ విరమణకు కారణమేమున్నదంటారు?" అని సరిగా ఈ మాటలలోనే గాకపోయినప్పటికీ ఈవిధంగా అర్థంవచ్చేలా అమెరికా అధ్యక్షుని సందేశం వున్నట్లు వినికిడి.



హరికృష్ణ మెహతాబ్
ఒరిస్సాలో వీరి మంత్రివర్గం మే 9-న రాజీనామా ఇచ్చింది.



నిజలింగప్ప
మైసూరులో వీరి మంత్రివర్గమూ రాజీనామా ఇచ్చింది

*　　*　　*

ఈ విషయం ఎంతవరకు నిజమో, ఎంతవరకు కాదో మనకు తెలియదు కాని, ఒక విషయం మాత్రం చెప్పక తప్పదు. కేవలం అమెరికా అధ్యక్షుడి ప్రత్యేక సందేశం కారణంగానే నెహ్రూ తన మనస్సు మార్చుకున్నారని చెపితే, భారత ప్రధానికి అన్యాయం చేసిన వాళ్లమవుతాము.

ఏది ఏమైనప్పటికీ ఒక సంగతి మాత్రం కాదనలేము. నిర్విరామ కార్యభారంవల్ల ప్రధాని నెహ్రూ బాగా డస్సిపోయారన్నది మాత్రం నిజం. రాత్రి

# న్యూఢిల్లీ లేఖ

నకో, పగలనకో పనిచేసి దేశక్షేమానికి తన సర్వశక్తి సామర్థ్యాలనూ ధారపోస్తున్నారు. కనీసం దేశ క్షేమాన్ని కాంక్షించి అయినా ప్రధాని స్వయంగా తన కార్యభారాన్ని విధిగా తగ్గించుకోవాలి. ఇంతే కాదు. బ్రిటిష్ అధికారులు, ఇతర ప్రముఖులు ప్రతి వారాంతానా విశ్రాంతికోసం ఎక్కడికైనా వెళ్లిపోయి హాయిగా కాలక్షేపం చేస్తుంటారు. ప్రధాని స్వయంగా కూడా ఈ వారాంత విశ్రాంతి పద్ధతిని అలవరచుకోవాలి.

* * *

పార్లమెంటు బడ్జెట్ సమావేశం ఈ వారంలో సమాప్తమైంది. ఆర్థిక మంత్రి పదవినుంచి కృష్ణమాచారి తప్పుకోవడమూ, తత్ఫలితంగా కేంద్ర మంత్రివర్గ పునర్నిర్మాణమూ కూడా ఈ సమావేశ సందర్భంలోనే జరిగాయి. ఇంతే కాదు. ప్రభుత్వం తరచూ గొప్పగా చెప్పుకునే సోషలిస్టు వ్యవస్థ మూల సిద్ధాంతాలలో ఒకదానికి తీవ్ర విఘాతం కూడా ఈ సందర్భంలోనే ఏర్పడింది. చక్కెరధర గొడవే దీనికో కతార్కాణం.

వినియోగదారుని సౌకర్యాన్ని బలిపెట్టి ఈ చక్కెరపరిశ్రమ ఆవేదాన్ని పెంపొందచేశారు. దేశం స్వతంత్రమైనతర్వాత ఇప్పటివరకూ రెండుసార్లు చక్కెర విషయంలో దేశ ప్రజలు క్షామ పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ఇవి రెండూ కేవలం మానవ కల్పితమైన కృత్రిమ క్షామాలు! దేశంలో ఉత్పత్తి అవుతున్న చక్కెరధరకంటే, విదేశాలనుంచి దిగుమతిచేసుకుంటున్న చక్కెర ధర చౌకగా వుండేట్లు చేశారు! రాజకీయ కారణాలనే ఆధారంగా పెట్టుకుని చెరుకు ధరకు విపరీతమైన స్థాయిని నిర్ణయించారు. చక్కెరమీద పన్ను విధించారు. ఈ పన్ను ఎందుకంటే చెరుకురసోత్పత్తి ప్రమాణాన్ని పెంచాలన్నారు. చెరుకుపంట వాణిజ్యాన్ని పెంచేభారాన్ని కేంద్రప్రభుత్వం తనమీదే వేసుకున్నది. పన్నుద్వారా వచ్చే రాబడిని కేవలం ఇందుకే ఉపయోగిస్తున్నామన్నారు. ఈవిధంగా చెరుకుపంట వ్యాపారం బహు లాభసాటిగా తయారైంది. ఎంత లాభసాటిగా తయారైందీఅంటే, ఒక మంచి చెరుకుతోట వుంటే, ఇరవయ్యేళ్ళు తిరిగేతిరగకముందే ఒక సొంత చక్కెర ఫ్యాక్టరీ స్థాపించుకోడానికి కావలసినంత పెట్టుబడిని ఇట్టే గడించివేయవచ్చు.

* * *

దేశంలోని చక్కెరమిల్లు యజమానుల సంఘాధ్యక్షుడు పి. హాన్‌ఫీల్డు ఢిల్లీనుంచి వెలువడే "ఈస్టర్న్ ఎకనమిస్ట్" అనే పత్రికలో ఒకవ్యాసం వ్రాస్తూ చక్కెరధర విషయమై ఈవిధంగా ప్రస్తావించారు:

"ఇటీవలివరకూ భారతీయ వినియోగదారు ఏఇతర దేశంలోనూ లభ్యంకానంత చౌకధరకు (ఒక్క క్యూబాతప్ప) దేశంలో చక్కెర కొనుక్కోగలిగేవాడు. ఈ రోజు మనదేశంలో చక్కెరధర విపరీతంగా పెరిగిపోయింది. కెనడా, ఫిలిప్పీన్సు, ఆస్ట్రేలియా మలయా మొదలైన ఏ ఇతర దేశాలలోనూ ఇంతధర లేదు. దీనిధర ఇంతచేటుగా ఎందుకు పెంచాలని ప్రశ్నించేహక్కు ప్రతిగృహిణికీ వున్నది. చక్కెరలా ఉపయోగపడే ప్రత్యామ్నాయ పదార్థమేదైనా మార్కెటులో తక్కువ దొరికితే, దాన్ని తప్పక కొని వినియోగించే హక్కు కూడా ఆమెకు లేకపోలేదు. ఒకరకంగా చక్కెరపై నూటికి నూరువంతులు



డాక్టర్ ఖాన్‌సాహెబ్

భారత స్వాతంత్ర్య సమరానికి సారథ్యం వహించిన అగ్రనాయకులలో ఒకరు. వీరిని మే 9-న లాహోరులో ఒక దుండగీడు హత్యచేశాడు. వీరు సరిహద్దుగాంధి గఫార్ ఖాన్ జ్యేష్ఠసోదరుడు.

సుంకం విధించడం జరుగుతున్నది. కలకండ ఉత్పత్తిదారులు ఈ విషయం గమనించకపోలేదు. ఖండసారీ చక్కెర ఉత్పత్తి 1957 58 కి పూర్వం సగటున సాలీనా ఒక లక్షటన్నులు మాత్రమే వుండేది. ఈ ఏడాదికి ఇది 3 లక్షల టన్నులవరకూ పెరిగింది. దీనిమీద కొత్తపన్ను ఏదీ విధించకపోతే, నూటికి నూరుపాళ్లుగా వున్న చక్కెర సుంకాన్ని తగ్గించకపోతే, 1958-59 లో ఖండసారీ ఉత్పత్తి ఆరులక్షల టన్నులవరకూ పెరుగుతుందని విషయజ్ఞులు అంచనా వేస్తున్నారు.'

* * *

ప్రతిగృహిణీ చక్కెర కొనుగోలుకు ఖర్చుపెట్టే ప్రతి రూపాయిలోనూ 38 నయాపైసలు ప్రభుత్వానికి ముడుపుగా చెల్లిస్తున్నది. దేశంలో చక్కెరధర ఈ క్రింది నిష్పత్తులలో మదింపవుతున్నది:

| | | నూటికిపాళ్లు: |
|---|---|---|
| చెరుకు | ... | 41 |
| పన్నులు | ... | 38 |
| మిల్లుల్లో వేతనాలు, ప్యాకింగుఖర్చులు | | 11 |
| ఉత్పత్తిఖర్చులు | ... | 5 |
| లాభాలు | ... | 5 |
| | వెరశి: | 100 |

* * *

మూడేళ్ల క్రితం ఏ కొత్త ప్రతిపాదన వచ్చినా చక్కెర మిల్లులలో పనిచేయడానికి వీలున్న ఉద్యోగుల సంఖ్య దృష్ట్యానే పరిశీలించడం జరిగేది. ఇప్పుడు ప్రతిప్రతిపాదననూ విదేశీ ద్రవ్యారవదృష్ట్యా మాత్రమే చూడడం జరుగుతున్నది. ప్రభుత్వం చక్కెర ఎగుమతి చేసి విదేశీ ద్రవ్యార్జన చేయాలికాబట్టి, దేశ ప్రజలు పడరానిపాట్లుపడి నిరంతరం త్యాగాలు చేయకతప్పదనేవరకూ వచ్చాయి స్థితిగతులు. ఈ ఎగుమతులను ప్రోత్సహించడానికే మణుగు ఒకటికి చక్కెర ధర ఒక రూపాయి పెంచాలని పాలకులు తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

దేశంలో చక్కెర ప్రజావసరాలకు మించే ఉత్పత్తి అవుతున్నదికాబటి, శేషగా ఎగుమతి చేసుకోవచ్చునని అధికారుల వాదన. ఇంత విస్తారంగా ఉత్పత్తి చేస్తున్నారుకదా, అదనపు ఉత్పత్తి ఫలితమేమిటో కొంతవరకైనా వినియోగదారులుకూడా అనుభవించే అవకాశం ఇవ్వకూడదా అని ప్రశ్నించవలసి వస్తున్నది. ఇప్పటికే దేశావసరాలకుమించి చక్కెర ఉత్పత్తి అవుతుంటే, ఇంకా అదనపు ఉత్పత్తికి ఎందుకింత తాపత్రయపడడం? దేశంలో చక్కెర ఉత్పత్తి విస్తరణకు కనీసం పదికోట్ల రూపాయలవరకైనా విదేశీద్రవ్యం లభ్యమైతేనేగాని, పని సాగదని అంచనా వేస్తున్నారు. కొత్త చక్కెరమిల్లులకు కావలసిన యంత్రసామగ్రిని కమ్యూనిస్టుదేశాలనుంచి ఎందుకు దిగుమతిచేసుకోకూడదు? ఇలాచేసే మనం ఆ దిగుమతులను రూపాయలలోనే లెక్కకట్టవచ్చు. రూపాయలలో లెక్కలుకట్టినా, ఆ ప్రదేశాలకు మనం ఆ కిమ్మతుకు సరిపడ ఇతర సరుకును (వారు కోరేవాటిని) ఎగుమతి చెయ్యవచ్చు. ఈ విషయమెందుకు ఆలోచించరు?

* * *

ద్వితీయ ప్రణాళిక (4260 కోట్ల ఖర్చుతో) అమలు బ్రహ్మాండమైన కృషి

(54 వ పేజీ చూడుడు)



# కూచిపూడి నాట్యం సశాస్త్రీయమైనది కాదట!

ఇటీవల సంగీత నాటక అకాడమీ ఢిల్లీలో 'డాన్సు సెమినార్' జరిపింది. ఈ సదస్సులో జరిగిన చర్చలలో వివిధ రాష్ట్రాల ప్రతినిధులు పాల్గొని కొన్ని నిర్ణయాలు చేశారు. భరతనాట్యం, కథక్, కథాకళి, మణిపురి నాట్యములు, శాస్త్రవిహితమైన నాట్యాలుగా గుర్తించారు. ఆటు తరువాత సంగీత నాటక అకడమీ, ఏప్రిలు 19వ తేదీన ఇలా ఒక పత్రికా ప్రకటన చేసింది:

"ఒడిస్సి నాట్య సంప్రదాయమును, శాస్త్రవిహిత సంప్రదాయమని సంగీత నాటక అకడమీ–కొన్ని పత్రికలలో ప్రకటించినట్టుగా–పరిగణన చేయలేదు.

"సెమినార్ సమావేశం ఆఖరు నాడు, జరిగిన చర్చలలో భరతనాట్యం, కథక్, కథకళి, మణిపురి ఈ నాలుగు నాట్య సంప్రదాయములు గాకుండా ఇతర నాట్యములు అంటే, కూచిపూడి, భాగవత మేళ, ఒడిస్సి, అంక్య వంటివి ఏవైనా శాస్త్రవిహిత నాట్య సంప్రదాయములు అవునా కాదా అని చర్చించారు.

"ఈ విషయ ప్రాధాన్యమును గుర్తించి, అకడమీ నియమించే ప్రవీణుల సంఘం, లభ్యమయ్యే విషయముల దృష్ట్యా కొన్ని ప్రమాణాలు నిర్ణయించటానికి, ఈవిషయమై అకడమీకి సలహాయివ్వటానికి పూనుకుంటుంది. సంగీత నాటక అకడమీ, ప్రస్తుతం భరత నాట్యం, కథక్, కథాకళి, మణిపురి నాట్య సంప్రదాయాలను, మాత్రమే శాస్త్రవిహిత సంప్రదాయాలుగా గుర్తించింది."

కూచిపూడి నాట్యం, భరతశాస్త్ర విహితం కాదని, సంగీతనాటక అకడమీ చేసిన ఈ నిర్ణయం ఆంధ్రుల నాట్యకళా విశిష్టతకు తీరని అపకారం కలిగిస్తుంది. ఇటీవలివరకూ ఆంధ్రప్రదేశ్ కు, ప్రత్యేకంగా ఓ సంగీతనాటక అకడమీ ప్రాంతీయ శాఖ లేకపోవటంవల్ల చరిత్ర ప్రసిద్ధమైన కూచిపూడి నాట్యానికి ప్రాధాన్యం లేకపోయింది. 'అయోమయ పరిస్థితులలోనే కూచిపూడి నాట్యకళాభివృద్ధికి, అనాదిసిద్ధమైన ప్రతిష్ఠ, స్థలమాహాత్మ్యము కలిగిన కూచిపూడి గ్రామంలోగాక అక్కడికి 70 మైళ్ళ

★ తుమ్మలపల్లి సీతారామారావు ★

దూరంలోవున్న ఏలూరు పట్టణంలో కూచిపూడి నాట్యకళాలయం నెలకొల్పడం జరిగింది కేంద్రంసంగీతనాటక అకడమీ కొంత ఆర్థికసహాయం అందచేసింది.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ కు ప్రత్యేకంగా సంగీతనాటక అకడమీ ఏర్పడింది. పూర్వకాలంనుంచి ఆంధ్రులు నాటక నాట్యరంగములలో చేసినసేవ, వారు ప్రస్ఫుటంచేసిన కళా విశిష్టత, విశ్వజనీనం కావటానికి విపులంగా అవకాశాలు లభిస్తవని అందరూ ఆశించారు. కూచిపూడి నాట్యం, భరత సంప్రదాయసిద్ధమైన నాట్యం కాదని కేంద్ర అకడమీ జరిపిన చర్చలలో వివిధ రాష్ట్రాల ప్రతినిధులూ నిర్ధారణచేశారు. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకడమీ కేంద్రఅకాడమీ చేసిన నిర్ణయాలు ఆధారరహితమైనవని రుజువు చేయటానికి ఏంచర్య తీసుకుంది? కూచిపూడి నాట్యాన్ని గురించి శాస్త్రవిహితమైన ఆధారాలతో నిర్ణయించటానికి ఎవరు అర్హులు? శాస్త్ర పరిజ్ఞానం, శాస్త్రీయమైన కౌశలంగల నటులు ఈనాడు ఎంతిమందివున్నారు? శాస్త్రంలో పరిచయంలేని వాళ్ళుఎంట కొన్ని ఉపన్యాసాలు చేయటంతోను, ఏవోకొన్ని భంగిమలుచూపి, నాలుగుఅడుగులు వేయటంతోను, వాళ్లునాట్యాన్నిగురించి అధికారికంగా, ప్రమాణయుతంగా చెప్పటానికి, చెప్పినవిషయాలు ప్రయోగాత్మకంగా చూపించటానికి సమర్థులా? కాగా అనేకమార్లు అనేకమంది ఢిల్లీవెళ్ళటం, ఉపన్యాసాలు చేయటం, నాట్యప్రదర్శనాలు ఇవ్వటం జరుగుతూంది. సంగీతనాటక అకాడమీ కార్యవర్గ సభ్యులలో వివిధనాట్య సంప్రదాయాలు తెలిసిన పండితులు కొందరు వున్నారు. వారు కూచిపూడి నాట్యం అనే పేరుతో జరిగే ప్రదర్శనాలు కొన్ని చూస్తున్నారు. ఈ ప్రయోగాలుచూసి వారు అసంతృప్తులైనారు. కాగా, శాస్త్రవిహితమైన కట్టుబాట్లతో, సుశిక్షణపొందిన కళాకారుల ప్రదర్శనాలు వాళ్లుచూసే అవకాశాలు కలుగలేదు. అందువల్ల సశాస్త్రీయమైనకూచిపూడి నాట్య సంప్రదాయ విశిష్టతను ప్రత్యక్షంగా మన కళాకారులు చూపించలేకపోయి వుండవచ్చు. దీని ప్రత్యక్ష ఫలితమే మన కూచిపూడి నాట్యమును భరతశాస్త్ర సంప్రదాయ సిద్ధమైనదిగా సంగీత నాటక అకడమీ గుర్తించకపోవటం. నటులు తమ పేర్లకు నాట్యదేవత పేరును ఒక ఆహార్య విశేషంగా వుంచుకోవటం శిరోజాలు పెంచుకోవటం నటుల నాట్యకళా పరిపుష్టికి నిదర్శనాలు కాజాలవు.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకడమీ నాట్య ఉపసంఘంలో నాట్య ప్రయోగములో సుశిక్షితులై తమ సంప్రదాయంలోని విశిష్ట గుణాలను ఇతరులకు ప్రదర్శనాల ద్వారా కళ్లకు కట్టినట్లు చూపగల ప్రతిభావంతులు ఎందరు వున్నారు.? ఈ శాస్త్రంతోను, దీనికి సంబంధించిన అనుబంధ కళల

తోను, వీటి పరిణామ పూర్వకమైన చరిత్రతోను సన్నిహితంగా వుండి ఈ రంగంలో కృషి చేస్తున్న శాస్త్రజ్ఞులు ఎందరున్నారు? వీరి కృషిని సమన్వయం చేయటానికి, పరిస్థితులు అవగాహన చేసుకోవటానికి ప్రాంతీయ అకడమీ ఏం కృషి చేస్తున్నది? ముఖ్యమైన విషయాలను గురించి నిర్ణయాలు చేయవలసిన సందర్భంలో కూడా వ్యవధి లేకుండా సభ్యులకు మీటింగు నోటీసులు పంపటంవల్ల నాట్య శాస్త్రంలో ఎక్కువ పరిజ్ఞానం లేకపోయినా, అనువంశికమైన, అనాది సిద్ధమైన అనుభవాన్ని వెల్లడించటానికైనా ఏ ఒకరిద్దరికీ కూడా అవకాశం లేకపోయింది.



"చచ్చినా బొత్తాలూడిరావడం లేదు;—నీతో వ్యవహారం తర్వాత తేల్చుకుంటాలే!! ..."

ఇటీవలి వరకు మన అందరి ఎదుటవుండి, కూచిపూడి నాట్యకళకు అపారమైన సేవ చేసిన వృద్ధమూర్తి, "కూచిపూడి నాట్యకళానిధి" అనే బిరుదమును, గండపెండేరాలు బహుమానము పొందిన వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి గారిని మనం అమూల్యమైన శాస్త్రభాండారముగ పరిగణించాము. ఆయన జీవించిన కాలంలో, వారి శాస్త్రవిజ్ఞానాన్ని భావికాలానికి వుపయోగపడేటట్టు గ్రంధరూపంలో వెలువరించటానికి తెలుగుదేశంలో ఎలాంటి కృషీ జరుగలేదు. వారివద్ద నాట్యాన్ని పట్టుమని నాలుగు సంవత్సరాలైనా శ్రద్ధగా నేర్చుకొని కృషిచేసిన నటీనటులు లేరు.

ఈనాడు అనేకమంది ఆయన శిష్యులమని చెప్పుకోవచ్చు. కాని వారిలో ఏ ఒక్కరైనా కూచిపూడి నాట్యంలోని విశిష్ట గుణాలను యథాతథంగా ప్రదర్శించగల ప్రతిభావంతులు వుంటే బాగుండేది. వారి పుత్రుడు చి॥ వేదాంతం జగన్నాథశర్మ, పలుసంవత్సరాలు వారి తండ్రివద్ద శిక్షణపొంది తెలుగుదేశంలోని పలుప్రాంతాలలో ప్రదర్శనాలు ఇచ్చాడు. కూచిపూడి నాట్యకారుల కోవకు చెందిన శ్రీ వెంపటి సత్యం కూచిపూడి నాట్యంలో ప్రతిభావంతుడై కీర్తివిస్తారుడైనాడు. ఆయన ఇతరనాట్య సంప్రదాయములలో కూడా ప్రవీణతను అలవరచుకున్నారు. కాని, వీరందరూ కూచిపూడి నాట్యాన్ని గాకుండా వ్యావహారికమైన సినిమా నాట్య పద్ధతులను జీవితాలంబనంగా చేసుకుంటున్నారు. అందువల్ల కూచిపూడి శిష్ట సంప్రదాయప్రదర్శన ఈనాడు దుర్లభమాతూంది. అనేకమంది యువకులు కూచిపూడి గ్రామం నుంచి, ఇతర పట్టణాలకు వచ్చి, అక్కడ కూచిపూడి నాట్యం అనే పేరుతో కలగాపులగంగా అన్ని సంప్రదాయాలూ మిళితంచేసి నేర్పుతూ నాట్యంలో అయోమయ పరిస్థితులు ఏర్పడటానికి కారణభూతులౌతున్నారు. దేశంలోని ప్రతిప్రాంతంలోనూ ప్రజలలో నాట్యకళాభిమానం వ్యక్తమౌతూంది. ఒకనాడు హేయంగాను, నిందాస్పదంగాను చూడబడిన నాట్యకళ ప్రజాభిమానం పొందుతూంది. శాస్త్రప్రవీణులు సాహిత్య కళాకోవిదులు అయిన ప్రభువుల ప్రోత్సాహంతో ఔన్నత్యం అనుభవించిన నాట్యకళ సాధారణ ప్రజలందరి అభిమానంవల్ల, ప్రోత్సాహంవల్ల, వృద్ధిపొందవలసిన పరిస్థితి ప్రజాస్వామిక యుగంలో ఏర్పడింది.

సాధారణంగా నాట్యం నేర్చుకోవటం, నాట్యప్రయోగం చేయటం, విశేషమైన ఆర్థికవ్యయంతో కూడివవిషయం. తమ పిల్లలకు నాట్యం నేర్పించే తల్లిదండ్రులు రెండుమూడు నెలల్లోనే ప్రదర్శనాలు చేయాలని కోరుతారు. తమపిలలు నాట్యతారలై ప్రశంసలు పొందాలని కలలు కంటారు. దీనికి అనుగుణంగానే, నాట్యాచార్యులు సాధకులకు రెండు అషపదులు, ఒకతరంగం నేర్పి ప్రదర్శనాలు చేయిస్తున్నారు. వెంటనే వాళ్ళ భావిజీవితాలను గురించి, కళావిశిష్టతనుగురించి ప్రశంసా పరంపరలు పత్రికలలో పడాలిసిందే. 1955 లో నేను. ఢిల్లీలో జరిగిన మొదటి జాతీయ నాట్యోత్సవానికి వెళ్ళినపుడు ఇలాంటి పరిస్థితే తటస్థించింది. ప్రశంసలు చేయటానికి శాస్త్రం తెలిసిన పండితులకంటే వ్యక్తుల అధికారపు విలువలు బాగా ప్రచార సాధనాలుగా ఉపయోగపడుతున్నవి. సాధారణంగా బహు కొద్దిమందిమాత్రమే వీటికి అతీతులుగా వుండగలరు. అసలు మన నాట్య సంప్రదాయంలో ఒక నిర్ణీతమైన శిక్షణాప్రమాణం లేకపోవటంవల్ల నాట్యాచార్యులలో చాలామందికి శాస్త్ర కౌశలంగాని, పరిచయంగాని, దీర్ఘకాలిక సాధనా ఫలితంగా లేకపోవటంవల్ల ఈనాడు నాట్యకళలో అవ్యవస్థ ఏర్పడింది.

కూచిపూడి నాట్య సంప్రదాయానికి కూడా ఒక శిక్షణాక్రమం ఏర్పరచాలని అనేక పర్యాయములు విజ్ఞప్తి చేశాను. ఇప్పుడు అలాంటిపనిని చేయటానికి సంగీత నాటక అకడమీ ఉద్యుక్తమైంది. కాని కూచిపూడి నాట్య సంప్రదాయమును శాస్త్రవిహిత సంప్రదాయం కాదని సంగీత నాటక అకడమీ చేసిన నిర్ణయంతో అసలుకే మోసం వచ్చింది.

శ్రీ ప్రేందేవ్ ఘోష్, శాంతినికేతన్ నుంచి కూచిపూడి వచ్చినపుడు యక్షగాన ప్రయోగం, కూచిపూడి నాట్యప్రదర్శనం చేయించి ఈ సంప్రదాయ విశిష్టతను ఆయనకు సహేతుకంగా, శాస్త్ర విహితంగా వివరించాను. ఆయన సంగీతనాటక అకాడమి సభ్యుగు. నటుల పరిజ్ఞానమునకు ఆయన అబ్బురపడినాడు.

కూచిపూడి నాట్య సమగ్రస్వరూపాన్ని తెలుసుకోవటానికి ముందు భరతముని నాట్యశాస్త్రంలోని ప్రధాన సూత్రాలు, లక్షణములు, ఉపయోగములు, వాటి పరిమితి మొదలైన అంశాలు తెలుసుకోవటం అవసరం. కోహళ, నందికేశ్వర, వాయునందన, నారద, ఫల్గుణ, శుక్ర, యాజ్ఞవల్క్య 'భరత ముని భరతములు ప్రాచీన నాట్య లక్షణాలను వివరిస్తున్నవి. ఇవి చతుర్విధాభినయ

# ★ కూచిపూడి నాట్యం ★

విధానములను వాచిక, సాత్త్వికాహార్యాభినయ లక్షణములను, హస్త ద్వాదశ ప్రాణముల తెరగులను, 26 అసంయుత హస్తములను, షోడశ హస్త స్వరూపమును, 28 నృత్యహస్త స్వరూపమును, 28 నృత్య హస్తములను, 14 విధములైన శిరోభేదములను, 20 దృష్టి భేదములు, పాదభేదములు నవరసాలంకారములు వీటిలో స్పష్టపరచబడివున్నవి.

తొలినాట్యకారుడైన భరతముని నాట్యశాస్త్రం వెలువడిన పది శతాబ్దాల వరకు నాట్యలక్షణ గ్రంధాలు ఏమీ వెలువడలేదు. క్రీస్తుశకం 11 వ శతాబ్దారంభంలో అభినవ గుప్తాచార్యుడు భరతుని నాట్య శాస్త్రానికి వ్యాఖ్య వ్రాశాడు. ఆ వెనుక శోఢల దేవుని పుత్రుడు, శార్ఙ్గదేవుడు "సంగీతరత్నాకరం" అనే లక్షణగ్రంథంలో, కొన్ని దేశి సంప్రదాయములలోని శిష్టగుణాలను, మార్గదేశి పద్ధతి క్రింద గుర్తించాడు. అప్పటి మంచీ, నాట్యం, నాట్యధర్మి అనీ. లోకధర్మి అనీ, రెండు సంప్రదాయాలుగా స్థిరపడి సమాజంలో స్థానం ఏర్పరచుకున్నవి. భరతముని చెప్పని 88 కారణాలు, 24 అసంయుత హస్తములు, 18 సంయుత హస్తములు, 55 చాలనములు, అయన పేర్కొన్నాడు. భరతుని కాలం నాటి ఎనిమిది రసములను అటు పిమ్మట అలంకారికులు నవరసములుగ గుర్తించినారు. ఆంధ్ర కర్ణాటక దేశమును పాలించిన కాకతీయ రాజుల కాలంలో జయప్ప సేనాని వ్రాసిన 'నృత్తరత్నావళి' తత్రాపి నేటి వరకు, నాట్యలక్షణానికి ప్రమాణగ్రంథంగా గుర్తించ బడుతూంది. ఈ శాస్త్ర గ్రంథం యిప్పటి వరకు తాళపత్రాలలో వుంది. కాబట్టే యీ శాస్త్రాన్ని యింతవరకు పరిశీలించిన పండితులు లేరు.

కూచిపూడి నాట్యకళా చరిత్రను తెలుసుకోవటానికి, శాస్త్రరూపం గ్రహించటానికి, ప్రాచీన దేవాలయ శిల్పములు సాహిత్యాధారములు, చారిత్రక నిదర్శనములు మనకు తెన్నుగ ఉపకరిస్తున్నవి. ఆంధ్రదేశ చరిత్రలో తొలిసారిగ కూచిపూడి నాట్య ప్రసక్తి రాక పూర్వమే, దేశాన్ని పరిపాలించిన రెడ్డి రాజుల కాలంలోకూడా సామాన్య ప్రజలకు దొమ్మరిసానుల ప్రదర్శనములు వీధి నాటకములు ప్రజా వినోదములుగా వుండినప్పటికి, రాజులు సంగీత కళాప్రవీణులై, అనేక సంగీత శాస్త్ర గ్రంథములను వ్రాసి సంగీత నాట్య శాస్త్రములను ప్రోత్సహించినారు. ఆ కాలంలో రాజమహేంద్రవరాన్ని ఏలిన రెడ్డి రాజులు శైవులు. వీరికి శివపూజ ప్రధానమైనది. ప్రతినిత్యము వీరు ఆరు మారులు సదాశివుని పూజించుట ఆచారముగ నుండినది. అందువల్ల అర్చనా విధానంలో:

"దీపం దర్శయామి
ధూపం దర్శయామి
నృత్యం దర్శయామి" అని ఉచ్చరించేవారు.

నాట్యం ఒక ముఖ్యాంగమైనది. అప్పటికే దేశంలో శైవమతంతోపాటు వైష్ణవం కూడా స్థానం ఏర్పరచుకున్నది. అందువల్లనే వారివారి శాఖా సంప్రదాయములను అనుసరించి వేదాలు చదవటం, నాట్యాలు ప్రదర్శించటం ఒక ఆచారంగా పరిణమించింది. అప్పటినుంచీ దేవాలయ మాన్యములు, వృత్తులు అమలులోకి వచ్చినవి. ఈ కాలంలో జీవించిన పాల్కురికి సోమనాథుడు వ్రాసిన "పండితారాధ్య చరిత్ర"లో నాట్యోపాంగములు విపులంగా వర్ణించబడినవి. శ్రీశైలము అప్పుడు మహాప్రసిద్ధివహించిన శైవక్షేత్రం. మహాశివరాత్రి పర్వదినంబున అక్కడ జరిగే వినోదములు, నాట్య ప్రదర్శనములు మనోజ్ఞంగా వర్ణించబడినవి. అప్పటికే, భరతముని అనంతరం, అనేకమైన నూతన నాట్య సంప్రదాయాలు శిష్టుల ఆమోదం పొంది మార్గపద్ధతులుగ అంగీకారంలోకి వచ్చినవి. అప్పటి మంచీ పురుష నాట్యం తాండవం అనీ, స్త్రీ నాట్యం లాస్యం అనీ వ్యవహారనామాలు దాల్చినవి. ఉద్ధతమైన తాండవం సదాశివునకు ప్రియంకరమైనది. తాండవం, లాస్యం, రెండుమార్గపద్ధతులూ, రాజులచేతను, ధనవంతులచేతను, ఉత్తమ కులమునకు చెందిన పండితులచేతను అభిమానించి ప్రోత్సహించబడినవి. దేశినాట్యపద్ధతి సామాన్య జనుల వినోదంగా పరిగణన పొందింది. శ్రీశైల క్షేత్రంలో 64 నాట్యకూటములు వుండినట్టు ప్రసిద్ధి.

కాకతీయుల పరిపాలనానంతరం తెలుగు దేశంలో మార్గదర్శి నాట్య సంప్రదాయం విశేషవ్యాప్తిపొందింది. ఆ కాలంలో విద్వత్కవులు, పండితులు, నాట్యాలంకార శాస్త్రములు చదివినారు. 'సోడశి కుమార చరిత్ర' వ్రాసిన సూరామాత్యునకు అభినవ భరతాచార్యుడని ప్రసిద్ధి కలిగినట్టు తెలుస్తుంది.

కొరవి గోపరాజుకవి నాట్యకళాశాస్త్ర వైదుష్యాన్ని యిలా వెల్లడించాడు:

"గంధర్వులు పదునాల్గు దోషములు
దక్కన్ చాళమానంబులన్
గాంధర్వంబు ధ్రువాప్రబంధ పరిణీన్
గావింపగా వాద్యముల్
ధిం ధిం ధిక్కధిమిక్క తక్కధికతోం
ధిక్కతో ఝుక్కణిం
ధిం ధాం ఝుంకకు ఝుక్కధిగ్గిడదిధా
ధీయించు ప్రోసెన్నసన్"
సింహాసనద్వాత్రింశిక.

అటుతరువాత కాలంలో శ్రీనాథకవి "కాశీఖండంలో" ఆకాలంలోవున్న మార్గదేశి పద్ధతులు వర్ణించాడు.

"దత్తిలి కోహళ, భరత, మతంగ నంది
కేశ్వరాదిమతానుసారంబున, వివిధ ప్రబం
ధముల నిర్మించి, దానికి బహువిధసాన
మండల చారీకరణాంగ హారరేచకదశన
వర్తనాది శిరోభావ చక్షుర్భ్రువచాల
నంబులు మెరయ దేశి మార లాస్య
తాండవంబులు పరిఢవించు" (వచనం)

విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయలు సాహిత్య కళాభూషణుడు. ఆనాడు నిర్మించిన 'లేపాక్షి' లోని దేవాలయ శిల్పములు అపూర్వమైన నాట్య శాస్త్ర విజ్ఞానమును వెల్లడిస్తున్నవి. దేవాలయపార్శ్వంలో ఒకచోట సదాశివుని ఆనందతాండవం చెక్కివుంది. హంపి, ఆనెగొంది, సోంపల్లి హజార రామాలయం, సర్వణ బేలూల, మొదలైన ప్రాంతాలలోని శిల్పాలు అప్పటి నాట్యకళా పరిణతిని చాటుతున్నవి.

శ్రీకృష్ణదేవరాయలు నాట్య ప్రియుడు అంతఃపురంలోని స్త్రీలకుకూడా నాట్యంలో శిక్షణ యిప్పించటానికి శిక్షణాలయాలు వున్నట్టు తెలుస్తుంది. రాజు సమక్షంలో శిష్ట నాట్యప్రయోగాలు జరిగినవి. నాట్యమంటపమును మొదట నిర్మాణం చేయించి అక్కడ ప్రయోగ విధానం కూడా, చిత్తరువులలో చెక్కించినట్టు నాట్యమంటప వర్ణనవల్ల తెలుస్తూంది. ప్రస్తుతం ఆ ప్రాచీన శిల్పములు గాని, చిత్తరువులుగాని, మనకు లభించటం లేదు కాని విదేశ చరిత్రకారుడు, పెయస్ రచనవల్ల ఆకాలంలో భరతశాస్త్ర విజ్ఞానం, ఎలా ప్రచారం పొందింది, ఎటువంటి మహోజ్వల దశలో వుండినది, తెలుస్తున్నది. నాట్యమంటపం వెనుక భాగంలో సాధకులు వ్యాయామం చేయుటానికి ఒక వ్యాయామశాలను కూడ నిర్మించినట్లు వర్ణించారు. ఆంధ్రుల నాట్యకళా విశిష్టత శ్రీకృష్ణదేవరాయల కాలంలో రాజసభా గౌరవం పొందినది. ఆనాడు భరత నాట్య శాస్త్రకోవిదులైన పండితులు వర్ధిల్లినారు. వీరివద్ద తౌర్యత్రికంలో శిక్షణ పొందిన రూప విలాసినులైన దేవదాసీలు మహదైశ్వర్యంతో తులతూగుతూ, నాట్యకళాలక్ష్మికి కూర్మి పుత్రికలైనారు. వారు తమ అపూర్వ నాట్యకళా విజ్ఞానముతో రాజోత్తముని, ఉన్నత వంశమునకు చెందిన పండితులని రంజించినారు. ఉత్తమ భరత శాస్త్ర ఉత్తమ సంప్రదాయాలను మిళితం చేసుకున్న కూచిపూడి నాట్యం శాస్త్ర సమ్మతమైనది కాదంటే మిన్నకుండట మేనా! ★

# పెరట్లో నయాపైసలు

**రాజేంద్ర**

“లాభం లేదబ్బాయ్! నువ్వు అరువు... గీపెట్టి నా తిమెత్తుకో... నేను మాత్రం చేసే...అంటే...పన్నెండు నయా పైసలకన్న ఎక్కువ చస్తే ఇవ్వను. ఊ... కానీ త్వరగా తీసుకో నాకు వేళవుతుంది మరి” అన్నాడు మాధవరావు. అని ‘ఈ వేళవుతుందీ’ అనేమాట అనకుండావుంటే బావుండేది. ఈ బలహీనతను ఇతను ఉపయోగించుకొంటాడనుకొన్నాడు. అనుకొన్నట్టే అనుకున్నాడు పావలాకు తక్కువిచ్చేటట్లయితే అంతబరువుగల బస్తాను తీసుకురావడానికి వీలేదన్నాడు. ‘అది బియ్యంబస్తా, బరువెక్కువ. ఎట్లాసార్’ అంటాడతను.

అయినాసరే మాధవరావు చేడకన్న ఎక్కువ ఇవ్వదలచుకోలేదు. తను ఇవ్వలేడుకూడాను. అంతగా అతను వొప్పుకోకపోతే తనే మోసుకొని వెళ్ళడానికికూడా నిర్ణయించుకొన్నాడు. ఆ నిర్ణయానికి రాగానే అతనిముఖంలో కనిపించిన ఆపటుదలను ఆ కుఱ్ఱవాడు గుర్తించి ఇక తగ్గడానికి తయారయ్యాడు.

“పోనీ మూణ్ణాలివ్వండిసార్” అన్నాడు.

మాధవరావుకు సంతోషం కలిగింది. కానీ రెండణాలకన్న ఎక్కువ ఇవ్వదలచుకోలేదు.

“లాభంలేదు. నీకిష్టమైతే తీసుకుని ముందుకునడువు. చేడకన్న ఎక్కువమాత్రం చస్తే ఇవ్వను. అంతే,” అన్నాడు.

“సరే పదండిసార్. రోజూ ఎంతో డబ్బు ఖర్చుచేస్తారు. మాకివ్వాలంటే మీకు మనస్సురాదు” అని కుఱ్ఱవాడు అవలీలగానే మూట తీసుకొని తలమీదవుంచుకొని, బరువుచేత కాబోలు ఒక్క మూలుగు మూలిగాడు.

ఆమూలుగు మాధవరావును అమితంగా కదిలించివేసింది. తను అతని రక్తమాంసాలు పిండుతున్నట్లనిపించింది. ‘అవును అతనన్నట్టు రోజూ ఎంతడబ్బు తగలేయడం లేదు! కేవలం శరీరకష్టంతో బ్రతికే ఈ కూలీకి పావలాయిస్తే ఏంపోతుంది పాపం! బాలతృప్తి పడతాడు. కాదు కానేకాదు. ఇలా ఆలోచించవలసింది ధనికులూ, పెద్ద ఉద్యోగులే కాని తనలాంటి గుమాస్తా కాదు. నిజానికి తనేమీ తగలేయడం లేదు ప్రతిపైసా మిగల్చడానికి ప్రయత్నిస్తూ వుంటే తప్ప గడవనేగడవదు. ఈరోజు పదినిముషాల ఘర్షణతో చేడ మిగిల్చాడు...ఇలా రోజూ పావలా అయినా తగ్గించవచ్చు-అంటే ఏ మన్నమాటా...మాసానికి ఏడున్నర రూపాయలు ఖర్చు తగ్గించగలుగుతున్నాడన్నమాట తను. ప్రతిరోజూ ఎన్నో కోరికలు కలుగుతుంటాయి...కాదు కోరికలనేవి ఎప్పుడో చచ్చిపోయినయ్...ఎన్నో అవసరాలు కలుగుతుంటాయి. బాగా ఆలోచించి వీలయినంతవరకు ఈ అవసరాల్ని తగ్గించుకుంటూ రావలసివస్తోంది. అలా తగించుకోకపోతే జీతం డబ్బు చాలనే చాలదు. ఈ అవసరాలు తగించుకోగలగడమనేది గొప్పేమీ కాదు. తప్పదుమరి. డబ్బులేనప్పుడు దానంతటదే ఊరుకుండి పోతుంది. అంతే...”

ఇల్లు వచ్చేసింది. ఇంటిదగ్గరకు ఆ ఇద్దరూ వచ్చేశారు మాధవరావుకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. తన జేబులో రెండు నయాపైసలుకన్న ఎక్కువలేదు ఆ కుఱ్ఱాడికి పన్నెండు నయాపైసలు లేదా చేడ యివ్వాలి. ఇంట్లో ఆవిడ దగ్గరవుందో లేదో వాస్తవానికి ఆవిడదగర వుండటానికి వీలులేనేలేదు. అది మొదటి తేదికాదు కనీసం రెండో తేదీ అయినా కాదు. లాభం లేదు ఉండదు.

“ఉండదు లాభంలేదు” అని గట్టిగా అంటూ తలుపు తట్టాడతను.

న్యాయంగా “శ్యామలా తలుపుతీ” అని పిలిచి తలుపు మెల్లగా మీటవలసింది కాని ఆ ఆదుర్దాలో తలుపును బాదాడు.

తలుపులోపల గడియపెట్టి లేదు స్త్రీయొక్క హృదయకవాటంలా దానంతటదే తెరుచుకొంది. ఎదురుగా అతని అర్ధాంగి శ్యామల అదిరిపడి అప్పుడే చిరిచాపమీద కూర్చుని ఆకుకూరలు వలుచుకొంటున్నదల్లా లేచి నిల్చుంది.

ఆమెముఖం విప్పారింది కళ్లు మిల మిలా మెరిశాయి. జాతు ముఖంమీదపడి నాట్యం చేసింది! పెదవులు అందంగా కదిలాయి: ముఖమంతా కళకళ లాడింది. మాధవరావు వాడిపోయిన ముఖంలో చిరునవ్వు వెలసింది.

“ఎందుకని తనరాక ఈమె కింత ఆనంద హేతువయింది. తనేం తెస్తాడని ఆమె ఆశ. ఈ దౌర్భాగ్యుడు ఏం తీసుకు రాగలడు! తన సాన్నిధ్యం ఆమె కెందుకంత ఇష్టం కలిగిస్తుంది! తనలాంటి దౌర్భాగ్యుడు...దౌర్భాగ్యుడు చేడ అప్పుకూడా తెచ్చాడు...అవును దౌర్భాగ్యుడు...ఇతనికి చేడ ఇవ్వాలిప్పుడు” అనే యీమాట పైకి అనేశాడు అనుకోకుండానే.

కుఱ్ఱాడు బస్తాక్రింద దింపి “ఎక్కడ వుంచమన్నారు బాబూ” అన్నాడు.

“అక్కడే వుంచు... అదిసరే...” అని కొంచెం విచారంతో భార్యకేసి తిరిగి “నీదగర ఒక్క పదినయాపైసాలు గానీ వుందా” అన్నాడు. ఆమె చేతినుంచి డబ్బు రాలేదు. పెదవులనుంచి చిరునవ్వు ఆగదంతా ప్రసరించింది. ఆమె అన్నిటికీ చిరునవ్వు నవ్వుతుంది. ఆమె అలా నవ్వినప్పుడల్లా ‘కష్టాల్ని ఇలా చిరునవ్వుతో ఎదుర్కోవాలి’ అని మాధవరావు అనుకోవడం మామూలు, ఇప్పటి ఆ చిరునవ్వుకు తెలుగు తర్జుమా “మనదగర ఆడబ్బు అనే పదార్థం ఎలా వుంటుందీ...లేదు” అని అతను సులభంగా తర్జుమా చేసుకొన్నాడు. మంచి అనుభవమున్న దేశభాషా దినపత్రిక సహాయ సంపాదకుడు ఆంగ్లభాషలోని వార్తను తెలుగులోకి తర్జుమా చేసినంత త్వరితంగా ఆమె నవ్వును అర్థం చేసుకోగలడు. ఇతర్లకు ఆమె నవ్వు అపరిచితమైన పక్షుల ‘కిచకిచ కూకూ’ భాషవంటిది. చూసి ఆనందించగలరు కానీ అర్థం చేసుకోలేరు.

“అతనికి చేడ యివ్వాలి. నాదగ్గర రెండు నయాపైసలే మిగిలివున్నాయి మిగతా నువ్వు సర్దాల్సిందే ఇప్పుడు. పెట్టెలోడా అలమరా గిలమరా అన్నీ వెతికి చూడు. ఆమాత్రం వుండకపోదు” అన్నాడు. అని ద్వారం అవతల నిల్చున్న కుఱ్ఱవాడికేసి ‘ఇదంతా వీడు వింటూవున్నాడు. ఇదేం బాగాలేదు” అన్నట్లు మళ్ళీ భార్యకేసి చూశాడు. ఆమె మళ్ళీ చిరునవ్వు నవ్వింది. తెలుగులో స్పష్టంగా “నేను అవన్నీ అంత చెత్తగా ఎప్పుడూవుంచను. ఎప్పటికప్పుడు సర్ది శుభ్రంగా అందంగా వుంచుతాను. వాటిల్లో ఎక్కడా అసహ్యంగా కానీలూ అవి ఇరుక్కొవడానికి వీలులేదు,” అని దానర్థం.

మాధవరావు నిట్టూర్చాడు. దానికి కుఱ్ఱ

# ★ పెరట్లో నయా పైసలు ★

కల భాషలో "ఇంక నాపాటేదో నేను పడ్తాను. సరే" అని ఆ పాటేదో పడటం ప్రారంభించాడు. పాండు జేబులు వెదికాడు. ఒక జేబులో అర్ధణా కాసు ఒకటి దొరికింది. అమిత సంతోషంతో "దొరికెన్" అని పైకిలేశాడు, చొక్కా జేబులోంచి రెండు నయా పైసల కాసు తీశాడు.

ఆ రెంటినీ శ్యామలమాసి చిరునవ్వుతో ఎంతో అందంగా తెలివిగా "రెండూ చేరి ఐదునయా పైసలు" అని తన తెలివితేటల్ని ఋజువుచేసుకొంది. నిజానికి ఇప్పుడామె చెప్పకుండావుంటే ఈ రెండు నాణేలూ కలిసి ఎంతవుతుందో తెలీక అతను గంటసేపు మథనపడిపోయేవాడు. ఎందుకంటే ఎంత లెక్క వేసినా ఆ రెండూ కలిసి పన్నెండు నయా పైసలు ఎన్నటికీ కానేకాదని స్పష్టంగా తెలుసుగనక!

కుఱ్ఱాడు తొందరపడుతున్నాడు. "నాకు టైమయిపోయింది. నన్ను పంపించేయండి బాబూ" అని అతను ఆదేపనిగా అరుస్తున్నాడు. మాధవరావుకు అతని మొఱ వినిపిస్తూనేవుంది. అతనూ తొందరపడుతూనే వున్నాడు.

"నా చిట్టితల్లి! కాస్త ఇల్లంతా వెదికి పెడుదూ! నీకు పుణ్యముంటుంది. ఎక్కడో ఒక రెండణాలు కనిపించకపోదు" అని అతను ఆమెదగ్గరగావెళ్లి ఆ చాపమీదే కూర్చున్నాడు 'ఉస్సురను'కొంటూ.

ఆమె "ఆల్ రైట్" అంటూ పెరట్లోకిపరుగెత్తింది. మాధవరావు "ఈ కుఱ్ఱాడు ఏమనుకొని పోతున్నాడో" అని కొంచం లజ్జగా చూశాడు. అతను తొందర పడుతున్నా 'తమాషా చూస్తున్నట్లు' కొంచం హుషారుగా వున్నాడు.

రెండు నిముషాల తర్వాత కుఱ్ఱాడిలో కదలిక కనిపించింది

"బాగుంది. చాల బాగుందిసార్. ఇట్లా గిరాకీలు రోజుకు రెండొస్తే చాలు! పోయి యింకోపని చూసుకోవలసినాళ్లం. మమ్మల్ని ఇట్లా ఆపేస్తే ఎట్లసార్" అన్నాడు అందరి కూలీల ఏకైక ప్రతినిధిలాగా అతనన్న మాటలకు మాధవరావు జాలిపడ్డాడు. నిజానికి ఆ సమయంలో తను జాలిపడవలసినది తనను చూచే అనే విషయం వెంటనే జ్ఞాపకం వచ్చింది.

మాధవరావు భార్య శ్యామల సంతోషంతో పొంగిపోతూ తిరిగివచ్చింది ఆమె చేతిలో ఒక ఐదు నయాపైసల రూక మిలమిలా మెరిసిపోతూ వుంది.

ఆ రూక నామె పైకి ఒకసారి ఎగరేసి, మాధవరావు తెరుచుకొన్న జేబులో పడేలా వేసింది మాధవరావు నోరు తెరుచుకుంది! 'పెరట్లో డబ్బెక్కడిది. పాతిపెట్టిందా! పెరట్లోని గ్లిరిసిడియా చెట్లో కాసిందా. లేదా ఆకొత్తిమొక్కకొత్తరకంనయా పైసలు కాసిందా! కాస్తే పాతనాణేలు కాయవచ్చు కొత్తవెలా కాస్తాయి. విచిత్రాల్లో విచిత్రం అతని ముఖంలోని ప్రశ్నలు ఆమెముఖం మీద ప్రతిఫలించాయి చిరునవ్వురూపంలో జవాబు వెలువడింది.

"మామూలే కదూ! స్నానం చేసేప్పుడు జేబులో ఏమైనా వుంటే తాము వాటిని దాచుకొనేచోటు అక్కడే కదూ మీకు".

"మొత్తం పదినయా పైసలయింది, మిగతరెండు నయా పైసలమాటేమిటి? రెండు నయా పైసలు సంపాయించు శ్యామలా చాలు అన్నాడు, అని తనూ ఊరికే కూర్చోలేదు. సంపాయించడం ప్రారంభించాడు. చొక్కా చేతుల మడుపుల్లో బస్ టికెట్ వుంచుకొనే అలవాటుందతనికి — అలాగ డబ్బుకూడా పొరబాటున ఎప్పుడైనా పడేసి వుండవచ్చునని చొక్కా చేతులు విప్పి చూశాడు. ఫలం నహీ హై! లాభంలేదు!

మెరుపులా లేచి పుస్తకాల అలమరా మీద 'మెరుపుదాడి' చేశాడు. చెత్త చాలా పట్టుబడింది. అసలు దొంగ పట్టుబడలేదు. 'కుచ్ భీ ఫల్ నహీ హై! నోయూస్! లాభంలేదు. తనో యూస్ లెస్ ఫెలో! అవును. తను వట్టి పనికిరాని చెత్త వెధవ. లేకపోతే ఇంత పెద్ద ఇంట్లో రెండు నయా పైసలు సంపాయించలేక పోవడమా! శ్యామల మేలు! ఐదు నయా పైసలు సంపాయించింది. "షీ ఈజ్ బెటర్ దాన్ మీ! నాకంటే ఆవిడే మేలు" ఈ మాట పైకి వెలువడింది.

శ్యామల చెత్త కాగితాలచెత్త బుట్టలో వెదుకుతోంది 'దేవుడు ఆమె కోరికను దయతో తీర్చుగాక. మే గాడ్ బ్లెస్ హర్!" అనుకొన్నాడు.

"బలే దొరికింది. దొరికింది" అని కేక పెట్టిందామె.

తన కామె (శ్యామల) మొదటిసారి దొరికినంత సంతోషంతో "దొరికింది దొరికింది" అంటూ తనూ పైకిలేచి రెండడుగులు వేసి, ఆమె చేయిలాక్కున్నాడు. ఏముందా చేతిలో! ఒక కార్డుముక్క!

"ఇదా" అని నిట్టూర్చాడు మాధవరావు. "అవును-ఇదే" అని ఆమె చిరునవ్వు సమాధానం.

"ఇప్పుడేం చేద్దామంటావు" అన్నాడు.

"ఆ పది నయా పైసలు, ఈ కార్డూ ఇచ్చేయండి. ఇంకా మూడు నయా పైసలు ఎక్కువే అవుతుంది. పోనీ యిచ్చేద్దాం" అందామె. ధర్మరాజు (రాణీ అనాలి కాబోలు!) ముఖంపెటి. ఆ ముఖాన్ని దగ్గరికీ తీసుకొని రెండు ముద్దులకు పైగా పెట్టుకోవాలనిపించిందిగానీ, రెండు నయా పైసల సమస్యమాత్రం తీరినట్లనిపించలేదతనికి.

'ఎంత అవమానం. ఎంత సిగుచేటు. కూలీకి రెండణాలివ్వుకోలేక ఒక ప్రభుత్వోద్యోగి పోషుకార్డులూ కవరూ ఇచ్చుకోవడమా. ఈ అవమానం తనకా? తనకు తక్కువ జీతమిచ్చే ప్రభుత్వందా! ఎవరిదైతేనేం! అందుకని తనదికానీ లే! ఇంతకూ ఆ కుఱ్ఱాడికి కార్డెందుకు.' మరో అసందర్భసందేహం — 'ఆ కార్డు ఆబుట్టలో ఎందుకుంది! అంతా మిస్టరీ!'

"అయితే నువ్వే ఇచ్చిపంపించేసెయ్! నావల్ల కాదబ్బా. ఈ కుఱ్ఱాళ్ళు నామాట వినరు" అన్నాడు ఒకసారి శ్యామలకేసి ముఖంత్రిప్పి, వెంటనే ప్రక్కకు తిప్పుకొని.

"తన చేతిలో వున్నదంతా ఆమెకిచ్చేశాడు. 'నా సర్వస్వం నీకే యిచ్చేసున్నాన'నే కవిత్వపుమాట జ్ఞాపకంవచ్చి దానిచుటూ ఓ చిన్నపద్యం అల్లుకున్నాడు. ఛందస్సులేని పద్యం. పొరవడిలేని గేయం! రసంలేని జీవితం అంతే' అనుకొన్నాడు.

"రైటమ్మా! నేను మా అమ్మకు జాబు రాయాలి! రైట్! రైట్!!" అంటున్నాడు కుఱ్ఱాడు

"ఈ కుఱ్ఱాడికి ఇంకా ఇంత ఉత్సాహమెక్కడిది? రెండు రోజులు ఎక్కడైనా ఉద్యోగంలో పడేస్తే చాలు, అంతా అణగిపోతుంది." అనుకొని తనకు పొగరణగిందా? అని ఆలోచిస్తూ, విజయగర్వంతో ఠీవిగా

# సూర్యోదయం

## పణాతుల రామచంద్రయ్య

సూర్యం దగ్గర్నుంచీ వచ్చిన జాబు చూసి హడలి పోయ్యాను. "వీణ్ణి పాతి పెట్టా! వీ డెక్కడ దాపరించాడు, ఏలి నాటిశని!" అనుకున్నాను. నేనిక్కడయినా నిమితంగా వుండటం వీడి కిష్టం లేదు కాబోలు! అసలిక్కడికి వచ్చేముందు వీడికి జాబు రాయటం నాదే తప్పయింది...

కృష్ణమూర్తి వస్తూండటం చూసి జాబు మడిచి జేబులో పెట్టుకున్నాను.

* * *

కృష్ణమూర్తికీ, నాకూ యాదృచ్ఛికంగా మైత్రి ఏర్పడ్డది. అదీ ఇరవై రోజుల కిందట. అప్పుడు నా తేరులో జరిగిన సాహిత్యసభకు నేనూ ఒక రచయితగా ఆహ్వానం పొంది హాజరయ్యాను. అప్పుడే కృష్ణమూర్తి కలిశాడు. ఇద్దరం ఒకరి నొకరం పలకరించు కున్నాము. 'నేను ఫలానా' అంటే 'నేను ఫలానా' అని సమాధా నించుకున్నాము. అదే మా స్నేహానికి నాంది. ఆ సభలో కృష్ణమూర్తి చదివిన రచన బాగుందని నేనూ నేను చదివిన రచన బాగున్న'దని కృష్ణమూర్తి పరస్పరం సర్టిఫికేట్లిచ్చుకున్నాము.

ఆ తరవాత కృష్ణమూర్తి రెండుసార్లు రాజమండ్రికి వచ్చాడు, ఈ ఇరవై రోజుల్లోనూ. ఆ రెండుసార్లూ మా యింట్లోనే గడిపాడు. మా ఆత్మీయత పెరిగింది. యాదృచ్ఛికంగా కలిగిన పరిచయం ఇరవై రోజుల్లో ఇంత గాఢమైత్రిగా మారుతుందని మేమను కోలేదు. కృష్ణమూర్తి ఆహ్వానాన్ని పురస్కరించుకుని నాలుగు రోజులనాడు ఇక్కడికి వొచ్చాను నేను.

కృష్ణమూర్తి కుటుంబమంతా నన్నెంతో ఆదరించింది. అందరూ నన్ను దగర బంధువు కన్నా ఎక్కువగా గౌరవించారు. చాలా పెద్దకుటుంబం కృష్ణమూర్తిది. వృద్ధులయిన తల్లిదండ్రులూ, ఉద్యోగులయిన అన్నలూ, చదువుకుంటున్న తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ—నిత్యమూ నిండుగా కలకలలాడే యిల్లు. ఒక చెల్లెలుకు నెలకిందటే పెళ్ళయిందట.

ఈ నాలుగు రోజులూ ఇక్కడ స్వంత ఇంట్లోలాగానే గడిపాను. ఇప్పుడు సూర్యం దగ్గర్నుంచీ వచ్చిన జాబు నాలో తుపాను రేపింది.

* * *

సూర్యం చిన్నతనంనుంచీ నాకు ప్రాణ మిత్రుడు. ప్రాణమిత్రుడి దగ్గర్నుంచీ వచ్చిన ఉత్తరము మనస్సులో యింత తుపాను రేప వలసిన అవసరము లేదు. కాని చిక్కేమిటంటే, సూర్యం అందరిలాంటి వాడు కాదు. రసికుడు. కన్నుగీటే తత్వం వుంది. అందులోనూ ఈ తత్వాన్ని అడ్డమైన చోటల్లా చూపిస్తాడు.

వీడి యీ రసికత్వం చదువుకునే రోజుల్లో అస్మదాదులకు బాగా అనుభవం. "పల్లెటూరునుంచీ ఇంతదూరం పట్నవాసం వొచ్చింది, నానా చెత్తవేషాలూ వెయ్యటానికొ్కాదురా బాబూ! మన మానాన మనం ఉందాం," అని నేనంటే, "అలా ఏడుస్తావేరా తేధ్యం! నీ ప్రాణానికేం భయం లేదులే" అనేవాడు సూర్యం, నా భుజం తడుతూ. నాకూ, ఇతర రూంమేట్సుకూ వీడి వాలకం "పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణ సంకటం"లా వుండేది. మేము వుంటున్నది సంసారుల మధ్యన ఓ గదిలో. ఈ సూర్యారాయ వతంసుడి రసికత్వం ఫలితంగా మా పెట్టే బేడా ఏ క్షణాన రోడ్డుమీద వుంటాయోనని మేం ప్రతిక్షణమూ హడిలి పోతుండేవాళ్లం.

చదువుకున్నన్నినాళ్ళూ వీడిదే వరస. ఆ తరవాతా ఇంతే. నేనూ, వీడూ యిద్దరమూ తెనాలి హైస్కూల్లో తాత్కాలికంగా పని చేస్తున్నప్పుడు జరిగిన సంఘటన నా జీవితంలో మర్చిపోలేను. ఎవరో ఆచార్లుగారి ఆండాళమ్మ—చాలారోజాలుగా పుట్టింట్లో వుండేట. కారణమేమిటో కనుక్కునేంత వరకూ వీడికి మెతుకు నోట్లోకిపోలేదు. తరువాత ఓరోజు వెళ్లి కనుక్కున్నాడు. అంతవరకే వాడెరుగును పాపం! ఆరాత్రే ఆమె తాలూకు బంధువులు పదిమంది రూం మీదికి వచ్చి నన్ను స్తోత్రం చేస్తుంటే, వీధివీధంతా పోగై ఈదృశ్యం చూసి ఆనందిస్తుంటే, వాళ్లొచ్చిన గంటన్నరసేపటికి ఏమీ ఎరగని అమాయకుడల్లే లేచి కూచున్నాడు. ఆ రాత్రంతా ఆ మనుషులతో చేరి రోడ్డు సేవ చెయ్యవలసివచ్చింది నేను, వీడితో కలిసి వున్న నేరానికి

అప్పట్నుంచీ, సూర్యంతో కలిసి వున్నప్పుడల్లా నాకు మనస్సులో బెరుగ్గానే వుంటుంది. వీణ్ణి సరసన వుంచుకోవటమంటే తేలును జేబులో దాచుకున్నట్టు.

వీడిప్పుడు వస్తానని రాశాడు. ఇలాంటి విక్షేపరాయుడు నాకోసమని ఇలాంటిగౌరవనీయమయిన ఇంటకి వస్తున్నాడంటే, నాకు భయం వేసింది. వీణ్ణి నమ్మవుండటంఎలాగ? ఇకనుంచీ మిత్రుడు కృష్ణమూర్తిలో కులాసాగా కాలం గడపటంపోయి, వీడికి సి. ఐ. డి. గా అఘోరిస్తూవుండాలి కాబోలు!

అసలు తప్పంతా నాది. లేకపోనే ఇక్కడికి వచ్చేముందు, వసున్నానని వీడికి జాబు దేనికి రాస్తాను? రాశానుపో, అందులో కృష్ణమూర్తి ఇంటి అడ్రసుకూడా ఎందుకు రాస్తాను? అందుకే అనుభవిస్తున్నాను... వీడికీ ఈ మధ్యనే పెళ్ళయిందట. రాస్కెల్, శుభలేఖఅయినా పంపించాడు కాడు!

ఇందాక సాంతం చదవలేదు. అంచేత మళ్ళీ ఓసారి జాబుమడత విప్పాను, డాబా మీద కూచుని :

"భానుమూర్తికి, శ్రీ సూర్యనారాయణిం గారు వ్రాయునది.

శిష్యా,

నెలక్రిందటనే నాకు వివాహంబైనది. కొన్ని అనివార్య కారణంబుల కతంబున, వివాహం బతిశీఘ్రుంబుగా స్థిరపడిన కతంబున, నీకు శుభలేఖ పంపలేనైతి. అగ్రహింపకుము.

నీవు విజయవాడలో నీమిత్రుని గృహ

---

వడిచివస్తున్న శ్యామల నడుం ముందుకు వంచి దగ్గరకు లాక్కున్నాడామెను. అప్పుడామె ఆ బస్తాలోని బియ్యం తీసి చెరిగి రాళ్ళు వేరుచేసి అన్నంవండాలని ఆలోచిస్తోంది!

శ్యామల ఒక మంచిపిల్ల!
పది నయాపైసల విలువచేయును!
పదిముద్దుల ఖరీదు పదినయాపైసలు!
కాదు పది జీవితాల ఖరీదు!?

అని మానసికంగా పాడుకున్నాడు రెండు నిండుమనసులతో.



# ★ సూర్యోదయం ★

మ్మని బసచేసియున్నట్లు నీజాబువలన తెలిసి కొని, కడుముదం బందితిని. నేను ఎల్లుండి ప్రొద్దునే ధూమశకటములో విచ్చేసెదను. స్టేషనుకడకువచ్చి స్వాగత మొసగితోడ్కొని పొమ్ము.

—సూర్యారావు."

వ్యాకరణాన్ని చీల్చి చెండాడి రాసినట్టున్నాడు. రాయకేం? తాతలు సంపాయించి యిచ్చింది ఇంతవుంది. అది తింటూ, ఇలా ఎన్నైనా రాయొచ్చు.

నేను మిత్రుడి యింట్లో హాయిగా గడపడంకూడా వీడికి ఇష్టంలేనట్లేవుంది. ఇక్కడి కొక్కడా తయారౌతున్నాడే, వీణ్ని ఏం చేస్తే పాపంవుంది?

వీడికి స్టేషనుకు వెళ్లి స్వాగతం పలికి తీసుకురావాలిట. ఉహూ వెళ్లను. ఎందుకూ, ఇక్కడకూడా ఒకటిరెండు ఘనకార్యాలు వెలిగించమని స్వాగతం చెప్పడం? "వస్తే వస్తాడు – రాకపోతే పోనీ! స్టేషన్లో దిగిన వాడు కొంపచేరుకోలేడూ?" అనుకున్నాను.

కాని, మరుక్షణంలోనే, స్టేషనుకు వెళ్లటమే ఉత్తమ మనిపించింది. స్టేషనుకువెళ్లి, ముందుగానే అడ్వాన్సుగా నాలుగుచివాట్లు పెట్టి, ఇక్కడ బుద్ధిగా మెలగాలనిచెప్పాలి: ఇది గౌరవనీయమైన కుటుంబమనీ, వెధవ వేషాలువేస్తే ఒళ్ళు చదునౌతుందనీ హెచ్చరించి, నోరు మూయించి తీసుకు రావాలి. లేకపోతే లాభంలేదు. అంచేత స్టేషనుకు వెళ్ళటమే మంచిది.

అలాగే డాబామీద కూర్చునివున్నాను. కృష్ణమూర్తి వచ్చాడు.

"నీకెక్కణ్నుంచో జాబొచ్చినట్టుంది" అన్నాడు.

"అవును (ఫ్రెండొకడు రాశాడు. రేప్పొద్దున ప్యాసింజరులో ఇక్కడికి అఘోరిస్తాట్ట" అన్నాను.

"అఘోరించడ మెందుకూ?.....నువ్వేదో మొహమాట పడుతున్నట్టుంది...ఓయి వెర్రి వాడా! నీతాలూకు (ఫ్రెండ్సుగాని, బంధువులుగాని వెయ్యిమంది వచ్చినా ఈవూళ్ళో మరో గడప తొక్కేందుకు వీల్లేదు; సరా! అలాంటివేం పెట్టుకోక" అన్నాడు కృష్ణమూర్తి.

"అందుకోకాదు బాబూ." అన్నాను.

"మరింకెందుకు?—నీ (ఫ్రెండు సరైన వాడు కాడా?"

"సరైనవాడే—" అన్నాను.

కాస్సేపు నిశ్శబ్దంగా గడిచాక కృష్ణమూర్తి అడిగాడు.

"మరి ఎప్పుడు వస్తాడన్నావు?"

"రేప్పొద్దున బండికి స్టేషనుకెళ్ళి స్వాగతం చెప్పాలిట." అన్నాను.

"వెళ్లకుంటే ఎలాగోయ్? చిన్ననాటి మిత్రుడన్నావు...పైగా అతడికి ఇల్లుకూడా కొత్తయ్యె. స్టేషనుకు వెళ్ళకుంటే ఇబ్బంది పడిపోతాడు పాపం. పొద్దున్నే నేను నిద్రలేపుతాలె ఇద్దరం వెళ్లొద్దాం."

"నువ్వెందుకోయ్ మళ్ళి, నిద్రపాడు చేసుకుని" అన్నాను. కృష్ణమూర్తి కూడా వస్తే నేను సూర్యాన్ని నాలుగూదులిపెయ్యడానికి వీలుండదు.

"నిద్ర పాడుచేసుకోడ మేమిటి, పొద్దున పూటకూడా! (ప్రతిదానికి ఇంత కొతేమిటి నీకు? ఇద్దరం కలిసే వెళదాం. పొద్దున్నే మసకచీకట్లో నువ్వు ఒంటరిగా వెళ్ళలేవు కూడాను. నీకు నిద్రమత్తెక్కువ. ఆ మత్తులో, రైలుస్టేషనుకు వెళ్ళవలసింది పోయి, రామనాథయ్యరు హోటల్లో దూరినా దూరుతావు." అన్నాడు కృష్ణమూర్తి.

ఆరోజురాత్రి పడుకోబోయేదాకా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సూర్యాన్ని మనసారా తిట్టుకుంటూనే వున్నాను. ఇక అంతకన్నా ఏంచేస్తాను గనక?

* * *

పొద్దున్నే కృష్ణమూర్తి అశ్వమేధయజ్ఞం చేసినంత పనిచేసి నన్ను నిద్ర లేపాడు. అతడు గ్లాసుతో చన్నీళ్ళు తెచ్చి నా మొహం తుడిపించి, వీధి గుమ్మందగ్గర రిక్షాలో చేరవేశాక, కాస్త మనుషుల్లో పడ్డాను.

మేము స్టేషనుదగ్గిర దిగామో లేదో అప్పుడే ప్యాసింజరు ఓంద్ర పెట్టుకుంటూ వచ్చి స్టేషన్లో ఆగింది. కృష్ణమూర్తి గబగబా పరుగెత్తుకెళ్ళి ప్లాట్ ఫారం టిక్కెట్లు తెచ్చాడు. ఇద్దరం తొందరగా బండికేసి నడిచాము.

వరసగా ఒక్కొక్క కంపార్టుమెంటు చూసుకుంటూ ఓ సెకండ్ క్లాసు దగ్గిరకి వచ్చేసరికి మావాడు కనిపించాడు. పాలం విమానాశ్రయంలో, నెహ్రూ ప్రభృతులు తనకు ఎదురొక్కలివ్వటానికి రాగా, మందహాసం చిందిస్తూ విమానందిగే ఫారిన్ లీడరులాగా రైలు దిగుతున్నాడు సూర్యం. నాకు మండుకొచ్చింది. "ఏం పోజురా, పింజాకూడు ఫోజు?" అని స్వగతం చెప్పుకున్నాను. నన్ను చూసి, అభయ మిస్తున్నట్టుగా నవ్వాడు వాడు.

నా వెనకాలే వస్తున్న కృష్ణమూర్తి సూర్యాన్ని చూడగానే "బావ!" అన్నాడు సంభ్రమంగా, వాడిచేతులోని బెడ్డింగు తను తీసుకుంటూ.

నేను ఆశ్చర్య పోయాను. పెద్ద తారాగణం లేని చిత్రం బాక్సాఫీస్ హిట్ అయినప్పుడు డైరక్టరు కూడా అంత ఆశ్చర్యం పొందడు!

"సరి సరి! ఈయనే నన్నమాట నీ (ఫ్రెండు?—చంపావ్ పో. ఈయనే మా బావ. మా శశి నిచ్చింది ఈయనకే," అన్నాడు కృష్ణమూర్తి.

నా నోరు తెరుచుకుని అలాగే వుండిపోయింది. కళ్లు రంయ్యిమని తిరిగినయ్. అలాగే చూడసాగాను.

"తినేసేటట్టుగా అలా నోరుతెరుచుకు చూస్తావేంరా, రాచ్చిప్పా! పైత్యంగాని తలకెక్కలేదు కద! ఇంతకూ కదిలివస్తావా, లేక ఎవర్నైనా పిలవాలా?" అన్నాడు సూర్యం.

కృష్ణమూర్తి కూడా నవ్వుతున్నాడు. నేను యాంత్రికంగా వాళ్లనుఅనుసరించాను.

"సూర్యం ఈయింటికి అల్లుడన్నమాట! థ్యాంక్ గాడ్! ఇక వీడిమీద సి. ఐ. డి చేయ్యవలసిన అవసరం తప్పిపోయింది," అనుకున్నాను. కృష్ణమూర్తి జట్కా తెచ్చాడు. ముగ్గురం ఎక్కి కూచున్నాము. జట్కా కదిలింది. నేను మతుపదిలిపోయి తేలిగ్గా, బారెడు పొడుగున నిట్టూర్చాను.

★

దీహరా

సాయంకాలం నాలుగు అయింది.

అప్పటికప్పుడే వెళ్ళిపోవాల్సిన జనతా ఇంకా రానేలేదు. సిగ్నల్ ఇచ్చి అరగంట దాటుతోంది.

డౌన్ మెయిల్ టైము కూడా కావడం చేత ప్లాట్‌ఫారం అంతా క్రిక్కిరిసి పోయింది. ఉబుసుపోక ప్లాట్‌ఫారంమీద అటూఇటూ తిరిగే అబ్బాయిలు, కూలీవాళ్లు హడావుడిగా తిరుగుతూన్న రైల్వే అఫీసర్లతో ప్లాట్‌ఫారమంతా నానాగోలగానూ ఉంది.

వీలర్స్‌లో కొన్న పత్రిక కాస్తా చూసెయ్యడం అయినతర్వాత ఇంకేం చేయాలో తోచలేదు శశికి. సరిగ్గా, అదేమిటో, తనొచ్చినప్పుడే ఆలస్యమవుతూంటూంది రైలు!

శశి యూనివర్సిటీలో ఫిఫ్త్‌ఇయర్ లిటరేచర్ చదువుతోంది. అప్పుడేం సెలవుల్లేకపోయినా ఇంటిదగ్గర్నుంచి వెంటనే రమ్మని టెలిగ్రాం రావడంతో ఖంగారుగ బయలుదేరింది. క్రితం సెలవులికి పోయినప్పుడే చెప్పారు నాన్నగారు తను చూస్తున్న ఓ ‘మంచి’ సంబంధం గురించి. కాని ఆయన ఎదుట ఏమీ చెప్పలేక నసిగినా తల్లితో చెప్పనే చెప్పింది తనకప్పుడే అలాంటివేమీ ప్రస్తావించవద్దని.

అసలు యూనివర్సిటీలో చేరేటప్పుడే ఈ విషయం తలెత్తింది. కాని అప్పుడు నాన్నగారే అడ్డులన్నీ త్రోసి తన్నిక్కడికి ప్రోత్సహించి పంపించారు. అయినా ఇప్పుడు ఆయనే తన పెళ్ళివిషయంలో ఇంత శ్రద్ధ జూపడం చూస్తే ఆమెకి దిగులుగా ఉంటుంది. పోనీ కనీసం తను చదువు పూర్తయిందాకానైనా తన వివాహవిషయం వాయిదా వేయమని ఎంతగానో బ్రతిమలాడింది. అయినా ఈ ‘వరాన్వేషణ’ మాత్రం ఆగలేదు. కాకపోయినా ఇరవైయేళ్ళు పైబడిన తను వాళ్లకి భారంగాదూ!

పూర్తిగ ముందడుగు వేయని ఈ సమాజంలో తను ఆనర్సు పాసయితేనేం చిట్టచివరికి ముక్కూ మొగం తెలియని ఏపరాయివాడినో కట్టుకొని అతనిమీద ఆధారపడి బ్రతకాల్సిందేగా! తనలో ఏదో శక్తి ఈ “విశ్వల విశ్వాన్ని” ఎదుర్కొమంటుంది. ఎవరో తనని బాగా తెలిసి తను ప్రేమించిన ఏ క్లాస్‌మేట్‌నో పెళ్ళిచేసుకుని అతనితోపాటూ తనూ ఉద్యోగం చేసుకొంటూ



స్వేచ్ఛాజీవనం చేయాలనుకొంటుంది... కానీ, ఆమెచుట్టూ లేచిన ఈ ఎత్తైన గోడల్ని ఛేదించగల ధైర్యం ఉందా, అనే శంక ఆమెని రాత్రింబవళ్లు బాధపెడుతుంది. అందరిలానే ఆమెకూడా ఈ సంఘానికి బానిస. పెద్దలేనాడో ఏర్పఱచి పెట్టిన ఒరవడి, ఆ ‘గాడి’ లోనే తనముందు వాళ్లెందరో నడిచారు. తనూ అందులోనే పోవాల్సిందేగా?



# పెళ్ళిచూపులు



అయినా, ఎందుకు తనకే అర్థంకాని ఆలోచనలు అని ఆమె అనుకొన్నా విడవకుండా ఆమెని వేధించాయి. వద్దనుకొన్నకొద్దీ ఇంకా ఆమె ఆ దుమారంలోకే పోతోంది.

తను మొన్న ఘాటుగా బాధతో వ్రాసిన ఉత్తరానికి సమాధానమే ఈ టెలిగ్రాం. బహుశా తనతో చెప్పిన ఆ ఇంజనీరుగారెవరో "చూడడానికి" వస్తూండాలి. తను పెద్దదయి నప్పటినుంచి పెద్దవాళ్ళదరికళ్ళూ అతనిమీదే ఉన్నాయి. తిన్నో గజెటెడ్ ఆఫీసర్‌కి కట్టబెట్టేస్తే సుఖపడుతుందని వాళ్ళ ఆశ.

తనలో మరోగొంతు వినబడ్తోంది. ఇంతకీ తను జీవితంలో కోరుకునే దేమిటి? శాంతి, సౌఖ్యం తప్పితే! డబ్బు చిక్కులు లేకుండా, 'అతను' అనువైన వాడైతే అంతకన్న తనకి కావలిం దేమిటి? క్షణంలో ఆమెలో భావిజీవితపు మధుర ఘట్టాలు ఆమె తలపుకి వచ్చాయి. ఎవరూ తెలియని 'వంటరి' ప్రదేశంలోనున్న సిగ్గుతో తల వంచుకు నవ్వుకుంది!

కాని అవచ్చే ఆయన మనస్తత్వం ఉద్దేశ్యాలు ఎవరికి తెలుసు? చదువుకున్న పెళ్ళాముంటే అసూయ పడ్తాడో! అప్పుడు తన జీవితం ఏమికాను. ఇంత చదివు చదివి నికృష్టంగా బానిస జీవితం గడపాల్సిందేగా! ఆమె ఒక్కసారి ఘట్టిగా నిట్టూర్చింది. ఏమైనా తెలియని వానితో వివాహము నేది రిస్కే అని ఆమెలో ఏదో ఎలుగెత్తి చాటుతోంది.

ఏమైనా, తండ్రితో ఘట్టిగా తన వివాహ ప్రసక్తి తేవద్దని చెప్పడానికి నిశ్చయించుకొంది. కాని ఎలాగ! తమ ఒకే ఒకబిడ్డ క్షేమంకోసం ఎంతో ప్రేమతో పెంచిన తల్లిదండ్రుల ఎదుటబడి వాళ్ళని నొప్పించడం ఎలా? ఆమెకి సమస్య చిక్కపడిపోయింది. ఆమెలో ఆందోళన, ఆత్రుత ఎక్కువై పోయాయి.

ఆమెలో రేగిన ఈ ఆలోచనల రొదని భేదించుకుంటూ గంట వినబడింది. ఉలిక్కిపడి చూసేసరికి అప్పుడే జనతాప్లాట్‌ఫారం సమీపిస్తోంది.

ఇంతలో కూలివాడు వచ్చి హోల్డాలు అందుకున్నాడు. ఆమె పోయేది ఏలూరేగాబట్టి, హైదరాబాద్ బోగీలకోసం వెయిట్ చేయాలనే పట్టింపులేదు. ఓఖాళీ కంపార్ట్‌మెంట్ చూసి కూలివాడు, క్రింది బెర్ మీద హోల్డాలు పరిచాడు. బండి ఎక్కేందాకా ఉన్న ఆత్రుతంతా పోయి బండెలో ఎక్కువగానే పర్వతమంత బరువు నెత్తిమీది నుంచి దించినట్టనిపిస్తుంది.

నలుగు రయిదుగురు మాత్రమే ఉన్నారు "To seat 24" అని వ్రాసున్న ఆకంపార్ట్‌మెంట్‌లో ఎవరో ఒక ముసలావిడ, పై బెర్త్ మీద ఓ అబ్బాయి ఇద్దరు కూలివాళ్ళు, ఓపల్లెటూరి ఆసామీ-ఇంతే. లోపలఅంతా ఓసారి పరకాయించి చూసి మళ్ళీ తన "ఆలోచనలగొడుగు" క్రిందికి చేరిందామె. కిటికీలోంచి బయటికి చూస్తున్నదన్న మాటేగాని ఏమీ కనబడ్డంలేదు. టైం గడిచినట్టే తెలియడంలేదు. కెనడియన్ ఇంజన్ ఓండ్రలాంటి కూతపెట్టి బయలుదేరినప్పుడు మళ్ళీ ఈలోకంలోకి వచ్చిందామె.

పుస్తకంతీసి చదువుతోందిగాని ఆమె మనస్సు అందులో లేదు. మధ్యమధ్య అప్రయత్నంగా ఆమెచూపు బయటికిపోతూనే ఉంది. కాల్టెక్స్ ఆయిల్ రిఫైనరీ పైన సూర్యకిరణాలు పడ్డంతో అదంతా ధగధగా మెరిసిపోతోంది. రైల్వేక్వార్టర్స్, నావల్ ఆర్మమెంట్ డిపోలు, ఏరోడ్రోమ్ అన్నీ ఒక్కొక్కటే వెనకబడి పోతున్నాయి. పెద్దగా ఘీంకరించి జనతా హోరున పరుగెడుతోంది.

అస్తమిస్తున్న సూర్యుడు, తనని ముంచెత్తుతున్న ఈ ఆలోచనలవరద, చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నట్టు తిరుగుతున్న పరిసరాలు, వాటన్నిటికీ కేంద్రంలాగా ఒంటరిగా తను— అదృశ్యమంతా తన్నీ పరిసరాల్నుంచిదూరం చేస్తున్నట్టనిపిస్తోంది.

రైలు వేగంతగ్గింది. అనకాపల్లి స్టేషన్ వచ్చేసింది. అట్టేసేపాగదు అజనతా. కనీసం ఓ పదిహేనుసార్లయినా అటూ ఇటూ తిరిగిన తనకి ఈస్టేషన్లన్నీ అతిపరిచయం ఉన్నవాటిలాగానే కనబడతాయి. అనకాపల్లి, తుని, సామల్‌కోట, రాజమండ్రి, నిడదవోలు—ఆతర్వాత ఏలూరు! ఎన్నాళ్ళు చూసినా ఇంతేగా.

"ఈస్టేషనేమిటి?" ఇంగ్లీషులో ఓకంఠం అడుగుతోంది.

క్రిందనున్న వాళ్ళెవరూ జవాబు చెప్పలేదు. తలపాగా చుట్టుకొని మాసిపోయిన తెల్లపొడుగుచేతుల చొక్కా పంచవేసుకున్న ఆ పల్లెటూరి ఆసామీ పట్టించుకోనట్టు బయటికి చూస్తున్నాడు. కాఖీలాల్చీ, నిక్కరూతొడుక్కొని తలపాగాజుట్టుకొనే తువాలు భుజంమీద వేసుకున్న అకూలీలిద్దరూ తెలుగులో చెప్పమన్నట్టు ఆ అబ్బాయికేసి చూశారు. తను ఓసారిచూసింది అతనికేసి. ఎవడోదూరంనుంచి వస్తున్నట్టున్నాడు. వేసుకొన్న తెల్లప్లాక్, పైజామా మడతలు నలగకుండా ఉన్న దూరప్రయాణపు చిహ్నాల తోటి నిండిపోయాయి. జుట్టంతా మసిబొగ్గు తాకిడికి పాడిగా బూడిదరంగు కొట్టుకపోయియుంది. పచ్చని శరీరం, కళ్ళజోడూ అతనూ ఎవడో తెలుగువాడిలా కనిపించడం లేదు అనుకుంది శశి.

అతన్నిచూస్తే, అతని ఇంగ్లీషు ఉచ్చారణ విన్న ఆకాసేపటిలోనూ ఆమె 'ఇన్‌సిన్‌క్టివ్' గా అర్థం చేసుకున్నదంతే. అతని ప్రశ్నకి సమాధానమియ్యాలని ఆమెకి తట్టలేదు. ఆమె మామూలుగా తన పనిలో మునిగిపోయింది. దూరంగా కూర్చొన్న ముసలమ్మ మాటపట్టుకు దిగిపోడానికి

ప్రయత్నిస్తూ దీనిసంగతే గమనించినట్లు లేదు.

అతను తలెత్తి పరిస్థితినంతా అర్థం చేసుకున్నట్టు తలూపి, క్రిందికురికి బయటికి చూశాడు. స్టేషనేమిటో తెలుసుకోవాలనే కుతూహలాన్నాపుకోలేక, ఆమె మళ్ళీ అతన్నింకోసారి చూసింది. పొట్టీ పొడుగూ కానివాడు, వేషం సరిగ్గా ఉంటే అందమైనవాడే అయిఉండొచ్చు అనుకుంది. చేతిలో ఉన్న పుస్తకం పేజీలు తిరిగేస్తూ.

అతనొక్కసారి ఆమెకేసి చూసి క్రింద బెర్త్ మీద ఆమెదగ్గరలోనే కూర్చున్నాడు. [illegible] ఒక్కసారి తీక్షణంగా చూసి, మళ్లీ పైకెళ్ళి చిన్నది కావడంవల చేసేదిలేక ఊరుకుంది. అతనేదో పుస్తకంతీసి వ్రాయడం మొదలు పెటాడు. మనిషి మొగంచూస్తే, ఏమంత అనుమానించ తగ్గట్టుగా కనిపించదు. పైగా ఎవడో తెలుగు వచ్చినవాడిలా లేడు. ఆపైన తనకి భయమేమిటి అనుకుంటూ ఆమె ఒకసారి కదిలి స్థిరంగా కూర్చుంది. కాని అతనలా అక్కడ కూర్చోడంతో ఆమె—ఏదో 'అనీజీ' గా ఫీలవుతోంది. అతనక్కణ్ణుంచి పోతే బాగుణ్ణు తను మారడానికయినా బండి నడుస్తోందాయె.

ఇంతలో అతను పుస్తకం మూసి "వచ్చే స్టేషనేమిటో కొంచెం తెలిసే చెపుతారా?" అనడిగా డింగ్లీషులో.

మొదలు పెట్టాడు సంభాషణ అనుకొంది విసుగ్గా. కాని కర్టసీ సమాధాన మీయకుండా ఉండనీయలేదు. అతను థాంక్స్ చెప్పి అలాగే బయటికి చూస్తూ కూర్చున్నాడు. వారిద్దరిమధ్యా నిశ్శబ్దం దట్టంగా ఆవరించి ఉంది. మధ్యమధ్య ఒకరొక్కరు చూసుకోడం తప్పితే వాళ్ళిద్దరూ ఎవరిపనుల్లో వాళ్ళు మునిగిపోయారు కాని వాళ్లిద్దరిలోనూ కూడ ఒకరినొకరు తెలియకుండానే ఆలోచనలు రేకెత్తిస్తున్నారు. అతని ప్రశాంతమైన చూపు, ఏమాత్రం భేషజంలేని, తొణకని మాటలు, మళ్ళీ వినాలనిపించే అగొంతూ, ఆమెని గట్టిగా ఆకర్షించాయి. కాని, ఏమాత్రం తెలియని అతనితో సంభాషణెలాగ పెంచేది?

వీరి ఈ మూగభావ లర్థం చేసుకున్నా వన్నట్టు, పెద్దగాకూసి ఉత్సాహంతో పరిగెట్టి పోతోంది జనతా.

బండి తునిలో ఆగింది. అతను క్రిందికి దిగుతూ—

"దయచేసి, నా హోల్డాలు చూస్తూంటారా, క్రిందికి పోయివస్తా, నేను" అన్నా డింగ్లీషులో.

ఆమె తలూపింది అతనికేసి చూడకుండానే.

కాసేపు అతని దృష్టిలోంచి తప్పించుకొన్నానని తెలియగానే ఆమె స్వేచ్ఛగా కూర్చుంది సర్దుకొని. కాని మళ్ళీ ఓసారి అతనెవడో అనే ఊహాగానం మొదలుపెట్టింది. ఇంతలో అతనలా తిరిగి కిటికీదగ్గరకి వచ్చి—"మీకేమీ అక్కర్లేదా?" అన్నాడు.

"అక్కర్లేదు, థాంక్స్" అన్నదే గాని, ఆమెలో పూర్తిగా ఆ విషయంపైన అంగీకారం కుదరలేదు తుని తర్వాత సామర్లకోటదాకా సరియైన హాల్ట్ లేదు. ఇక్కడే ఏదో కానిచ్చేసి పడుకుంటే...అతను తనని మరికొంచెం బలవంత పెడితే బాగుణ్నని పించింది.

ఇంతలో అతనే ఆమాట కాస్తా అనేశాడు, బహుశా ఆమె ముఖంలో, ఆ భావాలన్నీ కనబడి పోయుంటాయి.

అటువైపునుంచి వస్తున్న వాళ్లలో ముఖ్యముగా బెంగాలీలే ఉంటారు. అతనెప్పుడూ ఇంగ్లీషులోనే మాటాడడం, అందులోనూ ఆ మాటాడ్డం తీరు అతను బెంగాలీ అని తోపించిందామెకు. అతను చిరునవ్వుతో ఎదురుగ కనిపించాడు. అతని ప్రశాంతవదనంలోనికి ఆమె పరీక్షగా చూసింది. ఫర్వాలే దనుకుందామె.

తెమ్మన్నట్లు తలూపి, మనీపర్సు తీయబోయింది.

తర్వాత తీసికొంటానంటూ అతను ఆగకుండానే, వెళ్ళిపోయాడు పిలుస్తూన్నా



# పెళ్ళిచూపులు



ఆగకుండా రిపార్టింట్ కేసి.

అతని హృదయంలోంచి ఉబికిపడుతున్న ట్లున్న ఆ మాటలింకా ఆమె చెవుల్లో విన బడుతూనే ఉన్నాయి.

ఇంతలో అతను పాకెట్ మీల్స్, టిఫిన్, ఓ గ్లాసులో మంచినీళ్ళూ, తీసుకొచ్చాడు. అతనిలో ఒక మంచిస్నేహితుని చూడగలిగిం దామె. ఆమె పూర్తిచేసిన తర్వాత అగ్లాసు మళ్లీ అతనే ఇచ్చివచ్చాడు.

థాంక్స్ చెప్పిందామె చిరునవ్వుతో.

అతను నవ్వి కూర్చున్నాడు. తనకొ మాత్రం సహాయంచేసిన అతనితో ఏమాత్రం మాట్లాడక పోవడం మంచిది గాదనుకుం దామె.

"మీరెవరో తెలుసుకోవచ్చా?" ఆమే అడిగిం దింగ్లీషులో.

"నేనా! బెనారస్‌లో లెక్చరర్ ని."

"యూనివర్శిటీలోనా?"

"ఆ! మీరు వాల్తేరులో ఎక్కడ రను కుంటాను?"

ఆమె తన్నుగురించి చెప్పింది.

"మిమ్మల్ని కలుసుకొన్నందుకు చాలా సంతోషిస్తున్నాను. చదువుకున్న ఆడ వాళ్లంటే నాకు కొద్దిగా భయమనుకోండి" అన్నాడతను తలవంచుకు కొద్దిగా నవ్వుతూ.

అతను మాట్లాడ్డంలో అతనికెంత భయం లేదో కనబడిందామెకు.

"మీరితర్వాత ఏం జేస్తారు? ఏదైనా ఉద్యోగంచేస్తారా! పెళ్ళిచేసుకుంటారా!" అతను తన మామూలు సహజధోరణిలోనే అడిగాడు.

అతని ఆ నిష్కల్మషంగా మాటాడేతీరు ఆమె నెక్కువగా అతనితో తన భావాల్ని చెప్పమని పురికొల్పుతోంది. ఉత్సాహంతో తన ఉద్దేశాలన్నిటిని అతనికొగుట వప్ప జెప్పింది. అతను నిశ్చలంగా ఆమె చెప్పిం దంతా విన్నాడు. అంతా అయినతర్వాత శాంతంగా అతను "మీరు చెప్పిందాంతో పూర్తిగా ఏకీభవిస్తున్నానని చెప్ప లేక పోయినా, మీ భావాల్నర్థంచేసుకోగలను, సానుభూతికూడా వ్యక్తంచేస్తున్నాను. స్త్రీలకైనా, పురుషులకైనా స్వేచ్ఛ అనే దానికి కొన్ని పరిమితులున్నాయి. ఎవరార్జిం చినా జీవితం సుఖమయం చేసుకోడానికే గదా! అలాంటపుడు ప్రత్యేకంగా స్త్రీ ఉద్యోగం చేయాలనడంలో ఒక్కొసారి అర్థం కనబడదు. అయితే చదువువిషయంలో పూర్తిగా మీతో నేనంగీకరించగలనను కుంటాను" అని కాసేపాగి "నాకసలు లిట రేచరంటే ఇష్టం అనుకోండి. అయినా ఏమిటో అన్ని మనమనుకున్నట్టు జరగవు" అంటూ ముగించాడతను.

అతన్నర్థంచేసుకోగలిగిం దామె. మాట్లా డ్డానికి వీలులేకుండా ఆలోచనల్లో మునిగింది. అతను కాసేపలాగే కూర్చొని పైకెక్కి పడు కున్నాడు.

"మిమ్మల్నేమైనా కష్టపెడితే క్షమించం డ"ంటూ.

ఆమెకూడా లేదంటూ చిన్నవవ్వునవ్వి బెడ్ మీద వాలిపోయింది.

* * *

బండి ఏలూరులో ఆగింది. ఆమె హోల్డాలుచుట్టేసి కిటికీలోంచి కూలివాడిని కేకేస్తోంది. అతనూ గబగబా దిగిపోయి హోల్డాలు చుట్టేస్తున్నాడు. ఆశ్చర్యంగా ఆమె "మీరూ ఇక్కడే దిగుతారా!" అనడి గింది. తలూపి అతను హోల్డాలుపట్టుకుని గబ గబ వెయిటింగ్ రూంకేసి నడిచిపోయాడు.

ఆమె క్రిందికి దిగగానే తండ్రి కనిపిం చాడు ప్లాట్ ఫారంమీద! తనకోసమేనను కొనేసరికి ఆమెలో ఓ సారి తండ్రంటే అభి మానం ఉప్పొంగింది.

"నెనిక్కడ నాన్నగారూ!" అరిచిం దామె గట్టిగా..

"అను, అమ్మాయి వస్తున్నా" అంటూ ఇంకా వెదకడం ఆరంభించారాయన.

"ఇంకెవరికోసమండీ!" అందామె అర్థం గాక ఆయన్నాపి.

"అతనూ ఈ రైల్లోనే వస్తానన్నాడమ్మా బెనారెస్ నుంచి...ఆ! అదుగో ఆయనే! రండి, రండి" అంటూ ఆయన ఎదురేగుతూ తన సంగతే మరిచారు.

తెల్లటి టకప్‌లో నీటుగా మేకప్ అయి ఉన్న ఆ అబ్బాయిని తనతో కలిసివచ్చిన 'బెంగాలీగా' పోల్చుకొని సిగ్గులో మునిగి పోయిందామె.

ఇంటికి చేరాక "ఏమమ్మా, ఇంకా నీ పంతం వదలవా, అతనుకూడా వచ్చేశాడు గదా!" అన్న తండ్రికి, కూతురుదగ్గిర్నుంచి "మీ ఇష్టం" అని విన్నతర్వాత పట్టరాని సంతోషం ఆశ్చర్యం కలిగాయి. ★

# ఒంటెద్దు బండి

వి. ఎస్. అవధాని

గాలివాన రావచ్చు.

ఎండలెక్కువై, వడగాడ్పులకు నాలుక పీక్కుపోయి హైరానపడవచ్చు.

బస్సుల రాకపోకలు ఆగిపోవచ్చు. కలకత్తా మెయిలూ, గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్సు ఆలస్యం కావచ్చు. వారమో పది రోజులో అసలు రానేరాకపోవచ్చు.

నాగరికయుగంలో మామూలైన విశేషాలివి!

ఈ విశేషాలకు కారణాలు మీకు తెలుస్తయ్.

వీటికి బాధ్యులైనవారి సంగతిని విచారిస్తారు. దర్యాప్తులూ, తనిఖీలూ, బహిరంగ విచారణలూ జరుగుతయ్. ఆధారాలూ, సాక్ష్యాలూ ఉంటయ్ వీటికి. కాని ముసలయ్య ఒంటెద్దుబండీ సంగతిమాత్రం చాలామందికి తెలియనే తెలియదు. బండీ సంగతే తెలియకపోతే ఇక ముసలయ్య సంగతేం తెలుస్తుంది? తెలిసే అవకాశమేదీ? ప్రధాన మంత్రి కాడు ముసలయ్య. ముఖ్యమంత్రి అయినా కాడు ముసలయ్య. పైగా ఆ ఒంటెద్దుబండి నవనాగరికతకు శత్రువు. అందుకనే ముసలయ్య సంగతీ, ఒంటెద్దు బండిసంగతీ ఎవరూ దర్యాప్తుచెయ్యరు చెయ్యలేరు.

అయినా ఇదంతా ఊకదంపుడు గొడవ కానీ, ఎంతమందిలేరూ ముసలయ్యలీ స్వతంత్ర భారతంలో! ఒంటెద్దు బండ్లు తోలిన తోలుతున్న ముసలయ్యలు లక్షలకు లక్షలుంటారు. కాకపోతే ఇప్పుడిప్పుడే ఒంటెద్దుబండ్లు మోటై సైకిల్ రిక్షాలూ, నరవాహనలూ అవతరిస్తున్నయ్. అయినా నరవాహనాలను లాగుతునే ఉన్నారుగా. ఇటువంటి ముసలయ్యసంగతి ఓ పురాణమైనట్టు చెప్తాడేం వీడూ?

*    *    *

తెల్లవారలేదు. చీకటిలేదు. ఇంకా అందరూ నిద్రలేవలేదు. మంచాలమీద అటూ ఇటూ దొర్లుతునే ఉన్నారు.

పళ్ళబిగువున సంసారం లాక్కొస్తున్న పుల్లయ్య మోతుబడిరైతే. అంత చీకటుండగా మంచంమీదనుంచి లేవవలసిన మనిషీ కాదు. ఓపికా లేదు. అయినా పుల్లయ్య ఎందుకో గభాలునమంచం మీదనుంచి లేచి కొడుకు పడుకునే చావట్లోకి వెళ్ళాడు. "రాములూ" అని పిలిచాడు.

"అప్పుడే యెళ్ళారు దొరా" అన్నాడు పాలేరు వెంకయ్య.

"అప్పుడే యెల్లాడా?" ఎందుకెళ్ళనిచ్చావ్? అడు లేవగానే నన్ను పిలవమని చెప్పలా?"

"చెప్పారు దొరా. ఆరు లేచెప్పటికి నేనే ఇంకా లేవలేదు దొరా?"

"ఏడవక పోయావ్? ఎన్నిసార్లు చెప్పినా బుదిలేదు మనిషికో మాటా? గొడ్డుకో దెబ్బా? ఛా ఏం బతుకురా ఇదీ."

.....................

"ఆ డవలు రాత్రి ఎప్పుడొచ్చాడో?"

"తెల్దుదొరా? నాను తొంగున్నాక వచ్చారు. ఓరాత్రప్పుడు గొడ్లకు మేతెయ్యడానికి లేస్తే మంచంమీద పడుకోనున్నారు"

"మరి గిత్తకు మేతా నీళ్ళు?"

"ఆరే పెటుకున్నారేమో"

"ఆబుట్టలో ఉలవలున్నయ్యేమో చూడు"

"లేవు దొరా ఇందాకనే చూశా"

"అసలు రాత్రి ఉలవలు ఉడకేశారా?"

"ఉడకేశారు దొరా. ఎప్పటు పెటే మూడు సోలలు ఈ బుట్టలో పోసి ఆడపెట్టినాదొరా"

"సరేలే... కానియ్. కానియ్. ఇంకా దొడ్డి ఊడవ లేదుగా."

"ఇదుగో పోతుందా దొరా?"

*    *    *

"రామారావు వచ్చాడా?"

"ఏ రామారావూ?"

"అయింది అంత వరకూ వచ్చిందీ?"

"అవును. పుల్లయ్యగారి రామారావు పేకాట మానేసి ఎన్నాళ్ళయిందీ? ఇవాళ్ళ కొత్త అయినట్టు రామారావు రాలేదా అని అడిగితే ఏం చెప్పాలీ?"

"అవ్ర్వా......రామారావు పేకాట మానేశాడు. ఊళ్ళో కనిపించడం లేదు. ఊళ్ళో నేకాదు. అసలు ఇంట్లోనే ఉండడంలేదు. ఆముసలాడితో కూడా సరిగ్గా పలకడంలేదట. దిగులు పడుతున్నాడు పుల్లయ్య."

"ఏం? ఏమొచ్చిందీ? దిగులెందుకూ?"

"ఆగవోయ్ రంగయ్యా. ఆగు. పుల్లయ్య బాధనీకర్థంకాదు. ఒక్కగానొక్క కొడుకు. తీరా చదువు ఈడు వచ్చేప్పటికి పుల్లయ్య ఆస్తంతా హరాయించుకు పోయింది. రామారావూ నేనూ కలిసిచదువుకున్నాం తెలుసుగా. అన్ని క్లాసులలోనూ వాడికి ఫస్టు మార్కులే వచ్చేవి. స్కూల్ ఫైనల్‌తోనే మానేశాడు."

"పోనీలేద్దూ, హాయిగా పొలం దున్నుకుంటాడు."

"నిజమే పొలం దున్నుకోవచ్చు. కానీ, పొలం అనేది ఉండాలి కదా?"

"అంటే"

"అంటే యేముందీ? మీ తాత నాడు మీకు ఎంత పొలం ఉండేది? మీ నాయనలు ఎంతెంత పంచుకున్నారూ? ఈ నాడు మీ కెంత పొలం ఉన్నదీ?"

"ఏడిసినట్లుంది నువ్వు చెప్పేది. పుల్లయ్య ఒక్కడే వాళ్ళ నాయనకు కొడుకు. వాళ్ళకి ఎంత లేదన్నా ముప్ఫయి ఎకరాలుండాలి తెల్సా?"

"అయినా ఈ గొడవంతా ఎందుకురా. రామారావు సంగతి చెప్పుదూ? అడు ఇంటిపట్టున ఎందుకు ఉండడం లేదూ? తండ్రితో కీచులాడేడా?" అన్నాడు కోటయ్య.

"అశ్బే పుల్లయ్య ఎదటపడి మాట్లాడడు రామారావు. ఎంత సేపటికీ అక్కగారే అన్నీ చూడాలి." అన్నాడు రోశయ్య.

"మరి ఇంటిపట్టు ఎందుకు ఉండడం లేదూ? పొద్దున్నే ఆ ఒంటెద్దు బండీ కట్టుకుని బస్తీకెందు కెళ్తున్నాడూ?"

"ఓస్. ఏముందిలేవోయ్. కాఫీ హోటలయ్యా? కాఫీకోసం బస్తీ కెళుతున్నాడు."

"నీదంతా చాదస్తం బాబాయ్ కాఫీకోసం బస్తీకి వెళ్ళాలా యేం? కోమటి రామయ్య హోటలు లేదా?"

"హోటల్లో కాఫీతాగే ఖర్మం వాడికేం పట్టిందీ? అప్పతో చెబితే కాఫీయే కాదు- వాడు ఏమి ఇవ్వమన్నా ఇస్తుంది."

"మరి ఎందుకు వెళ్తున్నాడంటావ్? వెళ్ళినవాడు అర్ధరాత్రి దాకా ఎందుకు తిరిగిరావడం లేదూ?"

"అదే పుల్లయ్య దిగులు."

"మళ్ళీ అదేమాట అంటావేం? దిగులెందుకంటాను?" అన్నాడు సాంబయ్య.

 ఒంటెద్దుబండి 

"ఎందుకేమిటలా? అయ్యగారు బస్తీలో దేని వెంటనో పడ్డాడు. ఇక ఇల్లెందుకు చెప్పు?" అన్నాడు రంగయ్య.

"బాబూ కోశయ్య దొరా మిమ్మల్ని మా దొర పిలుస్తుండాడు" అన్నాడు. పుల్లయ్యగారి పాలేరు వెంకయ్య అక్కడికొచ్చి.

కోశయ్య పేకాట నుంచి లేవగానే అతనికి బదులు సాంబయ్య కూర్చున్నాడు పేకాట జరిగిపోతోంది.

* * *

"మాధవీ"

"తాతా?"

"మామ రాత్రొచ్చాడా?"

"వచ్చాడు తాతా. పూలూ, మామిడి పండూ, వోణీ తెచ్చాడు."

"అందాకా నువ్వు మేలుకునే ఉన్నావా తల్లీ."

"లేదు తాతా. అమ్మ దగరే మంచం మీద పడుకున్నాను. మామ వచ్చి లేపాడు. నేనే వేడినీళ్ళు పెట్టేను. స్నానం చేశాడు. బువ్వ తిన్నాడు"

"అమ్మ యేం చేసోంది?"

"ఏం నాన్నా...ఏం కావాలి?"

"ఏమీ వద్దమ్మా. రాములు సంగతే... ఇంటి పట్టున ఓ గంటయినా ఉండడం లేదు. ఆ గిత్త బండిలో రోజూ బస్తీ వెళ్తున్నాడు. అర్ధరాత్రి దాకా తిరిగి రావడం లేదు..."

"అదా...అందుకేనా దిగులు నాన్నా. మరేం భయం లేదు నాన్నా."

"అదేంటమ్మా...అట్లా అంటావ్. రోజులు బాగా లేవు. పొద్దస్తమానం బస్తీలోనే ఎవరితో తిరుగుతున్నాడో? పగలు తిండి ఎక్కడో? మీ అమ్మ పోయిందగ్గర్నుంచి మీ ఇద్దరినీ..."

"అవును నాన్నా. నాకు తెలుసు, ఇంతకూ ఇప్పుడొచ్చిన దిగులేమిటి?"

"రాముడు పగలల్లా బస్తీలో ఏం చేస్తూంటాడుంటావ్?"

"బస్తీలో నీకు తెలిసినాళ్ళు చాలా మంది ఉంటారుగా. కనుక్కోకపోయావ్?"

"పైగా అదొకటా? అదో అప్రతిష"

"అప్రదిష్టేంది నాన్నా. తిమ్మ దేం చేశాడూ? ఏం చేస్తున్నాడంటావ్?"

"నువ్వు దాచినా దాగదమ్మా... కుండను మూయగలం గానీ, లోకాన్ని మూయగలమా?"

"ఏమంటున్నారు నాన్నా"

"బుల్లి దొడ్లో వెళ్ళమ్మా...అడు దేనినో మరిగాడని..."

"........................"

"నేనేం చెయ్యను తల్లీ. ఒక్కగానొక్క ఆడపిలవు. నీకర్మ ఇట్లా కాలి నా పంచన పడ్డావ్. ఆడొక్కడే మగనలుసు. అడుకూడా..."

"..................."

"కనుక్కుంటా...దిని అంతు కనుక్కుంటా. పుల్లయ్య ఆస్తంతా అప్పుల పాలైంది. పుల్లయ్యంటే ఓనాడు ఈ ఊరికి కిరీటంలేని రాజు..."

"ఇంతకూ ఇదంతా అనుమానమేగానీ, ఆధారమేంటి నాన్నా."

"ఆడిస్నేహితుడు కోసిగాడు తెలుసుగా నీకు...ఆడికే అనుమానంగా ఉన్నది."

"మరి రాముడ్ని పైచదువుకు ఎందుకు పంపించలేదు నాన్నా."

"పంపిస్తా నన్నా. నేను చదవనన్నాడు. చదివి చేసేదేంటన్నాడు. పోనీలే యింటి పట్టునవుండి మిగిలిం దేదో చూచుకుంటాడనుకున్నా. ఈయేడు బుల్లికీ ఆడికీ ముడేసేద్దాం అనుకున్నా..."

"..................."

"ఇయ్యాల నేను బస్తీ కెళ్ళొస్తా. సరేనా."

"వెళ్ళిరా నాన్నా. తొందరపడకు. అనుమానంతో వాడినేమీ అనకు."

* * *

రామారావు అనే యువకుడి జీవిత వివరాల పరిశోధన అటూ ఇంటా బయటా ప్రారంభమైంది. కానీ, ఎవరికీ ఏమీ అంతు చిక్కలేదు.

ఊళ్ళో వాళ్ళు రకరకాలుగా చెప్పుకుంటున్నారు. పులయ్య పొలంలో చాలా భాగం అప్పులకింద సరిపోయింది. అయిదెకరాలు మిగిలింది. ఒక ఇల్లుకూడా వేలంలో పోయింది. ఇంత అప్పు ఎందుకయిందో ఎవరికీ తెలియదు. తెలిసినా బయటికి అనరు. ఎందుకు అనరో తెలియదు. తన ఆస్తిఅంతా అట్లా హారించుకుపోతున్నా తండ్రిని పల్లెత్తుమాట రామారావు అనలేదు. కాకపోతే ఇంటికి రోజూ రావడం మానేసి రెండురోజుల కొకసారి వస్తున్నాడు. అప్పుడప్పుడు మాధవికి చీరె, పూలూ పండ్లూ తెసాడు. ఇంటిపట్టునే ఉండ్రాదుట్రా అని పుల్లయ్య ఓనాడు అరుచుకున్నాడు. రామారావు జవాబేమీ చెప్పలేదు. ఆయన కేక వేసినంతసేపూ అట్లా మొద్దల్లే నుంచున్నాడు. అదంతా అప్పకు ఆశ్చర్యమే కలిగించింది. కానీ, లోకులన్నదాంట్లో నిజంలేదనిమాత్రం ఎందుకనో ఆమె గట్టి నమ్మకం.

ఈనోటా, ఆనోటా ఈవదంతులు మాధవి చెవిదాకాకూడాపోయినా మాధవి నమ్మలేకుండా ఉన్నది. మామకు తనంటే ప్రాణం. ఇంట్లో ఎవళ్ళతోనూ మాట్లాడని రోజులయినా ఉన్నయ్ కానీ, మామ తనతో మాట్లాడనిరోజు అనేదే లేదు. తల్లిప్రోద్బలం మీద పెళ్ళిసంగతి ఎత్తితే మామ బిగరగా నవ్వాడు. నవ్వి "పిల్లా, బస్తీ కెళ్దాం. ఈవూళ్ళో బతకలేం. పెళ్ళంటే మాటలా. నాన్న మళ్ళీ ఏ ఎకరమూ రెండెకరాలో అమ్మి ఊళ్ళోవాళ్ళందరికీ సంతర్పణ



**జోడెద్దులబండి**

—ఫోటో: గున్నేశ్వరరావు గోవింద్, ఖర్గపూర్.

చేయ్యాల్సి. అవన్నీ ఎందుకూ? మాధవి నువ్వు ...నీకోసమే నేను. సరేనా" అన్నాడు. ఆహా...ఆమాటలు వింటుంటే ఎంతహాయి అంతేకానీ, బస్తీలో ఏంచేస్తున్నాడో మామ చెప్పడు అసలు మామ ఏబస్తీకి వెళుతున్నాడో తెలియదు. ఇద్దరు ముగ్గురికి ఓబస్తీలో మామ కనిపించాడు. కానీ, అక్కడ ఏంచేస్తున్నాడో వాళ్లకు తెలియదు. ఎగుటపడి ఎవరూ అడగలేనంతగా రామారావు మారిపోయినాడు. ఎప్పుడూ ఏదో దిగులుగా, గంభీరంగా, కోపంగా ఉంటుంది మొఖం. అటువంటివాడిఎదుటికివెళ్లి "బస్తీలో నువ్వు ఏంచేస్తున్నావ్?" అని ఎవరు అడగ్గలరూ!

*　　*　　*

చాలా ఆశ్చర్యం. ఓ తెల్లవారుజామున రామారావు మామూలుగా బండి తోలు కెళ్తూ అప్పనూ, మాధవినికూడా బండిలో ఎక్కించుకు వెళ్ళాడు. పుల్లయ్య లబలబలాడాడు నెత్తీనోరూ కొట్టుకు ఏడ్చాడు. కనిపించినవాళ్లందరినీ తిట్టాడు. ఆఖరికి రెండుమూడు బస్తీలకు మనుషులను పంపించాడు...

తనమామ నిజంగా ఓ ఇల్లు కడతాడని, మాధవి ఎన్నడూ అనుకోలేదు. తన తమ్ముడు మైసూరు గిత్తలతో ఎడ్లబండ్ల బాడుగ వ్యాపారం పెడ్తాడని అప్ప ఎన్నడూ అనుకోలేదు. అదే అదే ఒంటెద్దుబండి ముసలయ్య కథ. నిజాయతీపరుడైన రామారావు ఇతరులను సంస్కరించాలని అనుకోలేదు. తనను తానే సంస్కరించుకున్నాడు. స్వగ్రామంలో ఈనాటికి ఓ అర ఎకరం పొలం ఉన్నది. భూమి సంస్కరణల భయం రామయ్యకు లేకపోలేదు. ఆ భయం రానకు రానిభయం. అందోళన చేయలేని భయం.

అయితే రామారావు అమాంతం ఒంటెద్దు బండి బాడుగకు తోలడం మొదలెట్టలేదు. తన బండినో బస్తీకి వెళ్ళి అక్కడ ఓ మనిషి చేత బండిని బాడుగకు తోలించేవాడు. రోజుకు రూపాయి వాడికి ఇచ్చినా సులభంగా మూడురూపాయలు మిగిలేవి. రామారావుబండి తోలకపోవడంవల్ల బస్తీలో అన్వేషకులకు అతను దొరకలేదు...

ఈ నాడదంతా యేమీ లేదు. రామారావు రామయ్య అయి ముసలయ్య అయినాడు. ఎవరు పిలిచినా బండికడాడు పలుకుదు పిల్లల రామయ్య. ఆ ఒంటెద్దుబండి జీవితం అట్లా సాగిపోవలసిందే నాగరికతకు ఎదురీతే కావచ్చు కానీ, సంస్కరణలకు మాత్రం అనుకూలమే గదా! ★

# నిజానిజాలు

ఆర్. ఎం. చిదంబరం

రంగురంగుల ప్రింటెడ్ వాయిల్ చీరలు కుప్పగా సరస్వతి ముందు పడి వున్నాయి. రకరకాల పువ్వుల డిజైన్లు-బార్డర్లు-కళ్లు చీకట్లు కమ్ముతున్నట్టనిపించింది. ఆమెకు ఏ చీర ఎంచుకోవాలో తెలియింది కాదు. లేత ఆకుపచ్చ బాగుందనుకుంటే గులాబీరంగు నయమేమోననిపించింది. ఆఖరుకు చీరలు చూపిస్తున్నతనిక్కూడా విసుగెత్తింది. ఆవిడ కొనేదేమో ఒక చీర- అందుకని ఎంతకాలం వృథా చేస్తోంది! ఎటూ నిర్ణయించలేక తలెత్తి వీధివైపు ఓ మాటు ఆలోచనా పూరిత దృక్కులతో చూసింది.

చప్పుడు లేకుండా దూదిపరుపుమీద నడుస్తున్నట్టు ఓ కారు వచ్చి 'సిల్కుఎంపోరియం'కి ఎదురుగా ఆగింది. ఓ అమ్మాయి నేలమీద అడుగుపెట్టింది. మొహం అటు తిరిగి వుండటంవలన ఆమె 'అందచందాల్ని' కొలిచే అవకాశం సరస్వతికి కలగలేదు. ఆమెను నఖశిఖ పర్యంతం ఓమాటు చూసింది. కాళ్ళకు ఖరీదైన ఎర్రటి స్లిప్పర్లు, లేత నీలి రంగు చీర వింతగా ప్రకాశించింది. ఓ చేతికి బ్రాస్‌లెట్, మరో చేతికి చిన్న రిస్ట్‌వాచ్- భుజాన హాండ్‌బాగ్. అజంతా శిల్పంలో మాదిరిగా తలకట్టు-మెడ వెనకపడి చదరపు టంగుళాల వెడల్పున డైమండ్‌కట్ - అందులోంచి శరీరచ్ఛాయ దర్శనమిస్తోంది. చెవులకున్న రవ్వల దుద్దులు సూర్యరశ్మితో దోబూచులాడుతున్నాయి. ఆమె డ్రైవరుతో ఏదో మాట్లాడుతోంది కాని మొహం యిటు తిప్పలేదు. సరస్వతికి విసుగెత్తి చీరల సెలక్షన్‌లో పడింది.

ఓ నిమిషం గడిచింది-అంతే-

సరస్వతి భుజంమీద బరువుగా ఓ చెయ్యి పడటంతో వంటిమీద మంచుగడ్డలవర్షం కురిసినట్టులిక్కిపడి వెనక్కి తిరిగింది. ఆశ్చర్యంతో కనురెప్పలు పైకీ క్రిందికీ కదిలాయి, ఆ అమ్మాయిని గుర్తుపట్టినట్టు క్రమంగా చిరునవ్వు జారటానికి ఓ నిమిషం పట్టింది.

'అప్పుడే మర్చిపోయావులే సరస్వతీ?' అనడిగింది.

'బాగానే వుంది. హఠాత్తుగా ఆకాశం మీదనుంచి వూడిపడ్డట్టు ప్రత్యక్షమై ఆశ్చర్యపరిచావు కనక పలకరించలేకపోయాను - అయినా ఎంతకాలానికి కనిపించావు మాలతీ?' అంటూ నవ్వటానికి యత్నించిందికాని బంధించుకుపోయిన పెదవులు విడివడలేదు.

'సిల్కు ఎంపోరియం' యజమాని గబగబావచ్చి 'నమస్కారం మాలతిగారూ! ఏమిటిలా వచ్చారు?' అనడిగాడు.

'అదేమిటండీ! మొన్న కాశ్మీర్ సిల్కు చీరలు ఏవో వచ్చాయి - పంపిస్తానన్నారు - తరవాత కబురేలేదు. అదేదో కనుక్కుందామని వచ్చాను' మాలతి కళ్ళు మాత్రం వాయిల్ చీరలమీదే వున్నాయి.

'పంపారు' అని అనుకున్నట్టు అందలేదు. మొన్న అయ్యగారితో చెప్పాను. రామాచారి చీరలని, కొత్తరకం వచ్చాయి. పంపిస్తాను.'

'అలాగే!...అది సరేకాని క్రిందటి శనివారం కొన్న చీరల తాలూకుబిల్లు అయిదు వందలూ పంపలేదే!'

సమాధానం యివ్వకుండా మేనేజరు నవ్వేసి వెళ్ళిపోయాడు.

'అయితే సరస్వతీ! నువ్వు యీ వూళ్లో వుంటున్నట్టు నాకు తెలియదు సుమా!'

'నాకూ అంతే! అయినా ఇంత పెద్ద పట్నంలో స్నేహితులజాడలు తెలుసుకోటం కూడా అంత సులభం కాదు.'

'పోనీలే! ఇప్పుడు కలుసుకున్నాంగా - నీ ఎడ్రసు చెప్పు - రాసుకుంటాను. ఇదీ మా ఎడ్రసు-' అంటూ విజిటింగ్ కార్డు యిచ్చి ఆమె ఎడ్రసు పాకెట్ డైరీలో రాసుకుంది

'నువ్వేమీ అనుకోకు- నాకీమధ్య వంట్లో బాగుండటంలేదు. అందుచేత డాక్టరుదగ్గరకు వెళ్ళాలి. ఆయన అయిదుదాటితే ఇంటి దగ్గర వుండడు. నువ్వుమాత్రం మాయింటికి తప్పకుండా రావాలి. నీకోసం ఎదురు చూస్తుంటాను.'

మాలతి 'బ్లూప్లిమత్'లో తేలుతూ కదలిపోయింది.

సరస్వతి పద్నాలుగు రూపాయలిచ్చి లేత పసుపురంగుచీర తీసుకుని తిరుగుముఖం పట్టింది.

ఇంటిదగ్గర్నుంచి బయలుదేరినప్పుడు మనసులో ఎలాంటి ఆందోళనలూ లేవు. తిరిగి వెళ్ళేటప్పుడు ఈ ఘోష ప్రారంభమైంది. హృదయాకాశంలో నీలి రంగు మబ్బులు చెదిరిపోయాయి. ఉరుములు- మెరుపులు - అందులో పాత సంఘటనలు - మాలతిని కలుసుకోటం ఆమెకిప్పటికీ కలగావుంది.

మాలతి, సరస్వతి ఇరుగుపొరుగువాళ్ళు సమవయస్కులు కావడం మూలాన అభిరుచులుకూడా సమాంతరస్థాయిలో వుండేవి. వారి మనస్తత్వాలు ఎలావున్నా తలిదండ్రుల దృక్పథాలు వేరుగావుండేవి. సరస్వతి కుటుంబం సనాతన ధర్మాలను ఆచరించేది. కట్టుబాట్లతో సంతానాన్ని పెంచారు. పువ్వు వికసించటం ప్రారంభించగానే శీఘ్రప్రహారంతో చదువుకు స్వస్తిచెప్పించి 'ఒకడి' చేతిలో పెట్టి తమ బాధ్యత వదల్చుకున్నారు. ఆనాటి మనోవేదన!

స్కూలు ఫైనలు పూర్తికాగానే మాలతి కాలేజీలో చేరి ఇంటర్ చదివింది. కాలేజీకన్యయైన మాలతిని తోటివిద్యార్థి ప్రేమించి తలిదండ్రుల సమ్మతిమీద పెళ్లిచేసుకున్నాడు.



అతను శ్రీమంతుడు. సరస్వతి పెళ్ళి సమాన అంతస్తులోవున్న శివరావుతో జరిగింది. ఆమె భర్తను పురోహితులు వింతకంఠంతో విచిత్రభాషలో ఆశీర్వదించలేదు. వాళ్ళచేత ఏవేవో చెప్పించలేదు. కాని వాళ్ళకేమిటి లోటుకి? ఆమెభర్త రెవెన్యూడిపార్టుమెంటులో ఏదో ఆఫీసరుగా వున్నాడు.

అయిదువందలు చీరల తాలూకుబిల్లుకి ఎంతనిర్లక్ష్యంగా మాట్లాడింది!



# నిజానిజాలు



సంఘర్షణ రేగుతూనే వుంది. తనకంటె భిన్నతస్థితిలోవున్న వ్యక్తిని చూసినప్పుడు కాని ఏమనిషికీ తన స్థితిగతులు అర్థంకావు. సరస్వతి మనసింకా పక్వానికి రాలేదు. అంతస్తుల్ని విడమర్చి అర్థం చేసుకునే శక్తి లేదు. ఇల్లుచేరుకునేసరికి గడియారం అయిదు కొట్టింది. మరో అరగంటకు శివరావు వచ్చేస్తాడు.

వీధిలో ఆడుకుంటున్న రామం ముఖం వికసించింది. గంటసేపు అమ్మ కనిపించలేదు. తనకూ, అమ్మకూ మధ్య ఎవడో ఇనుపతెర సృష్టిస్తున్నారని అతడి భ్రమ - పరుగెత్తుకు వెళ్ళి కాళ్ళని కౌగలించుకున్నాడు. పక్కకు నెట్టేసింది.

శివరావు వచ్చాడు.

అతను వేసుకున్న పథకం వేరు. సరస్వతి కొత్తచీర కట్టుకుని, సింగారించుకుని, చిరునవ్వులు వెదజల్లుతూ గృహలక్ష్మిలా ఎదురుచూస్తూంటుంది. రామాన్ని తీసుకుని సతీసమేతంగా కొత్తసినిమాకు వెడదామని.

కాని ఆశాభంగం బుసకొట్టింది. వంటింట్లోకి వెళ్ళాడు. పొయ్యి వూదుతోంది. కట్టెలు మండటంలేదు. అతనికేసి తలెత్తి చూసి - మళ్ళీ తనపనిలో నిమగ్నురాలైంది. కొన్ని గంటల కాలవ్యవధిలో ఆమె ఇంతగా ఎందుకు మారిందో అతనికి అర్థం కాలేదు. అతను సరస్వతిని ఏమీ ప్రశ్నించలేదు. టేబిలుమీదున్న కొత్తచీర ఏదో తెలుసుకున్నట్టు రెపరెపలాడింది.

ఆరాత్రి భోజనాలదగ్గర—

రామం మారాం చేయకుండా బుద్ధిగా ఎప్పుడూ అన్నం తినడు. తిరుగుబాటు చేయటానికి ఏదో కారణం కనిపిస్తూనే వుంటుంది. నెయ్యి కావాలంటూ ఏడుపు మొదలుపెట్టాడు. 'వెధవా! రెండుపూటలూ నెయ్యివేసుకు మింగాలంటే డబ్బున్నవాళ్ల యింట్లో పుట్టాలి. నా కడుపున ఎందుకు పుట్టావు?' అంటూ వీపుమీద ఛెళ్లున వేసింది.

అంతటి చిన్న కారణానికి రామాన్ని దండించటం యిదే మొదటిసారి. శివరావు కంచం ముందుకు నెట్టేసి లేచిపోయాడు.

ఆరాత్రి సరస్వతికూడా పస్తు పడుకుంది. ఏడుస్తూ తెల్లవారింది.

రాత్రంతా జరిగిన ఆత్మమథనం కారణంగా ఆమెకు జీవించటమంటే రోత పుట్టింది. శివరావు ముక్తసరిగావుండి, వేళకు నాలుగుమెతుకులు తిని ఆఫీసుకు వెళ్ళిపోయాడు. కొత్తచీర యథాస్థానంలో వుంది. అవును మరి - అది కాష్మీర్ సిల్కు కాదు - రామాచారి పట్టుచీరా కాదు!

సరస్వతి పనంతా పూర్తయ్యాక చక్కగా అలంకరించుకుని రామానిక్కూడా వున్నవాటిలో మంచి చొక్కా, లాగూ తొడిగి, నాలుగేళ్ళకితం కొన్న సగం పూపిరితోవున్న జోళ్ళుతొడుక్కుని బయలుదేరింది. ఎండలోనడచి వెడితే అలంకరణ వృథా అవుతుంది. రెండణాల ఖర్చులో సిటీ బస్‌లో మాలతియిల్లు చేరుకుంది.

చిన్న బంగాళా - నీలిరంగు - ఇంటిముందు పెద్ద కాంపౌండు. ఎడం ప్రక్కగా చిన్న పూలతోట - కొన్ని విచ్చినపూలు దొంగచాటుగా నవ్వుతున్నాయి. కుడిప్రక్కగా రెండుమూడు కార్లు పార్కు చేయబడివున్నాయి. ఆమెభర్తపేరు (డెసిగ్నేషన్‌తో) బయట చెక్కబడివుంది. నెమ్మదిగావెళ్ళి కాలింగ్ బెల్ నొక్కింది. లోపల్నుంచి కిలకిలలు, పకపకలు వినిపించాయి.

మాలతి తలుపుతీసి లోపలకు తీసికెళ్ళింది.

గుండ్రటి టేబిలుచుట్టూ ముగ్గురమ్మాయిలున్నారు. పేకాట జోరుగా జరుగుతోంది. సరస్వతిని అందరికీ పరిచయంచేసింది మాలతి. ఒకామె సర్కిల్ ఇన్స్పెక్టరుగారి భార్య. రెండో ఆమె ప్రిన్సిపాలుగారమ్మాయి. మూడో అమ్మాయి ఛీఫ్ ఎకౌంటెంట్ గారి సతీమణి. ఒక్కొక్కరు అలంకరణలో వుండే రకాల్ని ఎత్తి చూపారు. రవ్వల

**విరుగుడు**

మేష్టారు:- ఒరే గోపీ! ఒక బుడ్డి సిరా తాగినవానికి ప్రథమ చికిత్స ఏమి చేస్తావు?

గోపీ:- ఒక తావు అద్దుడు కాగితాన్ని మింగించితే సరిపోతుంది సార్!

—కో. లక్ష్మీపతి.

దుద్దులు - నెక్లెసులు - బంగారు గొలుసులు - సిల్కుచీరలు - సూక్ష్మంలో అదో నగలు, చీరలు అమ్మేదుకాణం. సూర్యకాంతి ముందు కొవ్వొత్తిలా సరస్వతి సిగ్గుపడిపోయింది. చుట్టూ సింహాలు - ఆమెను కబళించటానికి ఎదురు చూస్తున్నాయి. అంతస్తులు - తారతమ్యం - పనిమనిషిగా పాలు - కాఫీ తీసుకొచ్చింది. ఆమె గమనించింది ఓ విషయం - పనిమనిషి కట్టుకున్న చీర, ఆమెచీర ఒక్కటే.

'సరూ! అలా మూగదానిలా ఒక్కత్తెవూ ప్రపంచంతో బంధం తెగిన దానిలా వుండకపోతే మాతోకలిసి పేకాట ఆడకూడదటే?' అంది మాలతి. రామం ఓ వంక ఎన్నడూ మైసూరుపాకం మొహం ఎరగనివాడిలా ఒక్కసారిగా మింగటానికి యత్నించి దగ్గుతో బాధపడ్డాడు. అందులో ఒకామె ఫక్కున నవ్వింది.

'నెమ్మదిగా తిను అబ్బాయీ! ఫరవాలేదు. మా మాలతి ఎన్ని కావాలన్నా యిస్తుంది. ఇక్కడ మైసూరు పాకాలకు రేషన్ లేదు' అంది. రామం వీపు బద్దలు కొడదామనుకుంది సరస్వతి - అవమానంతో తలకొట్టేసినట్టయింది.

మరో పదినిమిషాలకు అతిథులు వెళ్ళిపోయారు.

'సరూ! నువ్వు వాళ్ల మాటలకు బాధపడకు. ఇదంతా ఓ విచిత్రమైన లోకం- ఇందులో కావల్సింది ఆడంబరం - నటన - నామనసు విప్పి ఎవరిలోనూ చెప్పను. నువ్వు కనక ఈ మాత్రమైనా చెప్పాను—'

సరస్వతి మాలతి మాటల వెనకవున్న భావాన్ని అర్థం చేసుకోటానికి యత్నించింది. ఆమెకి కలిగిన సందేహం ఒక్కటే- మాలతి జీవితంలో, ఏ కోణంలోంచి చూసినా వెలుతురు కనిపిస్తోంది. పంచరంగులు సృజింపబడుతున్నాయి. నిజానికామెకు కొరత అంటూ వుందాని?

'అది సరే కాని, నీకు జీవితంలో తృప్తి కనిపించిందా?' అనడిగింది మాలతి. షేక్స్పియరు నాటకానికి చేయవలసిన అతి వ్యాఖ్యానం ఆ ప్రశ్నలో కనిపించింది.

'డబ్బువుంటే తృప్తివుంటుంది.

అదీ సరస్వతి చెప్పిన పాఠం.

మాలతి ఆ వాదాన్ని ఖండించలేదు.

'సిరివుంటే సుఖాన్ని కొనవచ్చు చిటికెన వేలుమీద బొమ్మలాగ ఆడించవచ్చు.' మళ్ళీ సరస్వతే అంది.

'అమ్మా! ఇంటికి పోదాం - ఇక్కడేం బాగాలేదు.' అన్నాడు రామం. అతనికి ముళ్ళమీద వున్నట్టుంది.

'బాగా చెప్పావురా బాబూ! నిజం నువ్వొక్కడివే కనుక్కున్నావు.' అంటూ ఫక్కున నవ్వింది మాలతి అందులో పరిహాసం తప్పించి మరేముంది?' అనుకుంది సరస్వతి.

సంభాషణ మరోదెసగా వెళ్ళింది. చిన్ననాటి ముచ్చట్లు–చదువు సంగతి-ఎవరి కెలా పొద్దు పోతున్నది-మాలతి ఇల్లంతా చూపించింది. తనకున్న నగలు చీరెలూ చూపించింది.

'నువ్వేమో మా యింటికొచ్చావు. మరి నన్ను మీ యింటికెరమ్మని ఆహ్వానించవూ?' అంటూ చమత్కరించింది.

'ఇద్దరం బాల్య స్నేహితులమా మరి - నిన్ను బాజాభజంత్రీలతో తీసి కెళ్ళాలా ఏమిటి? తప్పకుండా రావాలి.'

సరస్వతి యిల్లు చేరుకునే సరికి శివరావు రెండు చేతుల మధ్య తలవుంచుకుని అరుగు మీద కూర్చునివున్నాడు. అయిదు గంటలక్కానిరాడు. అప్పుడే సాయంత్రమై పోయిందా? కంగారుపడుతూ తాళం తీసింది. ఇంట్లో అడుగు పెట్టటం-ఎదురుగా వున్న గడియారం మూడు కొట్టటం ఒక్కసారే జరిగాయి.

శివరావు నెమ్మదిగా లోపలకొచ్చాడు.

'అందరూ సాయంత్రం షికారు వెడతారు. ఈ మండుటెండలో విలాసంగా తిరగటం ఎప్పట్నుంచి?' అతని కంఠంలో మోతాదుకుమించిన కోపంవుంది.

'మాలతి నిన్న కనిపించి రమ్మంది. అందుకని వెళ్ళాను. ఇంతలో ఏం కొంప మునిగింది?' ఆమె కంఠంలో క్షమాపణకాని, అణకువకాని లేదు.

'అంటే నీ చిత్తం వచ్చినట్టు నువ్వు వూరేగుతావన్నమాట. ఇక్కడ మొగుడంటూ వొకడు లేడూ? గంటసేపింది నేను వచ్చి. అరుగుమీద దిక్కులేనివాడిలా తల బాదుకుంటున్నా. నువ్వేమో మహారాణిలా జాలీట్రిప్ వెళ్ళావు. ఛీ...' అంటూ మంచంమీద వాలాడు. అతను రెంటింటికే ఎందుకు తిరిగి వచ్చాడని ఆమె అడగలేదు. మాలతైతే యిషం వచ్చినప్పుడు బయటికి వెడుతుంది. ఆమెకున్న స్వేచ్ఛలో వెయ్యోవంతైనా తనకు లేదు. ఇలాంటి కాపరం వెలగబెటక పోతేయేం? ఒకవాడు బయటకు వెళ్ళగానే ఇన్ని ప్రశ్నలు!

కాఫీకాచి తీసుకొచ్చింది.

'అక్కర్లేదు. నువ్వే తాగేయ్!' అనరిచాడు.

'అమ్మా! అమ్మో...!' అంటూ రామం పరుగెత్తుకొచ్చాడు.

'తలుపు పక్కనేవుంది' అంటూ కవరు అందించాడు. తను లేనప్పుడు పోస్టుమేన్ కిటికీలోంచి విసిరివుంటాడు. ఉత్తరం చదవగానే సంతోషం పెల్లుబికి బుగ్గలమీదుగా జారి పెదవులమీద అంతమైంది.

'ఏమండీ! మా తమ్ముడికి వచ్చే శనివారం ఉపనయనం' అంది.

'శుభం! నీకెప్పుడు వీలుగా వుంటే అప్పుడు సామాను సర్దుకో. రైలు బళ్ళు సమయానికి ప్రయాణం చేస్తున్నాయి. ఓ పెట్టెలో ఎక్కి కూర్చుంటే సరాసరి మీ వూరు చేరుస్తుంది.'

'అది నాకూ తెలుసు—మరి మీరో?'

'వీలుంటే చూద్దాం.'

తరువాత వాళ్ళిద్దరి మధ్య సంభాషణ జరగలేదు. ఈ విధంగానైనా కొంతకాలం మాలతి సృష్టించిన తుఫానులోంచి తాత్కాలికంగా బయటపడవచ్చు. మర్నాడు ఏడు గంటలబండికి సరస్వతి పుట్టింటికి బయలుదేరింది.

రాత్రి పదకొండు గంటలవుతుంది.

నిద్రపోతున్న రామం లేచి ఏడవటం మొదలు పెట్టాడు. రైలు పెద్ద జంక్షన్‌లో ఆగింది. అది ఆడవాళ్ళ కంపారుమెంటు—ఏమైనా తినుబండారాలు, కాఫీ కొనిద్దామంటే టిఫిను స్టాలు ఫ్లాటుఫారం చివరవుంది. పక్కన వున్నావిడతో రామాన్ని, తన స్థలాన్ని జాగ్రత్తగా చూసుకోమని మరచెంబు తీసుకుని బయలుదేరింది. పదిగజాలు నడిచేసరికి ఎవరో తన్ను పేరుతో పిలవటం వినిపించింది. వెనక్కి తిరిగింది.

ఫస్టుక్లాసు కంపార్టుమెంటు దగ్గర మాలతి నిలబడి తన్ను పిలుస్తోంది.

'ఎక్కడికి మాలతీ?'

'ఆయన స్నేహితుడికి పెళ్ళట! అందుకని బయలుదేరాం. నువ్వో?'

ఆమె చెప్పింది.

'మనం కలుసుకోటం ఎప్పుడూ చిత్రంగా వుంటుంది. బయటనిలబడివున్నావు. అయిదు నిమిషాలు కూర్చుని వెడుదువుగాని—రా–" అంటూ ఆమెను లోపలకు తీసికెళ్ళింది.

అందులో మాలతి, ఆమె భర్త తప్పించి ఎవరూ లేరు. అతను బోర్లా పడుకుని వున్నాడు. కళ్ళు రెండూ ఎర్రగావున్నాయి. చేతిలో సిగరెట్ వృథాగా కాలిపోతోంది. ఏమిటో అతని చూపులు, ముఖ కళవళికలు భయానకంగా కనిపించాయి. మాలతి తన్ను పరిచయం చేయుటందుకు దేవుడికి దండాలు పెట్టింది. మాలతినౌకరు కాఫీ, టిఫీను పొట్లం సరస్వతి కిచ్చాడు. మాలతి ఓ పెద్ద బిస్కట్ పాకెట్టు కొనిచ్చింది. కృతజ్ఞత చెప్పి అవన్నీ తీసుకుని తన పెట్టెలోకి వచ్చింది.

రామం ఇంకా ఏడుస్తూనే వున్నాడు.

*　　*　　*

'ప్రిమత్' కారు ఇంటిముందు ఆగటం చూసి రామం లోపలికి పరుగెత్తుకెళ్ళాడు. మరుక్షణం సరస్వతి అరుగుమీదకు రావటం, మాలతిని పలకరించటం జరిగాయి. చాప పరిచింది. మాలతి తనుతీసుకొచ్చిన పళ్ళబుట్ట చాకెట్లూ, అన్నీ వరసగా వుంచింది.

(47-వ పేజీ చూడండి)




[ఉద్యోగపర్వమునుండి]

ఉ. వారును మీరుఁ బొంది జనవల్లభు లెల్లను భృత్యభావముం
జేర సమస్తవస్తువులుఁ జేకుఱఁగా బ్రదుకొప్పఁ గాక నీ
కీరస మెత్తికోల్ గలిపి యిప్పుడు కార్యము దప్పఁ జూచనీ
వారలు ముట్ట వచ్చిన నవశ్యము నంతకుఁ జాలరుం జుమీ.

ఆ. వీరంకారు పాండవేయులఁ బోర మా, ర్కొన్న సురాసురులకుఁ గొలఁదిగాదు
గాన వారితోడికయ్యంబునకు నిర్ణ, యింప వలదు సంధిపెంపుఁ జేయు.

క. ఈయున్న రాజు లందఱు, వాయుసుతున కొక్కయెత్తు వాఁ డలిగిన శూ
లాయుధుఁడు వడఁకు నాకౌం, తేయులతోఁ బోరుచు టుడుగు ధీరవిచారా.

క. ఒక కార్యము సెప్పెద మీ, సకలబలమునందు సవ్యసాచి కెదురుగా
నొకరుఁడు గలిగినఁ గయ్యము, సకుఁ బూనుఁడు రిత్తబహుజనక్షయ మేలా.

క. పెక్కండ్రు గోవులం గొని, యుక్కు మిగిలి నడవ వెనుక నుద్ధవిడిం దా
నొక్కఁడ నరుఁ డేతెంచినఁ, జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధమ కాదే.

క. తోడుదొన లేని యప్పటి, క్రీడికొలఁది యట్టి దధిప కినియక విను మేఁ
దోడై రా నెదురుట గడుఁ గీడు వలవ దుడుగవయ్య గెలు పరిది సుమీ.

తే. అనుజతనుజులఁ జెలులు వియ్యములు నడుగు, మాలి పోదురు నీకుఁ గా మనుజనాథ
దొరకుఁ గులనాశనుం డను దూఱు మేలె, పాండవులతోడ నొడఁగూడి బ్రదుకవయ్య.

ఉ. రాజ్యముభార మెల్ల ధృతరాష్ట్రునియంద వెలుంగుచుండఁ ద
త్ప్రాజ్యకుమారపట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు పాండవుల్
సజ్యతఁ దండ్రిచిత్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా
మ్రాజ్యముగాఁ దలంతు రనురక్తమతిం దమకుం ధరాధిపా.

క. కౌరవనాయక పాండుకు, మారులు నీతోడిపొత్తు మనియెద మనఁగా
శ్రీ రా మోఁకాలొడ్డిన, వారివిధమ కాదె నీవు వల దను టెల్లన్.

## భీష్మద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట

చ. అన విని భీష్ముఁ డిట్లనియె నా ధృతరాష్ట్రతనూజుతోడ నీ
జనకుని మాట వట్టుము ప్రసన్నమతిన్ మనవంశ మెల్లఁ బా
వనముగ నిందు వచ్చి బుధవత్సలుఁ డీహరి యిట్లు సెప్పఁగా
వినమి గడుం జెడుం దెరువు వీరల పం పొనరింపు పెంపుగన్.

క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రా, జ్ఞానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామయ, శోనాశముఁ జేయ నేల చూచెదు చెపుమా.

వ. కృష్ణార్జునులతోడి విరోధం బీబంధులోకంబునక కాదు లోకంబున నెవ్వరికిని జూడం బోలదు లోకంబులు రెంటికిని హానిం జేయక కూడి బ్రదుకుట మేలనినఁ దదనంతరంబ ద్రోణాచార్యుండు దుర్యోధనున కిట్లనియె.

తే. పితృపితామహ గురులమై ప్రీతిఁ గోరు, చున్న యట్టిమా పరమహితోపదేశ
వాక్యములు విని దుర్జనవచనరచనఁ, గొనక బంధులతో నొడఁగూడి మనుము.

ఉ. పెన్నఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తరవాక్ప్రచయంబుతోఁ బో
వన్న కుమార యట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు మా
కన్నులు సల్లగా నకట గన్గొను చుండుదు మేము నట్లు గా
కున్నను నీవ నేర్తు నిను నొండన నేరము నిందుకొల్వ్వనన్.

చ. అనవుడు నాంబికేయుఁడు నిజాత్మజుదిక్కు మొగంబు సేసి యి
ట్లను హరి నాశ్రయించి భవదగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం
గనుమట పోయి దీన మన కార్యము లన్నియు సిద్ధిఁబొందు నీ
తనిపలు కాదరింపమిఁ బదంపడి పాటిలు నెల్లచేటులున్.

వ అనియె నట్టియెడ గురుభీష్ము లాత్మి చెప్పం దలంచి గాంధారేయున కిట్లనిరి.

క. ఈ కృష్ణునిసారథ్యము, నా కృష్ణుని గాండివంబు నై తోఁపకము
న్నీకొలఁదిఁ జక్కఁబడి నీ, వీ కురువంశంబు గావు మిభపురనాథా.

వ. అని పలికి మఱియు,

సీ. ధర్మపుత్రునిపదద్వయమున కతిభక్తి నెఱఁగిన నతఁడు ని న్నెత్తి గ్రుచ్చి
నిడుఁగేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలింపఁగ భీముఁడును నీవుఁ బరమహర్ష
మునఁ జారుతరవక్షములు సంగతములుగాఁ బరిరంభణం బొనర్పంగ నరుఁడుఁ
గవలును మ్రొక్కినఁ గర మర్థిఁ దిగిచి నీ వాలింగనంబు సేయంగ నిట్లు

తే వారు మీరును దగ బాంధవమునఁ బొదలి, యింపు దళుకొత్తఁ దామరతంపరైనఁ
జెలులుఁ జుట్టలుఁ గలిసి పేరెలమిఁ బొంది, యుల్లసిల్లంగఁ గుల మెంత యొప్పు నొక్కొ.

క. సమరమునకు వచ్చిన భూ, రమణు లుభయకటకములను బ్రమదం బెసఁగం
దమతమపురములకుం బోవ మహీజను లెట్టి యుత్సవముఁ బొందుదురో.

వ అని పెండియు ననేకవిధంబులం జెప్పి యీ రెండుదెఱంగులవారును బంచి కుడిచి సుఖంబున్న నఖిల భూప్రజ
కును బ్రమోదం బగుం గావున నట్లు సేసి యందఱచేత దీవనలు వడయవయ్య యీ పనిన విని దుర్యోధనుం డప్పుం
డరీకాక్షు వీక్షించి యి ట్లనియె

క. గురుఁడును బితామహుఁడు నీ, నరనాథుఁడు నెల్ల ప్రొద్దు నను దూఱుదు రి
ప్పరుసున నీవును దామో, దర దూఱెదు గాని తగవుఁ దలఁపవు కంటే,

క: వనితం బఱిచి రరణ్యం, బున నిడుమలఁ బడితి మనుచుఁ బోటరులై చం
పను జెఱుపఁ దలఁచి మూఁడెనఁ, గనలుదు రప్పాండుసుతు లకారణము కడున్.

మ. అరయం దప్పొకయింత నావలన లే దాధర్మపుత్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ము
ష్కరుఁడై పెండియు నొడ్డఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె నే
తెరు వైనం దనయిచ్చతోఁ బడియె నింతే కాక యేఁ బూఁటయే.

తే. మాత్స్యపాంచాల పాండ్యాదిమనుజపతులఁ, గూర్చికొని తార కయ్యంబు గోరి యెత్తి
విడిసి రింతియ కాక యివ్విధము నుగ్రకర్మమున కేము దొడఁగుట గలదె చెపుమ.

క. ఉక్కఱి సురపతి కైనను, మ్రొక్కము నృపధర్మమూఁది మొనతలఁ బడినన్
మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా.

చ. చిఱుతఁదనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక ముం
దఱ యటు పోవ నిచ్చితిఁ బితామహుఁడున్ జనకుండు నింకఁ గ్ర

చ్చఱ నిలఁ బంచి చక్కఁగ మక్కడ నెవ్వరికేని మద్బలం
బెఱుఁగక యీఁ దలంచినను నే నది యేటికి సమ్మతించెదన్.

తే. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండుసుతులు రాజ్యంబు సేయంగఁ జూచుకలుచ
నాకు నీఁ దీఱునే యింక నాఁటిచూఱ, లెక్కఁడివి ద్రోణభీష్ము లేదిక్కు సుమ్ము.

ఉ. ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు పల్కకుండు మిం
కేమియు వాఁడిసూది మొన యించుక మోపినయంతమాత్రయున్
భూమి యొసర్చి పాండునృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్.

తే అనిన విని కిన్కఁ బూనినయలఁతి నగవు, చెలువు మొగమున కొక క్రొత్త పొలుపు పొనర్పఁ
బుండరీకాక్షుఁ డగు తెల్లఁబోయి యప్పు, డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు.

## శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్నతండు సేసిన దుర్నయంబుఁలు సెప్పుట

క. మొనతలఁ బడియెదు నీచె, ప్పినయట్టుల తడవు లేదు బిరుదుల రై నీ
వును వీరు నిలువుఁ డిదె భం, డన మెల్లియ వచ్చె నూరటలు గనుఁ డింకన్.

సీ. అరయంగఁ దప్పు లే దంటి నీవలనఁ గీ డొకనాఁడు సేసియు నొక్కనాఁడు
సేయవె నీజనించినయది యాదిగా నుడుగక పాండవేయులకుఁ జాల
నగ్గు సేసితి విష మిడి పెనుఁబాములఁ గఱపించి నీరిలోఁ గట్టి త్రోచి
లక్కయిల్ గాలిచి పెక్కుభంగులఁ జంపఁ దలఁచినఁ జావక ధర్మరతుఁ

ఆ. జేసి నెగడి రాచసిరి నొంది యున్నఁ జూ, పోప కీవు తీవ్రపాపబుద్ధిఁ
గనమి జూద మొకటి కల్పించి కపటంబు, సేయ దాన నెల్ల చేటుఁ బుట్టె.

తే. అన్నదమ్ముల నెత్తంబు లాడి సతుల, తలలు పట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టివారి నెందుఁ, దడవుమా నీ వొకండవు దక్క నధిప.

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెడునట్టివే కులము శీలముఁ గల్గిన పుణ్యకాంత క
ట్లొప్పమి సేయు పెల్లఁ గని యున్నజనంబులు వించు నుండఁగాఁ
ద ప్పొకయింత లే దనువిధం బది నీక చనుం గుమారకా.

తే. ఎత్తి విడిసినవా రని యెల్లతప్పఁ, బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె
ద్రోణభీష్ములుఁ దండ్రియుఁ దోడుతోడఁ, జెప్ప తగుమాట లేమియుఁ జెవులుసొరవు.

క. శాంతిం బొందుట నీకుం, గుంతీపుత్రులకు మే లగున్ దానిక యే
నింతయు నాడెద నది నీ, కెంతయు రుచియింప కునికి యెఱిఁగి యెఱిఁగియున్.

వ అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గటకటం బడియెడు దుర్యోధనునకు దుశ్శాసనుం డిట్లనియె.

మ. జనకుండున్ గురుభీష్ములుం దగినకర్జం బాప్తులై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగు గాదు తమబుద్ధిం బోయి సంధాన మి
ట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకు ని న్నొప్పించువా రింతవ
ట్టు నిజం బిచ్చట నింక నీయునికి నెట్లుం గీడు వుట్టుం జుమీ.

ఆ. అనిన బాహ్లికాదు లగుకురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు నాదరింప
కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన, లేచి పోయె సంచలించెఁ గొలువు.

తే. అతనివెనుకన కర్ణుండు ననుజగణము, శకునియును వారిపొందైనజనపతులును
బోయి రమ్మెయిఁ జనియొక్కప్రోవు గట్టి, వేఱ యంతంత నుండిరి కోఱడమున.

వ. ఇట్లున్నం గనుంగొని గాంగేయుండు.

చ. ఇతఁ డిది యేల క్రొవ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమాని యై
మతి సెడి లోభమోహమదమత్సరముల్ దనుఁ ద్రిప్ప నిట్లసం
గతమునఁ బోయె వీనివెనుకం జని రేమి దలంచిరో మహీ
పతులును వీరు గొంద ఱతిభారపుమానుసు లేమి సేయుదున్.

తే. అని జనార్దనుఁ గనుఁగొని యకట శాల, పక్వ మయ్యె నీ నరపతి ప్రతతియెల్ల
ననుదుఁ దగువారిదెనఁ గలయంగఁ జూచి, తగవుమెయి నిట్టు లనియె న న్నగధరుండు.

శా. ఈ దుర్యోధనుఁ డింతగర్వి యగునే యీ యున్నవా రెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్ప దని చర్చింపండ యీ భంగికిన్
లేదే యొండుదెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ బోదే భేద మీజాతికిన్.

ఉ. కంసుఁడు నిట్ల తండ్రిమది గందెడుచంద మొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం గులమువారలు నా కెఱిఁగింప నేను దు
ర్మాంసము గోయు వైద్యునిక్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వయో
త్తంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్.

ఆ. అంతతోడ నెల్లయాపదలును దీఱు, వంశ మధికగౌరవంబు నొందుఁ
గూడి మనుట గలుగుఁ గురుపాండవులకు ని, త్తెఱఁగుసూడ మీకు నుఱవకాదె.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డదరిపడి విదురున కిట్లనియె.

ఆ. బుద్ధిమంతురాలు పొందుగఁ బలుకంగ, నేర్చు వచ్చి కొడుకుఁ దేర్చిపోవుఁ
గాన వేగ నీవు గాంధారిఁ దోడితె, మ్మనుడు నరిగి యతఁడు నట్ల చేసె.

వ. అద్దేవియు.

క. చనుదెంచి యుచితపీఠం, బున నున్నం గురువిభుండు పొలఁతుకతో ని
ట్లను నీతనూభవుఁడు దు, ర్వినయంబునఁ జనియె నిట్టి వెంగలి గలఁడే.

క. నీవైనఁ జెప్పి శాంతుం, గావింపఁగ నోపుదేని గౌరవకుల మీ
గోవిందుశాసనము నం, భావింపం గాంచి చెడక బ్రతుకుం జుమ్మీ

తే. అనుడు నీపుత్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి, యెఱిఁగి వానివశంబున నేలపోయె
దీవు పాండవులకు నేమి యిచ్చితేని, నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప చెపుమ.

క. అని గాంధారి పతియుఁ దా, నును విదురుం బనిచె నందనుం బిలువ నతం
డును మొగము జేవుఱింపఁగఁ, జనుదెంచెను సభకు విదురసంప్రార్థితుఁడై

వ. మున్ను దనతోడం జనినవార లందఱు నచ్చోటన నిలువ నిట్లు వచ్చి సుయోధనుండు నిజాసనాసీనుం డై యున్నఁ జూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికి ధర్మంబును నీతియును, జుట్టఱికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబు గొలందియుఁ సకలజనచిత్తప్రకారంబును బాండుపుత్రుల బలపరాక్రమంబులుఁ దెలియునట్లుగా దెఱంగు పడం జెప్పి బుజ్జగించియుం గినిసియు ననేకవిధంబుల నాడిన నమ్మాటలదెస ననాదరంబు సేసి యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలసి వారునుం దానును దుర్మంత్రంబునకుం జొచ్చి.

## దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱం బెట్టఁ దలంచుట

క. హారితలఁ బొప్పదు భీష్ముని, గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వాఱఁ బట్టం
గర ముత్సహించు చున్నాఁ, డరయ నతనివచనరచన నంతయుఁ దెలిసెన్,

క. మును దాఁ గంసునిఁ బరిమా, ర్చినచందము వారి కెల్లఁ జెప్పెడుఁ దనకున్
మును మనము గడఁగి వెసఁ బట్టినఁ గార్యం బగుఁ జలంబు డింపకుఁ డింకన్.





# స్వర్గసీమ

'సౌభద్ర'

"రావోయ్. మాపాపాయిని చూసిపోదు గాని" అన్నాడు సూర్యనారాయణ, మిత్రుడు మధుసూదనరావుతో.

ఇద్దరూ యింట్లోకి వెళ్ళారు. ఒక స్త్రీ పాపాయిని ఉయ్యాలలో ఊపుతూవుంది.

"కమల యింకా ఆఫీసునుంచి రాలేదా వెంకాయమ్మ గారూ?" కుర్చీ మీద కూర్చుని బూట్లు విప్పుకుంటూ అడిగాడు సూర్యనారాయణ.

"వచ్చి క్లబ్బుకు వెళ్ళారండి."

వెంకాయమ్మ వైపొకసారి చూసి, ఉయ్యాలలో పాపాయిమీద దృష్టి నిల్పాడు మధు. పాపాయి నోట్లో పాల పీకవుంది. వెంట్రుకలులేని తల. పచ్చని పండువంటి శరీరం. భగవంతుడి ప్రతిరూపం - పసికందును చూస్తే ముద్దువేసింది మధుకి.

"పోతపాలా?"

"అవునోయ్, తల్లిపాలు లేకకాదు కాని మా కమల కిష్టంలేకపోయింది. దాని ఆరోగ్యం చెడిపోతుందేమోనని భయపడింది. 'సరేలే' అని గాక్సో పాలు పోయిస్తున్నా." తన భార్యమీద వున్న ప్రేమ సూర్యనారాయణ తృప్తిగా ప్రకటించాడు,

ఫ్లాస్కులో కాఫీ కప్పు
నారాయణ కొకటి, మధుకొ
వెంకాయమ్మగారు. ఇంట్లో
పనులు చూసుకొనే వా
గారు.

"అమ్మగారికి అరటికాయ
సన్నగా తరిగి నురగల్లా వేయ
కేమన్నా కావలిస్తే వచ్చి
క్కని చేయమన్నారు."
కాఫీకప్పులు తీస్తూ అడిగింది.

"వాడూ అరటికాయ వే
టుంది. అదే చెయ్యండి."

మిత్రులిద్దరూ బయటకు వ
దేరారు. సూర్యనారాయణ,
రావు ఒకే ఆఫీసులో గుమాస్తా
23 ఏళ్ళుంటాయి. కమల సూ
భార్య. మరొక ఆఫీసులో
ఇంటర్మీడియేటువరకూ చ
స్త్రీలక్లబ్బులో స్త్రీస్వాతంత్
అభివృద్ధికి అవలంబించవలసి
చిన చర్చలలో పాల్గొంటూ
ఆశయాలకు తగినట్లు చదువుకు
చేసుకున్నాడు సూర్యనారా
మధు కింకా పెళ్ళికాలేదు.
ప్రతికే సావకాశము చూసు

పోని సూర్య
ఇచ్చింది
ంట, మిగతా
ంకాయమ్మ

ముక్కలు
ంటు. మీ
గ్యక కను
కే అయిన

మే భాగం

రు బయలు
ధు మూద న
మధుకు
నారాయణ
వేస్తూవుంది.
అవ్రారి
ృనికి, స్త్రీల
లు గురిం
ుకుంది. తన
కమలని
ను.
క్తిగతంగా
పెళ్లి చేసు

పోవటం అతనివుద్దేశం. ఇప్పుడతనున్నతం(త లేవి. తం(డిదగ్గనుంచి ఆరోజు ఉత్తరం వచ్చింది. మేనకోడలు పద్మతో తన పెళ్ళి నిశ్చయమైనదని. ఈ ఆలోచనలలో మధు కొన్ని సంవత్సరాల ముందు కెళ్ళాడు— సంసారం, పిల్లలు-ఉద్యోగం-డబ్బు సరిపోక పోవటం—అప్పులు—పిల్లల పెళ్ళిళ్ళు— కాలేజీ చదువులు-డబ్బు పుట్టక, యిచ్చిన వాళ్ళు నడివీధిలో నిలవేసి అడిగి-మామూలు మధ్యతరగతిమనిషి (బతుకును తలపోశాడు మధు. మేనమామ కూతురన్న మాటే కానితను దూరంగా చదవటంవల్ల పద్మని చూసిచాలా సంవత్సరాలయ్యింది. వయసొచ్చిన తర్వాత చూడనేలేదు. అందువల్ల రాబోయే భార్య అభిరుచులేమిటో తదనుగుణంగా తను మసల గలడో లేడో—ఇవన్నీ ఆలోచనల్లో దొర్లించుకుంటూ నడుస్తున్నాడుమధు. మధు మౌనానికి కారణం తెలియలేదు సూర్య నారాయణకి.

"ఏమి టాలోచిస్తున్నావు?" అని మధు ఆలోచనల కంతరాయం కల్పించాడు.

"ఏం లేదు. ఇవేళ మా నాన్నగారి దగ్గ నుంచి ఉత్తరం వచ్చింది. పెళ్ళి నిశ్చయ మయ్యిందని."

"రైటో. అయితే మాకు తగిలిందన్న మాట డిన్నరు. కట్నమెంత? పిల్ల చదువు కున్నదేనా?"

"కట్నాల ఆశ మా యింట్లో లేదు. మేనరికం. మూడవఫారంవరకూ చెప్పించాడు మామయ్య అంతే."

"అట్నే-మేనరికం కాబట్టి నేనేమీ అన లేక పోతున్నానుగాని, నన్నడిగితే చదువు కొని పిల్లని చేసుకోమని నేను సలహా యిస్తానోయ్. మా కమల చూడు బాగా చదువుకుంది. నాకు ఆటే సంసార బాధ లేకుండా సంపాదించి పెడుతోంది. నాకు ఆశ్చర్యం వేస్తుంది మధూ! కొన్ని విషయా లలో నన్ను కాపిస్తుంది సుమా!..." ఇంకా ఏదో చెప్పబోతున్న సూర్యనారాయణ నాపి—,

"ఏమనుకోకు (బదర్. నాకిది నచ్చదు. తల్లిస్తన్యం నోచు కొనిపాప మీయిం ట్లోవున్నాడు. ఇంటి విషయాలు సరి గా చూసుకోలేని స్త్రీ వీధులో ఉద్యోగం చేయనూ వచ్చు. కేవలం భర్తని నిర్లక్ష్యం చేయనూ వచ్చు. నేను నీ భార్యని వ్యక్తిగతంగా విమ ర్శించటం లేదు. ఆమె నా సోదరిలాటిది. కాని మనం యిలాంటి విషయాలు మాట్లాడ వద్దు." అన్నాడు మధు.

సూర్యనారాయణముఖం వివర్ణమయ్యింది. ఇనా అతని మనసు అప్పుడప్పుడు మధు వాదించే పద్ధతుల వైపే మొగ్గుతూవుంటుంది. సంఘంలో స్త్రీయొక్క స్థానం గురించి కమ లతో వాదన వేసుకుని ఎడమొగం, పెడ మొగం పర్యంతం వచ్చాక విరమించే వాడ తడు. అక్కడనుంచి వాళ్లిద్దరి ప్రేమలకి మధ్య రెండురోజులపాటూ పెద్దగోడ లేచేది.

సూర్యనారాయణ యింటికి వచ్చేప్పటికి కమల యింకా రాలేదు.

"మీకు వడ్డించమన్నారాబాబూ!" అని అడిగింది వెంకాయమ్మ.

"కంగారులేదు. కమల వచ్చిన తర్వాత తింటాను" అన్నాడు. వెంకాయమ్మ వడిలో గ్లాస్కోపాలు (తాగుతున్న పసిపాపను చూశాడు. మధు చెప్పినది నిజమే! పిల్లవాడికి పాలివ్వటానికి ఇంకోతల్లికి (ప్రేమ యెక్కడ నుంచి వస్తుంది. కాని కమలకి బాబంటే చాలా ముద్దు! ఆ విషయం తనకి తెలుసు. ఈ ఆలోచనలో కి'దాటిపోయింది. చెంగు పరచుకొని గోడ వార వెంకాయమ్మ నడుం వాల్చింది. పడకకుర్చీలో పడుకుని వాసాల వంక చూస్తూ కాలాన్ని ఖర్చు పెడు తున్నాడు సూర్యనారాయణ.

ఇంతసేపటి దాకా క్లబ్బులో ఎందుకు? నాయకులు, వినాయకులు మెళ్ళుకుంటున్నారు. దేశంగురించి ఇంజనీర్లు, ఐ. సి. యస్. ఆఫీసర్ల అంచనాలు తప్పుతున్నాయి. (ప్రాజె క్టులు, ఖర్చులుగురించి— అల్లాంటిది అర్ధరాత్రి దాకా క్లబ్బులో వీళ్ళు చర్చించి సాధించేదేమిటి?' ఈ ఆలో చనలతో ఎప్పుడో నిద్రపట్టిందతనికి—

అది పెద్దఅడవి, పెరిగినజుట్టు, గడ్డం పెరిగిన చుట్టూకొన్న అతను కప్పుకుంటూ... దవంలేని. శరీరంతో మానవుడా అరణ్యంలో తిరుగుతున్నాడు. ఆ అనాగరికుని కాక... వేసింది. చేతికందినరాయితో పొదలోంచి తొంగిచూస్తున్న కుందేలుని తిరిచాద కొట్టా డు. దాన్ని తీసుకుని కొరికాడు. ... నోటి కసహ్యంగా తోచింది. ఏభాగా ... గిన గోళ్ళతో చర్మం ఒలిచాడు. దాన్నంత... కారక్తాన్ని మామిడి పండు రుచిలా







# స్వర్గసీమ



[illegible]డు. పచ్చిమాంసం తృప్తిగా భుజించి [illegible]ద్వాధ నవనయించుకున్నాడు. గమ్యం తెలియకుండా తిరగడం సాగించాడు. మబ్బులు కమ్మాయి. హోరున వర్షం కురుస్తోంది. జల్లులు ముల్లుల్లా పొడుస్తున్నాయి శరీరాన్ని. ఒక చెట్టుకిందకు పోయి నుంచున్నాడు. ఆ చెట్టుకిందే వీనిమాదిరే ఒక స్త్రీ కనపడింది. ఏవో చేతితో సంజ్ఞలు చేస్తూ, నాలిక తిరిగినంతవరకూ అస్పష్టమైనధ్వనులు చేస్తూ, భావప్రకటన చేసుకున్నారిద్దరూ.

అడవిలో జంతువుల్ని సులభంగా చంపి ఆహారం సంపాదించేందుకు వీలుగా రాతిని సూదిగా పొడుగుగా చెక్కాడు మానవుడు. ఎండ వానలను తప్పించుకోవటానికి వీలుగా గుహల్లో నివసించారు వారిద్దరూ. ఆహారం కోసం చంపిన పెద్ద జంతువుల ఎండిన చర్మం కప్పుకోవటంతో చలిబాధనుంచి విముక్తులయ్యారు.—ఇది సృష్టి ప్రాథమిక దశ.

క్రమంగా మానవుడికి గృహనిర్మాణం, వస్త్రాలు నేయటం తెలిశాయి. నాలుకులా (తెగ) లేర్పడాయి. బ్రాహ్మణుడు భావి సౌభాగ్యానికి వేదము లుచ్చరిస్తూ, క్షత్రియులు తమ శౌర్యంతో జనపదాల్ని శత్రువులనుండి రక్షిస్తూ, వైశ్యులు నిత్యజీవితావసర వస్తువుల్ని జనులకు సమకూరుస్తూ, శూద్రులు కాయకష్టంతో వ్యవసాయం చేసి ధాన్యాదులు పండిస్తూ వ్యవహరించేవారు. వృత్తుల్నిబట్టే కుల విభజన జరిగింది. అంటరానితనం వుండేదికాదు. భోజనాదులం దరమర లుండేవిగావు. స్త్రీ పురుషునితో సమంగా హక్కు కలిగి వుండేది. గృహకృత్యాలలో ప్రతినిత్యం ఆమె ఆసరా పురుషుని కవసరమయ్యేది. స్త్రీ విద్యావతి యైనందువల్ల పిల్లల చదువు సంధ్యలు, ఆలన పాలనలు చక్కగా జరిగేవి. స్త్రీకి సంఘంలో ఉన్నతమైన స్థానం వుండేది. పరస్త్రీ పరాఙ్ముఖత్వం పురుషులలో తోచేది. స్త్రీని పాపచింతతో చూచినా, తత్క్రియకు ప్రోద్బలంచేసినా శిక్షపడేది.

* * *

కళాశాల విద్యార్థినులు బయటికి వస్తుంటే విద్యార్థులు వెనకపడుతున్నారు. అమ్మాయీమణుల వీపులు పమిటతో పూర్తిగా కప్పకపోవటం వల్ల జాకెట్టులోనుండి గోచరించే బాడీలు చూసి తన్మయులౌతున్నారు విద్యార్థులు. పమిట ప్రాముఖ్యత ఎలాటిదైనా ఒకరొమ్ము బయటి ప్రపంచానికి వదిలి, తమ కృత్రిమ సౌందర్యంతో ఉన్మత్తులయ్యే విద్యార్థుల్ని క్రీగంట చూస్తూ హావభావచేష్టల్ని ద్విగుణం చేస్తూ నడుస్తున్నారు విద్యార్థినులు.

సూర్యనారాయణకి కమల లేపటంతో మెలకువ వచ్చింది.

"ఇదేమిటండీ, కుర్చీలో పడుకున్నారూ? చమటతో ఒళ్లంతా తడిసిపోయింది చూశారా? భోజనం చేశారా?"

"లేదు" అన్నాడు సూర్యనారాయణ కల నెమరుకు తెచ్చుకుంటూ.

"నాకోసం మీ రెందుకండీ కూర్చోవటం. ఈ వేళ 'మహిళల ఉన్నతికి మార్గాలు' అనే విషయం చర్చిస్తూ కూర్చున్నాం. పోనీ వచ్చేదామనుకుంటే వదిలిపెట్టలేదు వాళ్లంతా."

"పోనీలే యిప్పుడేం వచ్చింది. నీతో కలిసి తిందామని కూర్చున్నాను."

వెంకాయమ్మ వడ్డిస్తోంది. కమల, సూర్యనారాయణ భోజనానికి కూర్చున్నారు.

"కమలా! ఒక ప్రశ్న వేస్తాను. జవాబు చెపావా?"

"వెయ్యండి ప్రయత్నిస్తాను."

"నాగరికత అంటే ఏమిటి?"

"అబ్బో చాలా చెప్పాలి. అయినా మీకు తెలియకే అడిగారా యీప్రశ్న?"

"నాకిప్పుడొక కలవచ్చింది. దానిని బట్టి నేను గ్రహించినదిది—వ్యక్తి ప్రకృతిలో ఉన్న వస్తువుల్ని తన భుక్తికి, నివాసానికి, ధరించేబట్టకి, అంటే—అవసరాలకి వీలుగా మార్చుకుని ఉపయోగించుకుంటాడు. ఇదే సృష్టి ప్రారంభంనుంచి అభివృద్ధిచెంది అభిరుచుల్ని బట్టి అనేక విధాలుగా మారింది--ఏమంటావు?"

"కావచ్చు కాని మీ ఉద్దేశం...?"

"నా ఉద్దేశం,...ఈ మూడు అవసరాలకూ తప్పించి చేసేపనులు ఏదో స్వార్థం, దర్పం వెలగబెట్టుకోటానికి చేసేవని నా భావం."

"నాకు కొంచెం విపులంగా—"

"చెప్పాలా? అయితే విను—రోజంతా కష్టపడి పనిచేసినపుడు విశ్రాంతి అవసరమే–కాని మీరు స్త్రీలను గురించి చేసే ప్రసంగాలు, అభివృద్ధికి అవతరింపజేసే ప్రణాళికలు—ఎన్నికలలో పదవుల కోసం, స్వప్రయోజన సాధనకోసం, స్వజనోద్ధరణంకోసం ప్రస్తుత రాజకీయ నాయకులు వేదికల మీద అరచే అరుపులతో సమానం. అదుగో అప్పుడే నీకు కోపం వస్తోంది. కోపం నీ ఒక్కతె సొత్తేకాదు. నేచెప్పేది పూర్తిగా వినకుండా—

"హుం. కోపం. సాయంత్రం దాకా ఆఫీసుఫైళ్ళలో మగ్గియింటికొచ్చి బూజు పట్టిన సిద్ధాంతాలను గురించి ఆలోచించటం తెలిసిన మీకు—మారుతున్న కాలాని కనుగుణంగా, అణచిపెట్టిన మా హక్కుల్ని పురస్కరించుకుంటూ, భారతావనికి నవ్య మహిళా సేవాసమాజాలద్వారా విభూషలుగా మారుతున్న మమ్మల్ని చూస్తే యీసడింపు, తప్పుడు భావాలు వుండటం సహజం. యుగయుగాలుగా మీకు దాసీలుగా పడివున్నాము. మీరు క్రూరంగా హింసించినా పరలోకంలో ఉన్నదనుకొన్న పుణ్యమనే పరమార్థంకోసం పతిసేవికలుగా వున్నాం. అందువల్ల మేమా విధంగా ప్రవర్తించడం మా విధి అని మీరనుకొని, మీ కట్టుబాట్ల కత్తులబోనులో యిరికించారు ఈనాటికి మీ నీతిబోధలు, పుక్కిటి పురాణాలు మూలపెట్టవలసిన అవసరం కలిగించామని మర్చిపోకండి...మీకిష్టంలేకపోతే ఆ విషయం పట్టించుకోకండి అంతేకాని నాకు హితబోధ చేయనక్కరేదు."

"సంతోషం. ఇంట్లో వంటవండుకోవడానికి ఒళ్ళు బద్దకమైన నువ్వు వీధిలో రాణించగలవని నాకు నమ్మకం లేదు. భర్తతో అనుకూలదాంపత్యం చేయచేతకాని నీవు, ఆఫీసులో అధికారుల దృష్టిలో సరిగా చూడబడతావని నేననుకోలేను. అమాయకుడైన పసికందును పాలిచ్చి తృప్తిపరచలేని నీవు కోట్లాది వ్యక్తుల్ని సంతోషపెట్టగలవనీ అనుకోను. కళ్ళువిప్పి ఒకసారిచూస్తే మన సంసారం విశ్వరూపం కనిపిస్తుంది. ఇద్దరం సంపాదిస్తున్నాం—నెలకెంత నిలవ వేయగలుగుతున్నాం? ప్రతినెలా యిద్దరం సంపాదిస్తున్నా అప్పు చేయాల్సిన అవసరం ఎందుకు కలగాలి? మన కాళ్ళపై మనం నిలబడలేనప్పుడు పరుల భారం వహించగలమని నువ్వెలా అనుకుంటున్నావు? కమలా! మీ స్త్రీ ఉద్యమం అంటె నాకు సానుభూతి లేకపోలేదు. కాని నేల విడిచి సాము చేయడం మంచిదికాదని నా అభిప్రాయం."

సగంలో తింటున్న అన్నం వదిలేసి "ఛీ, ఒకరికి భారం కాకపోయినా జీవితానికి సుఖంలేదు." అంటూ కమల లేచిపోయింది. వెంకాయమ్మ నిర్ఘాంతపోయి నిలబడింది. సూర్యనారాయణ కూడా భోజనం పూర్తి కాకుండా కంచంలో చెయ్యి కడుక్కుని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి దంపతులిద్దరూ కంటిమీద కునుకు లేకుండానే గడిపారు.

* * *

వివాహం. తదితర తంతులు, పూర్తయాక పద్మని వెంటపెట్టుకొని వచ్చేశాడు మధు. హృద్యమైన పదార్థాల నారగించటంవల్ల హోటలు జీవితం మరచాడు మధు.

ఆ రోజు మధు ఆఫీసుకు వెళ్ళేప్పుడు,

"ఏమండీ రంగుదారాలు తెచ్చి పెట్టండి

(48-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**(21-5-58 మొదలు 27-5-58 వరకు)**

## గ్రహస్థితి

<table>
<tr><td>శు</td><td>బు కే</td><td>ర</td><td></td></tr>
<tr><td>కు</td><td colspan="2" rowspan="2">26 తేదీని శుక్రుడు మేషములో ప్రవేశించును.<br>మిధున, కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు.</td><td></td></tr>
<tr><td></td><td></td></tr>
<tr><td>శ</td><td></td><td>రా</td><td>గు</td></tr>
</table>

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము మీకు యోగదాయకము. యత్నకార్యములు ఫలిస్తాయి. ధనాదాయము అనుకున్నదానికన్నా ఎక్కువగా ఉంటుంది. పరోపకారము చేసారు. పుణ్యకార్యాలలో పాల్గొంటారు: శుభకార్యాలోచనలు చేస్తారు. ఉద్యోగస్థులకు యోగకాలము. పట్టుబట్టలు, బంగారము, వజ్రములవంటి ఖరీదయిన సరుకుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. 21, 22 పరోపకారము. 23, 24, ప్రయాణము. 25 ధనలాభము శుభకార్యాలోచన. విందు, వినోదము. 26, 27 నిలకడలేని స్థితి.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము అనుకున్నట్లు పనులు జరగక అనవసర ధనవ్యయము అవుతుంది. మిత్రుల నుండి ఆశించిన సహాయము కలుగదు వారాంతమునకు ప్రయాణములో తటస్థపడిన స్నేహితునివల్ల కార్యసిద్ధి పొందుతారు ఉద్యోగస్థులకు అరణ్య ప్రదేశములకు బదిలీ అయే సూచనలున్నవి. వ్యాపారస్థులకు లాభము తక్కువ, ఖర్చులు ఎక్కువ. 21, 22 త్రిప్పట, ధనాభావము. అధిక ఖర్చులు. 23, 24 ప్రయాణము, మిత్రసహాయము. 25 నూతనులతో పరిచయము కార్యసిద్ధి. 26, 27 అనారోగ్య సూచన. ఉద్యోగస్థులకు బదిలీ, రాజకీయవాదులకు మేలు.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము ధనలోపమువల్ల అనుకున్న పనులు నెరవేరవు. మిత్రులనుకున్న వారే సమయానికి సహాయము చెయ్యరు కాని మీరు ఎవరి సహాయాన్ని ఆశించలేదో అతనే అడ్డుపడి వారాంతమునకు కార్యసిద్ధి అయేలాగు చేస్తాడు. వర్తకులకు వారాంతమున లాభిస్తుంది. ఉద్యోగస్థులకు పర్వతప్రాంతాలకు బదిలీ అయే సూచనలున్నవి. 21,22 త్రిప్పట, ధనాభావం ఆటంకములు 23,24 ప్రయాణము 25 మిత్ర సహాయము కార్యసిద్ధి విదేశీయులతో పరిచయము, విచిత్ర వస్తు సంపాదన. 26, 27 ఇంట్లోవున్న పెద్దవారి అనారోగ్యముచే వ్యథ.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈవారము కార్యాచరణలో ఆటంకాలు కలుగుతాయి. మీకు దైవముపై నమ్మకము కలుగుటచేత అన్ని అడ్డంకులు తీరి తుదకు కార్యలాభము పొందగలరు. మీకు ఆకస్మికముగా ధనలాభము కలుగుతుంది. తీర్థయాత్రలు చేయాలనే కోరిక కలుగుతుంది. ఆత్మీయుల అనారోగ్యమువల్ల ఆందోళన చెందుతారు. ఉద్యోగస్థులకు నిమితము తక్కువ. వ్యాపారస్థులకు నష్టము కలుగునేమోఅనే ఆందోళన 21,22 నిలకడలేనిస్థితి 23 24 ఆటంకములు 25 దైవచింత, ధనలాభము కార్యసిద్ధి 26, 27 ఆత్మీయుల అనారోగ్యము ఉత్తర దిశకు ప్రయాణము.


బి. నరసింగరావు


### * మృగశిర [వే, వో, కా, కీ]*

ఈవారము అనుకున్నట్లుగా డబ్బురాకపోగా ఖర్చులు ఎక్కువగుటచే ఆందోళన కలుగుతుంది. మీపనులు కాకపోవడమే కాకుండా పరోపకారము తలపెట్టి అనుకున్నట్టు జరగక పోవడమువల్ల నిందలచే మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు కొంత అనుకూలిస్తవి. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు కార్యభారము ఎక్కువ వర్తకులకూ వ్యవహారము పట్ల పేచీలు. భార్యకు ఆరోగ్యము భంగపడే సూచనలు 21, 22 ఏమీ చేయుటకు తోచని అవస్థ. 23, 24 కార్యభారము, త్రిప్పట 25 కార్యలాభము 26 27 వివాదాలు ఆరోగ్య చింత.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము యత్నకార్యములకు ఆటంకములు. డబ్బుకు యిబ్బంది పడవలసివస్తుంది. ఆప్తుల సహాయానికి పూనుకొని జరగక మాట పడుటచే మనోవ్యథ నొందుతారు. యంత్రముల వల్లగాని, అగ్నివల్లగాని కలిగే ప్రమాదము జాగ్రతవల్ల తప్పవచ్చును. భూస్వాములకు, యంత్రములు నడుపు నిపుణులకు, రసాయన శాస్త్రజ్ఞులకు, గనుల యజమానులకు లాభం. 21, 22 కార్యాలోచన 23, 24 ఆటంకములు నిందలు. 25 కార్యలాభం 26 27 ప్రమాద సూచన. ఉద్యోగస్థులకు బదిలీయగుటగాని శెలవు పెట్టుటగాని జరుగును.

### * పునర్వసు [కే, కో, హా, హి] *

ఈ వారము మీకు యోగప్రదము. గత వారము కాకుండా నిలిచిపోయిన పనులలో ఈ వారము అధికారుల సహాయము మీ పలుకుబడి, బుద్ధిబలము ఉపయోగించి కార్యసిద్ధిని పొందుతారు. బంధు సహాయము కూడా కలుగుతుంది. ధనాదాయము వృద్ధి పొందుతుంది. 21, 22 తొందరలు తగ్గి కార్యక్రమము ఏర్పాటు చేసుకుంటారు. 23, 24 చాంచల్యము 25 మిత్రలాభం, ధనాదాయము, కార్యానుకూలత 26, 27 అధిక ఖర్చులు, జ్యోతిష విద్యా ప్రసంగము గణితశాస్త్రజ్ఞులకు, కవులకూ, చిత్రకారులకూ, నటీనటులకు యోగకాలము.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారం మీకు పండితులతో పరిచయమువల్ల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. ప్రభుత్వ సన్మానమువల ధనప్రాప్తి కలుగుతుంది. పిల్లల యోగక్షేమములచే ఆనందమును పొందుతారు. పుత్ర సంతానప్రాప్తి కలుగుతుంది. కోర్టు వ్యవహారములు సుముఖమవుతాయి. నూతన ప్రయత్నములు చేస్తారు. ఉద్యోగస్థులకు హోదా పెరిగే సూచనలున్నాయి. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము 21, 22 వైద్యజ్యోతిష విద్యాప్రసంగము, విజ్ఞానవృద్ధి, ధనలాభము. 23, 24 ఏ పనులు జరుగవు 25 న నూతన కార్యారంభము, ప్రభుత్వ సన్మానం. 26, 27 పుత్రప్రాప్తి, విద్యావ్యాసంగముకొరకు ధన వ్యయము.

### * ఆశ్లేష [డి, డూ, డే, డో] *

ఈ వారము మీరు తలపెటిన పనులు జయప్రదముగా ముగుస్తాయి. కోర్టు వ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతాయి. నూతన వస్త్రములు కొంటారు. ఉద్యోగస్థు

 

# నక్షత్రఫలితాలు



లకు అనుకూలము. ద్రవ పదార్థ వస్తువులు, బెల్లము, పంచదార, బట్టలు, బియ్యము వ్యాపారస్థులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 21, 22 ప్రయాణము, శుభకార్యాలోచన, విందు, వినోదము. 23, 24 తెమలని కార్యక్రమము. 25 ధనలాభము, కార్యసిద్ధి. 26, 27 ఆందోళన. నీటిమీద ప్రయాణము.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము మీకు శుభయోగము. ప్రయాణము చేస్తారు, బంధు మిత్రులను కలుసుకుంటారు. ఇష్టవస్తు లాభమును పొందుతారు. నూతన గృహనిర్మాణ ప్రయత్నముగాని వాహనయోగముగాని కలుగుతుంది. నూలు, బట్టలు, బంగారము వ్యాపారస్తులకు క్రయ విక్రయాలలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 21, 22 ఇష్టవస్తు ప్రాప్తి, భాగ్యవృద్ధి. 23, 24 ప్రయాణము. 25 శుభ కార్యాలోచన, విందు, వినోదము. 26, 27 కార్యాచరణలో ఖర్చులు, నూతన బాంధవ్యము, కవితాగోష్ఠి.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈ వారము వింతమాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ఉద్యోగప్రయత్నము, అధికారులతో పరిచయమువంటి యోగములు కలుగుతాయి. కార్యభారము ఎక్కువగుట చేతను అకాలభోజనములను ఆరోగ్యము చెడే సూచనలు కనబడగా వే గ్రహరాజైన రవికి శాంతిచేయించడమువల్లను ఔషధసేవలను సరిపడుతుంది. కోర్టు వ్యవహారములు వాయిదా పడుతవి. 21, 22 అధికారులతో పరిచయము, ఉద్యోగలాభము, ధనయోగము. 23, 24 ప్రయాణము, 25 ప్రభుత్వానుగ్రహము, కార్యసిద్ధి. 26, 27 అనారోగ్యము ఔషధసేవ.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము మీకు ధనవ్యయము ఎక్కువ. మీకేకాకుండా మీ పిల్లలకుకూడా కలిగే అనారోగ్యమునకు అశ్రద్ధచేయకుండా వెంటనే ఔషధసేవ చేయుటవల్ల నయమగును. అనవసర ప్రసంగమువల్ల అధికారుల ఆగ్రహమునకు గురై పర్వతప్రదేశమునకు ఉద్యోగస్తులకు బదిలీఅయ్యే సూచనలున్నవి. వ్యాపారస్తులకు ఖర్చులు ఎక్కువ, లాభము తక్కువ. క్రయవిక్రయములలో దగాపొందుతారు. దేశాటనము చేయుట, అన్యదేశీయులతో పరిచయము. విద్యార్థులకు పరీక్షలలో జయము తక్కువ. మీరు రహస్యములు కనిపెట్టుటలో నిపుణులగుటచే ప్రభుత్వముచే అందుకు నియోగించబడుతారు. 21, 22 కార్యప్రయత్నములు 23 24 ఆటంకములు, దగా, విచారము, ప్రయాణము 25 విదేశీయులతో స్నేహము, కార్యలాభము. 26 27, బదిలీ, దుష్టవార్తాశ్రవణము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము యత్నకార్యములకు ఆటంకములు బంధువుల రాకపోకలవల్ల ఆర్థికముగా ఇబ్బంది. గృహమందున్న ఆప్తులకు శరీర పీడ కలుగుటచే, మనోవ్యధ. ఉత్తరదిశ ప్రయాణమువల్ల నష్టద్రవ్య లాభము విచిత్ర వస్తువులు చూచుట జరుగును. దావాలు మీ పరముగా తీర్పు అవుతవి. ఆధ్యాత్మిక చింతచే శాంతి పొందుతారు. ఈశ్వరానుగ్రహమువల్ల కార్యలాభము. 21 22 ప్రయత్నములు 23, 24 ఆటంకములు ప్రయాణము ఎక్కువ ఖర్చులు 25 కార్యలాభము, ఆధ్యాత్మికచింత. 26,27 ఆరోగ్యచింత, స్త్రీలతో విరోధము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము యత్నకార్యములు ఫలించక పోగా, కార్యభారముతో పాటు ఖర్చులు కూడా పెరుగుతవి. దావాలలో జయము కలుగుతుంది గాని వ్యర్థముగా తిరుగుట, సజ్జనులతో విరోధము కలుగుతాయి ఉద్యోగస్థులకు బదిలీ అగుటగాని, శెలవు పెట్టి వృథాగా కాలము గడుపుటగాని జరుగుతుంది. కొర్రలు, రాగులు, సజ్జలవంటి అపర దినుసులు, నువ్వులు వంటి నూనె దినుసులు, వ్యాపారస్తులకు లాభిస్తుంది. 21, 22 ప్రయత్నములు 23, 24 ఆటంకములు, వృథాశ్రమ, విరోధము. 25 కార్యలాభము. 26,27 స్త్రీల అనారోగ్యము బదిలీ లేక శెలవు పెట్టుట.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

మీరు పట్టుదలగలవారగుచే ఈ వారము కార్యాచరణలో వచ్చే ఆటంకములను ధైర్యముతో ఎదుర్కొని తుదకు జయము పొందుతారు. గృహములు, భూములు మొదలగు స్థిరాస్తికురించి ప్రయాణము చేయవలసి వస్తుంది. ధనలోపమువల్ల అప్పుచేస్తారు. అగ్నివల్లగాని, యంత్రమువల్లగాని, వాడి పనిముట్లవల్లగాని ప్రమాదము కలిగే సూచన జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయన శాస్త్రజ్ఞులకు, ఎరువుల వ్యాపారస్తులకూ, భూస్వాములకూ, గనుల యజమానులకూ కష్టముతో కూడిన లాభము. విద్యార్థులకు జయము తక్కువ. 21 22 ప్రయత్నములు 23, 24 ఆటంకములు, అప్పుచేయుట. 25 కార్యసిద్ధి 26, 27 ప్రమాదము, దూరమందున్న ఆప్తుల అనారోగ్యవార్తచే వ్యధ.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

గత వారము కలిగిన నష్టము ఈ వారము కలిసివస్తుంది. మాట నేర్పరితనమువల్ల, పెద్దవారి పలుకుబడి సంపాదించి, కీర్తి ప్రతిష్ఠలు పొందుతారు. కుటుంబములో సుఖ, సంతోషములు నిండివుంటాయి. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ లభిసుంది. వ్యాపారసులకు లాభము. కవులకు సన్మానము కలుగుతుంది. జ్యోతిష విద్యా గోష్ఠిలో పాల్గొంటారు. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. 21, 22 తెరిపిలేని కార్యక్రమము. 23, 24 ప్రయాణము, అలసట, 25 న కార్యసిద్ధి మిత్రదర్శనము, ధనలాభము. 26, 27

### —ధరలు :—

నూలు, వస్త్రములు : కొంచెము చురుకగును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

పంచదార, బెల్లము, చింతపండు: మార్పు లేదు.

పప్పుదినుసులు : కొంచము చురుకగును.

ఆహారధాన్యములు : కొంచము పెరుగును.

వెండి, బంగారము: మందమగును.

ఎండలు మెండుగాయున్నను గాలితోకూడిన మంచివర్షములుకలుగును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృషీకేశను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

అధిక ఖర్చులు, శ్రమ.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈవారము మీకు భాగ్యవృద్ధి అవుతుంది. తలపెట్టిన పనులు కార్యరూపము పొందుతాయి. అవసరమైన డబ్బు, మనుష్య సహాయము ఎక్కువ శ్రమ అవసరం లేకుండానే జరుగుతాయి. కోర్టు వ్యవహారములలో జయం కలుగుతుంది. పుత్ర విభవమువల్ల సంతోషము పొందుతారు. ఉద్యోగస్థులకు అభివృద్ధి కలిగే మార్పులు వస్తవి. విద్యాగోష్ఠి వల్ల విజ్ఞానము ఎక్కువవుతుంది. విద్యార్థులకు జయము లభిస్తుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము 21, 22 ధనలాభము. 23, 24 చెవిపోటు, మనోవ్యాకులత. 25 భాగ్యవృద్ధి, పండిత గోష్ఠి. 26, 27 ప్రయాణము.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారం మీకు యోగప్రదముగా వుంటుంది. లోగడ కలిగిన చిక్కులు చాలా వరకూ తీరిపోతవి. ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. బంధువులతో కూడి శుభకార్యాలోచనలు, మధుర పదార్థములతో కూడిన మృష్టాన్న భోజనము. దూరవార్తా ప్రసంగములు చేస్తారు. ఇంట్లో వారి ఆరోగ్యము బాగుపడుతుంది. బెల్లము పంచదార, ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు మేలు కాలము. 21, 22 ధనలాభము, ప్రయాణము, అధికారుల ఆదరణ. 23,24 నిలకడలేనిస్థితి 25 బంధుదర్శనము, మృష్టాన్నభోజనము, వినోదము. 26,27 అశాంతి.

### * మూల [యే, యో, బా, బి] *

ఈవారము ఉద్యోగమురీత్యా ప్రమోషను అగుటచే ఆదాయము పెరుగుతుంది. పోయిన వారము కాకుండా నిలిచిపోయిన పనులు ఈవారము లాభకరముగా పూర్తి అవుతవి. కోర్టు వ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతవి. పరోపకారముచేసి కీర్తి పొందుతారు. బంగారము, వజ్రములవంటి ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. మీకు వాహనయోగము. మీ భార్యకు అలంకారప్రాప్తి. 21, 22 తేదిలలో ధనలాభము, కార్యసిద్ధి. 23,24 ప్రయాణము. 25 ప్రమోషను, విందు, వినోదము.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈవారము డబ్బుకు ఇబ్బందిగావుంటుంది. రాజకీయమైనపనులలో తిరగవలసి వస్తుంది. యత్నకార్యములకు ఆటంకములు. అకాల భోజనమువల్ల శరీరములో వేడి ఎక్కువై తలనొప్పి, కళ్లుమంటవంటి సూచనలు కనబడగానే ఔషధసేవచేయుట మేలు. పితృవర్గము వల్ల సహాయము కలుగును. గోధుమవంటి ఆహారధాన్యములు, ఆటవిక సరుకుల వర్తకులకూ లాభము. 21, 22 తేమలని కార్యక్రమము. 23, 24 ఆటంకములు, కలతలు. 25 ధనలాభము, కార్యసిద్ధి, 26, 27 అనారోగ్యము.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈవారము మొదటిభాగము ఏమి చేసిందీ తోచదు. ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడిచే అరణ్య ప్రాంతములకుగాని పర్వత ప్రాంతములకు గాని బదిలీ అయే సూచనలున్నవి. లేక శెలవుపెట్టవలసివస్తుంది. వ్యాపారస్థులకు ఆందోళన. వారాంతమునకు కార్యలాభము. రహస్యభేదనకు ప్రభుత్వముచే నియుక్తులౌతారు. ఇంట్లో వున్నవారి ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది. 21,22 నిశ్చయములేని కార్యక్రమము, 23,24 బదిలీ లేక శెలవుపెట్టుట. 25 మిత్ర సహాయము, కార్య








# నక్షత్రఫలితాలు



లాభము. 26,27 ఆరోగ్యచింత.

## *శ్రవణము [జూ, జే, జో, ఘ]*

గతవారము కలిగిన శుభయోగము ఈవారము తగ్గుతుంది. ఏ పనిచేసేందుకి మనస్సునకు ఆందోళనగా వుంటుంది. దైవకృపవల్ల వారాంతమునకూ మీ ప్రయత్నములు సుముఖమవుతాయి. ఇంట్లోవారి శరీర పీడవల కలవరపాటు కలుగుతుంది. ఉద్యోగులకు అధికారులవల్ల భయం కలుగుతుంది. వర్తకులకూ లాభము తక్కువ దగాకూ లోనౌతారు. 21,22 ఎటు పాలుపోనిస్థితి 22,24 త్రిప్పట, ఆటంకములు, ప్రయాణము. 25, మిత్ర సహాయము, సజ్జనగోష్ఠి, మోక్షచింత 26,27 ఆరోగ్యచింత, విదేశీయులతో పరిచయము, విచిత్రవస్తు సంపాదన.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈవారమంతా ఎక్కువ కార్యభారముతో క్రుంగి పోతారు. మీ పను లే చేసుకోలేక కష్టపడుతూ, ఇతరులకు సహాయము చేసేందుకి తలపెట్టి, ఫలించక మాటపడవలసి వస్తుంది. దావాలు మీపరముగా తీర్పు అవుతవి. ఇచ్చిపుచ్చుకొనే పట్ల నీచులతో వివాదము, మనోవ్యథ. భార్యకు ఆరోగ్యము సరిగావుండనందున ఆందోళన 21, 22 దావాలలో జయము. 23, 24 కార్యభారము, త్రిప్పట, ఉద్యోగస్తులకు ఒత్తిడి. 25 స్వల్పధనాదాయము, కార్యలాభము. 26, 27 వివాదములు, భార్య అనారోగ్యము.

## * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము డబ్బుఇబ్బంది ఎక్కువగుటచే అప్పుచేయవలసి వస్తుంది. యత్నకార్యములకు ఆటంకములు కలిగినా పట్టుదల గలవారగుటచే సాహసముతో ప్రయత్నించి తుదకు ఫలసిద్ధిని పొందుతారు. వాహనముల వల్లగాని ఎత్తైనస్థలమునుండి పడుటవల్లగా కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల నివారణ కావచ్చును. లోహపుసామానుల వర్తకులకు, గనులయజమానులకు కష్టముతో కూడిన లాభము. ఇంజనీరింగు, పోలీసుశాఖలలో వారికి మేలుకాలము. 21, 22 కార్యక్రమాలోచన. 23, 24 ఆటంకములు 25 కార్యలాభము. 26, 27 ప్రమాదభయము, అధిక ఖర్చులు.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారము మీకు యోగప్రదము. శుభవార్తలను వినుట, యత్నకార్యసిద్ధి, నూతనులతో పరిచయమువంటి మంచిఫలితాలు కలిగేందుకి మీ మాట కారితనము ఉపయోగపడుతుంది. ధనాదాయము పెరుగుతుంది. గణితశాస్త్ర, జ్యోతిష విద్యాగోష్ఠి చేస్తారు. ఈశాన్య దిక్కునుండి ఆత్మీయుల కుశలవార్త తెలియుటచే సంతోషము కలుగుతుంది. డాక్టర్లకు, చిత్రకారులకు, కవులకు, నటీనటులకు యోగకాలము. 21 22 కార్యలాభము, 23 24 అలసట, 25 ధనలాము, విద్యాగోష్ఠి, 26 27 ప్రయాణం.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈవారము అనుకున్నట్లుగా కార్యలాభమును పొందుతారు. ఆర్థికలాభం ఎక్కువగ వుంటుంది. ఆరోగ్యము సరి అవుతుంది. భాగ్యాభివృద్ధిచే మానసికోత్సాహం కలుగుతుంది. పుత్రుల అభివృద్ధివల్ల సంతోషము పొందుతారు. ఉద్యోగస్తులకు ప్రమోషను. వర్తకులకు ప్రయాణమువల్ల లాభం. న్యాయవాదులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మేలుకాలము. 21 22 కార్యలాభము, 23 24 ప్రయాణం, 25 ధనయోగము, కోరువ్యవహారములలో లాభము. 26 27 శ్రమ, ఎక్కువ ఖర్చులు.

## * రేవతి [దే, దో, చా, చీ] *

గత మూడు వారములకన్నా ఈ వారము యోగప్రదంగా వుంటుంది. పూర్తి కాకుండ ఉండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదముగా గడుపుతారు బంధువులతో శుభ కార్యాలోచన, మృష్టాన్న భోజనము. వెండి, బియ్యము, నూలు, బట్టలు, ప్రత్తి, దూది వర్తకులకు లాభము. దూరస్థులైన ఆత్మీయుల క్షేమము తెలియుటచేత కొన్నాళ్ళనుండి యున్న ఆందోళన తీరుతుంది. 21 22 కార్యనిర్ణయము, 23 24 ప్రయాణము, శుభవార్త, కార్య లాభము, విందు, వినోదము. 26, 27 అస్థిమితము.





# వనితాలోకం

## వాగుడు

కే. శ్రీనివాసమ్మ

వాగుడు అంటే "అతిగా మాట్లాడడం" అనే దానికి ముద్దు పేరు. స్విచ్ వేసిన మిషను లాగా—అదియినా చాలామట్టుకు నయం; స్విచ్ ఆపివేస్తే గమ్మున ఫూరుకొంటుంది! అతిగా మాట్లాడేవాళ్ళు మాత్రాము "దయ చేసి కొద్దిసేపు మాట్లాడకండి" అని చెప్పినా ఊరుకోరు. అయినా వాక్స్వాతంత్ర్యము గల మన భారతావనిలో ఒకళ్ళను మాట్లాడ వద్దనే దానికి అధికార మేముంది.

చెప్పినమాట చెప్పకుండా, మాట్లాడిన విషయంమాట్లాడకుండా గుక్క తిప్పకుండా, ఫులుస్టాపులూ, కామాలూ లేకుండా గంటల కొద్దీ మాట్లాడుతారు. ఇట్లాంటివాళ్ళతో మహాతలనొప్పి. మనము ఒక విషయాన్ని గురించి అడిగినా అడక్కపోయినా వాళ్ళు మాత్రం వాళ్ళ వాగ్ధోరణిలో, జరిగింది, జరుగుతున్నదీ, జరుగబోయేదికూడా చెప్పి వేస్తుంటారు. మరికొంతమంది "ఏమండీ మన దేవూరుకి?" అన్నవిషయం దగ్గరనుండి స్పుత్నిక్ లవిషయందాకా వాదంచేస్తారు. వాళ్లు చెప్పేటప్పుడు ప్రక్కనున్నవాళ్ళు "ఊఁ" కొట్టలేక గొంతు ఎండిపోవాల్సిందే! పోనీలే చెప్పుకొంటే చెప్పుకుంటారని కొదిసేపు "ఊఁ" కొట్టలేక గమ్మునిఉంటే, తిట్టి, తిటి, మరీ చెప్తారు. ఆ దెబ్బతో ప్రక్కనున్నవాళ్ళ తొడ, లేక, వీపు వాచిపోవాల్సిందే. ఒక చిన్న తమాషా చెప్తాను.

నేను ఎక్కిన స్టేషనులోనే ఒకావిడ రైల్లో ఎక్కింది. చూడడానికి బాగాముస్తాబు చేసుకొంది; కొంచెం కల్పరున్న మనిషిలానే కనపడుతూ ఉంది. రావడం రావడం నా ప్రక్కనే కూర్చుంది. చల్లగా మందస్మిత వదనంతో "ఎందాక, ఎందాక, ఎందాక?" అని అడిగింది. "అందాక" అంటే తప్పేమోనని "సింగరాయకొండ వరకండీ" అన్నాను. దాన్తో ప్రారంభమయింది మాపరిచయం. అక్కడనుంచి లేచింది తుఫాను. మహా ప్రచండవేగంతో సాగిపోతోంది! నేను "ఊఁ" కొట్టలేక చచ్చిపోతున్నాను. అఖరుకు ఆమె చెప్పేదేమిటో నాకుమాత్రం అర్థంగాకుండా ఉంది. నేను పరధ్యానంతో "ఊఁ" కొట్టుతున్నాను.

కొంతసేపటికి "ఏమండీ! మాయింటాయన చేసింది మంచిపనేనటండీ? అని అడిగింది. ఆ సమయంలో నాకు ఏమి చెప్పాలో్న తోచక "ఆహా! చాలా మంచిపని చేశారండీ" అన్నాను. దాంతో ఆమె అగ్గిమీద పడ్డ గుగ్గిలంలాగా లేచింది. తీరా చూస్తే ఏమిటంటే, తను భర్తతో పోట్లాడి పుట్టింటికి పోతూవున్నదట. భర్త ప్రతిదినమూ త్రాగి తందనాలాడి తల్లింటికొచ్చి నానా రభస చేస్తూ ఉంటాడట—ఈ విషయాలు చెప్తూ "మాయింటాయిన చేసింది మంచిపనేనటండీ?" అని అడిగిందట అందుకు నేను పరధ్యానంగా "ఆహా! చాలామంచిపని చేశారండీ" అనేటప్పటికి తన కోపమంతా నా మీద వెళ్లిబోసింది. ఒకేఒకమాట అడిగింది—"మీ ఇంటాయన ఇలా చేస్తే నీమనసెలా ఉంటుం"దని—ఇదెక్కడి ఖర్మరా నాయనా అని సముదాయించె సమయంలో "బిట్రగుంట" స్టేషను వచ్చింది. "ఏమండీ కొంచెం కాఫీ అయినా తెప్పించుకొని తాగుదామండి" అని కాఫీ తెప్పించుకొని ఇద్దరమూ త్రాగాము.

బహుశా చాలామంది చెప్పుతుంటారు గదండీ కాఫీ "స్టిము లేటింగ్ డ్రింక్" అని—అందుకని—పెట్రోలు పోసిన మోటారుకారు లాగా మళ్ళీ మొదలెట్టింది. వాళ్ళపుట్టింటి సంగతి, అత్తింటిసంగతి, వాళ్ళభర్త సంగతి, పుట్టబోయే కొడుకుసంగతి అన్నీను.—పైగా నన్నంటుంది నా మాదిరి ముచ్చులాగా మాట్లాడకుండా వుండేవాళ్లను చూస్తే ఆమెకు మహాకోపమట!—సరే—ఎట్లాగో నా మేలు కోరి సింగరాయకొండ స్టేషను వచ్చింది. ఆమెకు "గుడ్ బై" చెప్పి ఇంకొంచెం మాటలు వృధి కావాలని దీవించి బ్రతుకు జీవుడా అని బైటబడ్డాను!

ఇంతకీ ఈ కథ ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే మన ప్రవర్తన, మనం చేసేపనులు, సామాన్య మయినంతవరకూ ఇతరులకు బాధ కలుగజేయకుండా ఉండాలి నిజంలో ఆమెతో నాకు ఏమిసంబంధం ఉన్నదని ఆమె నాతో అతిచనువుగా ఏదో వాళ్ళ ఆప్తమిత్రుడిగా—దగ్గర బంధువుగా అంత ఒలకబోయడానికి? పైగా మనం కొంచెం మందలిద్దాంఅంటే, వచ్చినట్లు వినేశాక్కమాత్రం మనకున్నదిగాని, మందలించేశాక్కమాత్రం మనకు లేదు. బహుశా ఈ వ్యాసం చదివేటప్పుడు అతిగా మాట్లాడేవాళ్ళు నన్ను తిట్టుకొంటారేమో! తిట్టుకొన్నా సరే—కాని ఒక్క విన్నపము. ఇకమీదనైనా దినానికి కొంచెం తగ్గించుకొని మాట్లాడడానికి ప్రయత్నించితే కొన్నిరోజులకు దారిలో పడుతుంది తత్వం.

ప్రతివిషయం కూడా మనస్సులోనే ఉంచుకొని (తప్పని సరి అయితే తప్ప) అందుకు దగ్గ ఉపాయా లేమయినా ఉంటే వెతుక్కొని, ఆ సమస్యలను పరిష్కారం చేసుకోవలెగాని, ఊరికే తెగమాటాడితే మనకూ విలువుండదు, మన మాటలకూ విలువుండదు! అరిచెయ్యి మూసి ఉంచినప్పుడే అందరూ అందులో ఏదో ఉందనుకొంటారు; చేయి విప్పిచూపిస్తే ఏముంటుంది? అదే విధంగా మనిషి చాలా గంభీరంగాను, నిండుకుండలాగా ఉండాలి. పైవిషయాలు వ్రాస్తుంటే ఒకరిసంగతి ఎందుకు మా అక్కకు గుర్తుకొస్తుంది! ఆవిడ కూడా మహామాటకారి. అయినదానికీ, కానిదానికీ అన్నీ నావే ననుకొని అన్ని వ్యవహారాలూ నెత్తిన వేసుకొని అందరిచేత మహా గయ్యాళిరా బాబూ అనిపించుకొంటుంది!

అనవసరమయిన విషయాల్లో మనం క్షోభ్యం కలుగజేసికొనడం దేనికి? వాళ్ళ

(55-వ పేజీ చూడండి)

### భర్తృవిహీనల దుర్భరస్థితి!

# వైధవ్య నియమాలలో కూడా కాలానుగుణమైన మార్పు రావాలి

శ్రీమతి విద్య

హిందూయువతి వినటానికీ - ఊహించటానికి కూడా - భయపడేపదాలు 'వైధవ్యం', 'వితంతువు' అనేవి.

సుమంగళికి సంఘంలో ఒక విశిష్టమైన స్థానమున్నది. మంగళప్రదమైన ప్రతిపనీ ఆమే ప్రారంభించాలి. ఉదయాన, లేస్తూనే ఆమెముఖం చూస్తే - ఆరోజు జయప్రద మన్నమాట. ఏదైనా పనిమీద బయలుదేరినపుడు ఆమె ఎదురైతే కార్యసిద్ధి తప్పదన్నమాట. దీనికి పూర్తిగా వ్యతిరేకమైనది పూర్వసువాసినిస్థితి. శుభకార్యాల్లో ఆమె కంటపడకూడదు. మంచిపనులలో (వంటతప్ప) ఆమెచేయి పెట్టకూడదు. ఎక్కడైనా ఎదురైతే, అమంగళము, అపశకునముగా భావింపబడుతుంది. ఈవిధమైన వ్యత్యాసానికి ముఖ్యకారణం వారి రూపభేదమే ననిపిస్తుంది. లక్ష్మీకళ తాండవమాడే సుమంగళీ రూపానికీ, చూడగానే సానుభూతికంటే జుగుప్సను కలిగించే వితంతు రూపానికి ఎంత తేడా!

అసలు వివాహంవల్ల లభించే రక్షణ ఎంత పరిపూర్ణమైనదో వైధవ్యప్రాప్తి తరువాత గాని తెలిసిరాదు. అందులో హిందూ సంఘంలో అన్ని విధాలా మనసా వాచా కూడా భర్తమీదే ఆధారపడటం అలవాటయిన స్త్రీకి భర్తృవియోగానంతరం కలిగే నిరాశ్రయస్థితి హృదయవిదారకమైనది. ఆస్థితిలో ఆమె ఎందుకూ పనికిరాని విసరింపదగిన వస్తువులలో ప్రథమ శ్రేణికి చెందినది. ఆమెకు కలిగిన లోటు ఏవిధంగానూ తీర్చుకోలేనిది. మితిలేని దుఃఖము! దీనిని మించినది, సంఘాచారముల పేరిట ఆమె భరించవలసిన దుర్భరావమానము! ఒక విధంగా ఆలోచిస్తే ఇంతకు పూర్వం వాడుకలోవున్న సహగమనమే ఈ వైధవ్యముద్రల కంటె వాంఛనీయమైన దిగా కనిపిస్తుంది. బలవన్మరణం బాధాకరమే అయినా, స్త్రీ తనకత్యంత ప్రీతి పాత్రములైన పసుపు కుంకుమలతో జీవితాన్ని చాలిస్తుంది.

మొదట్లో వితంతువులకు కేశఖండనాది నియమాలు విధించిన ఉద్దేశ్యము, ఆ నాటి సాంఘిక పరిస్థితులు ఒకసారి పరిశీలించటం అవసరం. వితంతువులకు శిరోజాలు తీసివేయటం, ఏక భుక్తం వంటి నియమాలు ఏర్పాటు చేయటంలో ముఖ్యోద్దేశం వారు ప్రాపంచిక విషయాల పట్ల విముఖులుగా వుండాలనీ, శరీరాన్ని క్రమంగా కృశింపజేసుకుని, విగతజీవుడై పరలోకంలో తనకై ఎదురుచూచే ప్రియభర్తతో శీఘ్ర సమాగమానికి ప్రయాణ సన్నాహంలో వుండాలనీ. ఆనాడు ఇంచుమించు అన్నీ సమిష్టి కుటుంబాలే. బంధుప్రేమ, సమిష్టి బాధ్యతలు ఎక్కువగా వుండే రోజులవి. కాబట్టి కుటుంబంలో ఒక స్త్రీ కేవలం పారమార్థిక చింతతో కాలక్షేపం చేస్తూవున్నా, ఆమె సంతాన యోగక్షేమాలకు గాని, భవిష్యత్తుకి గాని చెప్పుకోతగిన అఘాతమేమీ జరిగేది కాదు.

కాని కాలం గడచినకొద్దీ పరిస్థితులు మారిపోతూ వున్నాయి. మార్పు ప్రకృతి సహజసిద్ధమైనది. మానవులమైన మనం పరిస్థితుల ప్రభావానికి తల వంచకపోతే ఏటి కెదురీదినట్లవుతుంది.

వైధవ్య నియమాలను ఏర్పాటు చేసిననాటి సాంఘిక పరిస్థితులు ఈనాడు లేవు. ఆనాటి సమిష్టి కుటుంబాలు ఇప్పుడు లేవు. ఎవరి అవస్థ వారు పడవలసినదే. అటువంటప్పుడు కుటుంబ పోషణచేసే పురుషుడు మరణిస్తే, మిగిలిన వారికి జీవనాధారమేమిటి?

కేశఖండనాది విధులవలన కలిగే పరివర్తన బాహ్యమైనదే కాని, ఆంతరంగికమైనది కాదు. ఈనియమాలన్నీ ఎంతో సక్రమంగా నిర్వర్తించే వితంతువులలో కొంతమంది ఇతరులపట్ల ఎంతో కఠినంగా వుండటం మనం చూస్తున్న విషయమే. ఏకభుక్తం పేరుతో రాత్రి భోజనానికి బదులు వారారగించే ఓగిరాలు శరీరాన్ని కృశింపచేయటానికి కాక, మరింత పుష్టికరంగా చేసేందుకే తోడ్పడుతాయి. తత్కారణంగా వారిలో బలవంతాన అణగద్రొక్కబడిన కోర్కెలు మనకు లేనిది యితరుల కెందుకుండాలనే ఈర్ష్యరూపంలో బహిర్గతమై వారిచేతి క్రిందవుండే ఇతర (కుటుంబములోని) పునిస్త్రీ పడుచుల జీవితాలను నరకాలుగా మార్చేందుకు తోడ్పడుతున్నాయి. "తలలు బోడులైన తలపులు బోడులా" అను వేమన సూక్తి గమనింపదగినది.

కొందరు వితంతువులు జీవితాంతం దుర్భరావమానములను భరిస్తూ, ఏపుట్టింటో, అత్తింటో మెప్పూ మెహర్బానిలేని చాకిరీ చేస్తూ, పిడికెడు మెతుకుల కోసం తోటికోడళ్ళ, వదినా మరదళ్ళ ఆరడులన్నీ పెదవి మెదపకుండా సహిస్తున్నారు. ఇటువంటి సంసారాలలోని ఇతర స్త్రీలలో, నిరాశ్రయులైన వితంతువుల నిస్సహాయస్థితిని తమ స్వార్థానికి వినియోగించుకునే వారేగాని, వారికి సానుభూతి చూపే వారరుదు. ఈవిధమైన పరిస్థితులకి ఎవరినీ దూషించి ప్రయోజనం లేదు. వితంతువులపట్ల సంఘదృష్టి సౌమ్యంగా మారితేనే తప్ప ఏవిధమైన మార్పు ఆశించటమైనా పొరబాటే అవుతుంది.

భర్త మరణానంతరం తన జీవితంలో ఏర్పడే శూన్యస్థితి పూరింపలేనిదని ప్రతి స్త్రీ గుర్తిస్తుంది. కాలంగడిచిన కొద్దీ విషయం ఇంకా సుస్పష్టమౌతుంది. ఆమెకు భర్తయందు లేశమాత్రమైనా అనురాగముంటే ఆమెకు సహజంగానే ప్రాపంచిక భోగములపట్ల విముఖత్వం కలుగుతుంది. అందాలు, అలంకరణయందభిలాష దానంతటదే నశిస్తుంది. అయితే మాతయైన వితంతువు తన సంతతి శ్రేయస్సు దృష్ట్యా కొన్ని

లౌకిక బంధాలని తెంచుకోలేక పోతుంది. కొన్ని సమయాలలో బిడ్డలు మరీ పసివారుగా వున్నపుడు విగత భర్తృకలైన తల్లులు హఠాత్తుగా శ్వేత కిరీటంతో ప్రత్యక్షమైతే ఆ వికృత రూపములో తల్లిని గుర్తించలేక, దగ్గరకురాక, తల్లికొరకు దిగులుపడి మరణించిన పిల్లలెందరో వున్నారు. భర్తృ వియోగము, శిరోముండనాదికమైన ఘోరావమానము గర్భశోకము—జీవిని కృంగదీసేందుకు ఏ ఒకటైనా చాలు—అన్నీ ఏకమైతే చెప్పనవసరము లేదు!

స్త్రీ జీవితంలో పూర్వార్థం పిల్లల పెంపకముతో, సంసారభారముతో క్షణంగా గడచి పోతుంది. పిల్లలు పెద్దవారై, ఎవరంతట వారు స్వతంత్రజీవనాన్వేషణకి బయలుదేరినప్పుడు, హఠాత్తుగా తాను ఒంటరిదై పోయినట్లు గుర్తిస్తుంది ఆమె. ఆమెకు భర్త సహాయం ఎక్కువగా అవసరమయ్యేదప్పుడే. అంతవరకూ, తన వ్యక్తిగతమైన సుఖదుఃఖాలను గురించి ఆలోచించేంత తీరిక ఆమెకుండదు. కాబట్టి తీరికగా వృద్ధాప్యంలో వీటిని గురించి తాపత్రయపడేటప్పుడు (వేరే వ్యాపకం లేక) వాటిలో పాలు పంచుకునేందుకొక వ్యక్తి కావాలి. అతడే భర్త. అందుకే స్త్రీకి వృద్ధాప్యంలో భర్తయొక్క అవసరం ఎక్కువ అన్నది. కాని సాధారణంగా (వయసులో భార్యకంటే భర్త పెద్ద అవటం ఒక కారణమేమో) పెద్దతనంలోనే ఆమెకు ఒంటరితనంకూడా ప్రాప్తిస్తున్నది.

పెద్దవారైన ఆమె సంతతి తమ తమ సంసార బాధ్యతలలో మునిగి తేలుతూ, తల్లితో ఎక్కువకాలం గడపలేకపోతారు. ఉన్న కొద్దికాలమైనా, వైధవ్యచిహ్నాలతో క్రొత్తరూపంలో సాక్షాత్కరించే తల్లితో స్వేచ్ఛగా చనువుగా ఉండలేకపోతారు. ఆమెను చూడగానే-వారికి, ఆమెకూ కూడా-ఆమె పూర్వ స్వరూపం జ్ఞాపకం వస్తుంది. చిన్నప్పటినుంచీ తాము ఎరిగివున్నదీ, తమను కనిపెంచినదీ ఈ వ్యక్తేనా అనే సందేహం అజ్ఞాతంగా, లోలోపల మెదులుతుంటుంది. ఆమెమీద తమకెంత ప్రేమ, జాలి, సానుభూతి వున్నా ఆమె యెదుట వాటిని ప్రదర్శించటానికీ, ఆమెను ఓదార్చటానికీ అశక్తులౌతారు. దీనికంతకీ కారణం ఏమిటి? ఆమెరూపంలో కొట్టవచ్చినట్లు కనిపించే భేదమే ననక తప్పదు.

నేటి సమాజంలో స్త్రీపురుషు లిద్దరూ ఉద్యోగాలు చేస్తూ వుండటం అపురూపమేమీ కాదు. నిన్నటివరకూ సర్వాలంకార శోభితయై ఉద్యోగానికి వచ్చే స్త్రీ, ఆకస్మికంగా పదిరోజుల తరువాత నిరస్తభూషగాను, వికార స్వరూపిణిగానూ ఆఫీసులో ప్రత్యక్షమైతే, చూసేవారి కెలా వుంటుంది?



# వలపు తలపు

—చిత్రకారుడు: వీరిశెట్టి అచ్యుతరావు.]

ఆమె కెలా వుంటుంది? కుటుంబ పోషణ జరిపే ఇద్దరిలో ఒకరు మరణిస్తే, రెండవవారు తత్ఫలితంగా లభించే అవమానంతో ప్రపంచాన్ని చూడలేక చేతిలో ఉన్న ఏకైక జీవనాధారాన్నీ వదులుకోవాలా? లేక సంభవించిన కష్టాన్ని ధైర్యంగా ఎదుర్కొని, విధి నిర్వహణ (సంసారపోషణ) లో ముందుకు సాగాలా? ఏది కర్తవ్యం?

ఎన్ని ఆస్తిపాస్తులున్నా, ప్రత్యక్షంగా అధికారమున్న స్త్రీధనం వనితలకి ఆభరణాలొక్కటే. అవి శరీరంమీద నుంచి తీసివేయగానే అనేకవిధాల ఆమె వాటికి దూరం కావచ్చు. ఒకసారి పెట్టుకుని పెళ్ళికి వెళ్ళివస్తానని ఏ బంధువులో ఎరువు తీసుకునితిరిగి ఇవ్వకపోవచ్చు. "నీ పిల్లలు పెద్దవాళ్ళయే నాటికి తిరిగి ఇవ్వలేకపోతానా? ఏదో ప్రాణంమీదికి రాబట్టిగాని..." అంటూ కావలసినవాళ్ళే ఏవగో తాకట్టు పెట్టుకోవచ్చు. అవి తిరిగి రాబట్టుకునే అవకాశం శూన్యం. మగదక్షత లేని మగువలంటే అందరికీ అలుసేమరి.

స్త్రీకి ప్రాణం కంటే కూడా ప్రియమైనది శీలం. ఆ శీలరక్షణ ఆమె స్వయంగా చేసుకోగలదు. ఆ బాధ్యత సంఘం స్వీకరించి ఆమెకు వికారరూపమనే కవచం ప్రసాదించటం కేవలం అనవసరం.

ఏ శాస్త్రమైనా - నీతి శాస్త్రమైనా, న్యాయశాస్త్రమైనా కూడా - సర్వ కాలాల్లోనూ ప్రమాణంగా నిలబడలేదు. నిన్న ఒప్పైనది నేడు తప్పు; నేడు ఒప్పైనది రేపు తప్పు. మారే పరిస్థితుల కనుగుణంగా ఇవి కూడా మారుతూ వుంటాయి. రామాయణ

# ★ భర్తృవిహీనల దుర్భరస్థితి! ★

కాలంలో మండోదరి రావణుని మరణానంతరం విభీషణుని ఇల్లాలైంది. భారత యుగంలో ద్రౌపది ఏకకాలంలో ఐదుగురు భర్తలను వివాహమాడింది. వీటికి కారణాలేవైనా, ఆనాటి సంఘం ఈ కార్యాలను హర్షించింది. వారికి మహాపతివ్రతలలో అగ్రస్థానం ప్రసాదించింది. ఒకప్పుడు సర్వసాధారణమైన బహుభార్యాత్వం నేడు చట్టరీత్యా కూడా నిషేధమైంది. ఎటువంటి నియమాలైనా, కాలానుగుణమైన మార్పులను చెందితే, సంఘ ఆమోదముద్ర పొంది శాసనములకంటె బలామణీ అవుతాయి.

వైధవ్యానికి సంబంధించిన ఈ నియమావళి ఏర్పడినప్పుడు వున్న పరిస్థితులు వేరు; ఇప్పటివున్న పరిస్థితులు వేరు. ఆ రోజుల్లో స్త్రీ విద్య ఇప్పటివలె వ్యాప్తిలో లేదు. వితంతువులకు వేరు వ్యాపకములు లేవు. ఎవరి జీవనభృతికొరకు వారు పాటుపడవలసిన అగత్యము లేదు. కాబట్టి వితంతువులు అవినీతి మార్గముల సంచరించకుండా ఈవిధమైన కట్టుబాట్లు ఏర్పాటుచేశారు సనాతనులు. కాని ఆ కాలంలోకూడా ఈ పద్ధతులు సహజంగా లేవని, జననకాలమునుంచివున్న శిరోజములు తీసివేయుట అర్థరహితమైన ఆచారమనీ, తరిగొండ వెంకమాంబ ప్రభృతులు ప్రతిఘటించారు.

అసలీ ఆచారం వితంతువులకు కాన్వెంట్సులో యూనిఫారం మాదిరి ఒకేరకపు బట్టలు, చూడగానే ఆమెస్థితిని తెల్పే ఇతర చిహ్నాలూ-దక్షిణ భారత దేశంలోనే గాని ఉత్తరదేశంలో లేవు. దక్షిణాదిని కూడా వైష్ణవేతరులలో—వారిలోనూ బ్రాహ్మణులు మొదలగు అగ్రవర్ణములలో మాత్రమే కనుపిస్తాయి. అంటే యీ ఆచారం చాలా పూర్వకాలంనుంచీ లేదనీ, మధ్యకాలంలో కొందరు సనాతనుల అవసరాలకోసం ఏర్పాటుచేసిన దేననీ, ఆనాడు కూడా ఆచారానికి తలఒగ్గనివారు కొందరున్నారనీ అనుకోవలసి వస్తుంది.

ఏది ఎలా వున్నా, వితంతువుల సత్ప్రవర్తనకి ఇటువంటి కృత్రిమ మార్గాలు కాక, ఇంకా సహజంగా అందరికీ అనుకూలంగా వుండే పద్ధతులు అనుసరించటం అవసరం.

ఈనాటి హైందవ సమాజంలోకూడా వితంతువుల పరిస్థితి ఏమాత్రం ఉత్సాహజనకంగా లేదు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి వంటి మహనీయుల కృషివల్ల వితంతు వివాహాలు జరుగుతున్నా, ఈనాటికీ అవి చెప్పుకోదగినంత సంఖ్యలో జరగడంలేదు. — వర్ధంతులు మనం ఎంతో గొప్పగా జరుపుకుంటున్న రోజుల్లోకూడా వితంతువుల సమస్య అపరిష్కృతంగానే వున్నదంటే వర్ధంతుల విశిష్టత మనం గుర్తించలేదన్నమాట.

వితంతువులు విశాలప్రపంచంలో నిరాశ్రయులుగాను, నిస్సహాయులుగాను వుండకుండా చేయాలంటే, వారి వారికున్న అవధులమేరకు, ప్రతిస్త్రీ ఏదైనా ఉద్యోగకల చేయటం కాని, లేక స్వశక్తితో ఏదైనా జీవనోపాధి ఏర్పరచుకోవటం కాని చేయాలి. ఈవిధంగా స్త్రీలంతా వుద్యోగాలకోసం పురుషులతో పోటీపడితే, అసలే తీవ్రంగా వున్న నిరుద్యోగసమస్య తీవ్రతరమౌతుందని ఎవరూ అనుకోనవసరంలేదు. ఆభయమేమీ లేదు, నానాటికీ ఉద్యోగాలు చేయదలచిన వారికి అవకాశాలు పెరుగుతున్నాయి. మన ప్రభుత్వం ప్రజలందరికీ జాతీయ కార్యక్రమాలలో పాల్గొనాలని ఆశించి వీలైనన్ని అవకాశాలు కల్పిస్తున్నది. ఇది కాక అనేక ప్రైవేటుసంస్థలు ఉద్యోగాలను ఇస్తూవుంటాయి. కనుక ప్రతియువతి వివాహాత్పూర్వం—కనీసం వివాహానంతరమైనా—ఉద్యోగముగాని, దానికి అవసరమైన అర్హతగాని సంపాదించటం అత్యవసరం.

మాకు తెలిసిన ఒక అమ్మాయి చిన్న వయసులోనే భర్తను కోల్పోయింది. అక్షరజ్ఞానం తప్ప చెప్పుకోతగిన విద్య లేదు. తండ్రి బహు కుటుంబీకుడు. ఈమెకు ముగ్గురుపిల్లలు. ఆ పరిస్థితిలో ఏదైనా చిన్న ఉద్యోగానికి అవసరమైన విద్యార్హతలు సంపాదించేందుకు కూడా ఆమెకు 4, 5 సంవత్సరములు పట్టింది. ఈ మధ్యకాలంలో వారి అవస్థ భగవంతుడికే తెలుసు.

ఈ బాధలు మధ్యతరగతి వారికే కాదు, ధనిక వితంతువుల కేకష్టమూ లేదనుకో కూడదు-కుటుంబ తగాదాలూ మారే భూసంస్కరణలతోను ఆస్తి, సంపద, ఆదాయ, వ్యయములపన్నులతో, వారి స్థితికూడా ఏమంత భద్రంగా లేదు. అదీగాక, మగవాళ్లుండి అజమాయిషీ చేసుకుంటేనే పొలంలో ధాన్యం ఇంటికి రావటం గగనమౌతోంది. ఎంతఆస్తి వుంటేమాత్రం ఒంటరి ఆడవాళ్ళేం చేయగలరు? ఏ వేలు విడిచిన పినతండ్రి కొడుకో, మేనత్తమొగుడో ఆస్తి మేనేజిమెంటు చేజిక్కించుకుని, క్రమంగా అసలు వారికి తిరుక్షవరము చేసిన సంఘటనలు ఎన్నో వున్నాయి! కాబట్టి ఆస్తిగల భర్త, తన జీవిత కాలంలోనే భార్యకు, అవసరమైనప్పుడు ఆస్తి అజమాయిషీ చేసుకోగల వ్యవహారజ్ఞానం కలిగించాలి. స్థిరచరాస్తుల రూపంలో భార్యాబిడ్డల భవిష్యత్తుకి కావలసిన ఏర్పాట్లు చేసినట్లే భార్య విద్యరూపేణా కొంత పెట్టుబడి చేయటం వాంఛనీయం.

జీవితారంభంనుంచీ భవిష్యత్తుమీద ఒక కన్నుంచి, తమ ఆదాయంలో కొంత నిలవ చేయటం అవసరం. ఈ నిలవ ధనరూపంలో కాక ఇన్సూరెన్సు రూపంలో వుంటే అనవసరంగా ఖర్చుచేసే ప్రమాదం వుండదు. తప్పనిసరిగా ఆదా చేసినట్లవుతుంది. ఇన్సూర్ చేయకుండా వేరే జీవనాధారమేమీ లేకుండా మరణించిన కుటుంబాలు అష్టకష్టాలపాలవటం మనమంతా చూస్తున్నదే.

పైనచెప్పిన ఏవిధమైన అవకాశాలూ లేక చిన్న పిల్లలున్న వితంతువులు ఏమిచేయాలి

(48-వ పేజీ చూడండి)

# వనితా వాణి



శ్రీమతి కనకవల్లిగారు వ్రాసిన వ్యాసము "అడుగడుగునా అవహేళనల నెదుర్కొనే అభాగినులు" చదివినంతసేపు నేను పడ్డ ఆవేదన నాకే తెలుసు. ఇది చదివియైనా మన వారు కొంతో కొంతో బుద్ధి తెచ్చుకుంటారని నేను నమ్మలేను. శ్రీమతి కనకవల్లిగారికి నా అభివందన లర్పిస్తూ వారింకా ఇలాంటి సంఘోద్ధరణ కుపకరించే వ్యాసాలనే వ్రాయాలని ఆశిస్తున్నాను. యామినీపూర్ణ తిలకగారు వ్రాసిన "అమ్మ" అన్న చిట్టి వ్యాసం చదివి చాలా సంతోషించాను. వ్యాసం చిన్నదయినా అందులోని విషయం చాలా పెద్దది. ఆమె ప్రారంభించడములోనే అమ్మ ప్రాశస్త్యాన్ని కొనియాడింది. మా వీధిలో ఒకావిడకు ఈ వ్యాసం చదివి విని పిద్దా మనుకున్నాను. కాని ఆవిడగారు తీరా చదివి వినిపిసే నన్ను "అక్కా అని నా పిలలతో నేను పిలిపించుకొంటే నీకేం" అని కసురుకుంటుందేమోనని జంకాను. కాని అలాంటిదేమీ జరగలేదు. ఒకేసారి మానుకోవాలంటే మాచేతకాదు. క్రమేణా మానుకొంటే సాధ్యమౌతుందని నాకూ వారు అన్నారు. ఈ వ్యాసం ఎందరికైనా వుపయోగిస్తుంది.

—రాగి రామలక్ష్మమ్మ, తాడిపత్రి]

*     *     *

## రకరకాల ఉత్తరాలు

16 4-58 ఆంధ్రపత్రిక వారపత్రికలో వి. హెచ్. సావిత్రిగారు వ్రాసిన "రకరకాల వుత్తరాలు" అన్న వ్యాసం చాలా బాగుంది. మొన్నను నాకొక స్నేహితదగ్గర నుండి రిప్లయికార్డుతో సహా వుత్తర మొచ్చింది. వెంటనే జవాబువ్రాసి ఆమె నాకు వ్రాసిన కారునే పొరపాటున పోస్టుచేశాను మళ్ళీ ఆ కార్డు నాకందేక చూస్తే నా పొరపాటు జ్ఞాపకమొచ్చి అసలు కార్డు పోస్టుచేశాను. ఇటువంటి విషయాల్లో కాస్త జాగ్రత్తగా ప్రవర్తిస్తే మంచిదని నా అనుభవాన్నిబట్టి వాసున్నాను. అనవసరంగా పోస్టువాళ్ళకు డబుల్ ఛార్జి యివ్వటమేకాక పైగా స్నేహితుల దగ్గరకూడ వేరేస్థానాన్ని అలంకరిస్తాం.

ఈ మధ్య నా సోదరుడు చందమామ పత్రికకు కథరాసి పొరపాటున దాన్నిదో కంపెనీకి పోస్టుచేశాడు. తరువాత తెలిసొచ్చింది వాడి పొరపాటు. సాధారణంగా ఇటువంటి పొరపాట్లు అందరికీ జరుగుతుంటాయి. ఒక్కొక్కప్పుడు ఎడ్రసు వ్రాయకుండా వుత్తరాలు పోస్టుచేయటంకూడ నాకు ఎరిపాటే ఒకరి ఎడ్రసుకు ఇంకొకరి వుత్తరం పంపటంకూడ నా కలవాటే. ఇకముందు ఇటువంటి పొరపాట్లు జరుగకుండా జాగ్రత్త పడతాను.

—వి. ఈశ్వరి, అలుదు-శ్రీకాకుళంజిల్లా]

*     *     *

యామినీ పూర్ణ తిలక గారు వ్రాసిన "అమ్మ" అను వ్యాసము చాల బాగుంది. ముఖ్యంగా వీరు పిల్లలులేని తల్లి ఆవేదనా, "అమ్మా" అని పిలుపించుకోవలయునని ఆవేదనను ఉన్న కొద్దిలోనైనా చాల బాగా వ్రాశారు వీరికి నా అభినందనలు తెలియజేయ కోరుచున్నాను.

—కోటంరాజు. లీల, విజయవాడ]

*     *     *

"నవ్వు" గూర్చి వ్రాసిన వ్యాసము బాగున్నది. వ్యాస రచయిత్రికి నా అభినందనలు.

-కూచిబొట్ల సీతామహాలక్ష్మి, రాజమండ్రి]

*     *     *

నా స్నేహితురాలికి 'పేను కొరుకుడు' వలనజుట్టు ఊడిపోతున్నది. ఎన్ని వైద్యాలు చేసినా తగలేదు. 'పేను కొరుకుడు' వలన జుట్టు ఊడిపోకుండాఉంటే వైద్యం ఎవరికైనా తెలిస్తే 'వనితా వాణి' ద్వారా తెలుపుతారని ఆశిస్తున్నాను.

-కుమారి కౌజ వెంకట కమల, విజయవాడ]

*     *     *

## వినతి

వనితాలోకంలో ఎప్పుడూ, కష్టాల గురించి, సమస్యలగురించీ మాత్రమే కాకుండా మన పూర్వపు కవులగురించీ, వారి కవిత్వాల గురించీ, దేశ నాయకులగురించీ వ్యాసాలు వ్రాస్తే మన పూర్వీకుల చరిత్ర మనం తెలుసుకొన్నవాళ్ళ మవుతాం.

—జలజ, విజయవాడ]

*     *     *

## సూచన

క్రిందటి వార పత్రికలో పి. కోటీశ్వరిగారు వ్రాసిన పగుబియ్యపు బూంది చేసినాను. చాలబాగవచ్చినది. వారికి నా కృతజ్ఞత. ఈవారపు పత్రికలో "మా కాశీయాత్ర విశేషాలు" వ్రాసిన రచయిత్రికి నా అభినందనాలు. "వనితాలోకము"నకు ఇంకా 4 పేజీలు కేటాయించ వలసినదిగా వనితాలోకం పాఠకుల తరపున సంపాదకుని కోరుచున్నాను

—ఎస్. రతి, హైదరాబాదు]

*     *     *

## తప్పు కేవలం ఒకరిదేకాదు

16-4-58 ఆంధ్ర వారపత్రికలో 'మగువలు మగవారు' అను వ్యాసము బాగుంది. హీరాగారువ్రాసినట్లే నేటి రైలు ప్రయాణాల్లో యెన్నుకొన సంఘటనలు చూస్తున్నాము' కాని అందులో పూర్తిగా మగవారిదే లోటుకాదు. కారణం యేమంటే కొంత మంది సోదరీమణులు యువకుల (అపరిచిత)ను వెర్రిగా (కొంటెగా) అదేపనిగా చూడటం నవ్వటం మొ॥ వానితో యువకులను రెచ్చగొట ప్రయత్నిస్తారు. అప్పుడు వారు మగువలపై దురభిప్రాయపడటం, ఏవూరు? ఎక్కడికి వెడతావు? నీపేరమిటి? మొ॥ ప్రశ్నించటం తటస్థించును. అసలు యువకులను రెకెత్తించకుండా వుంటే అటువంటివి సంభవించవుకదా! హీరాగారు వ్రాసింది తప్పని చెప్పటకై యీ విషయం వ్రాయలేదు. ఆఅభిప్రాయంతో నేను యేకీభవించాను. కాని ఈ విషయంలో మగువలు కూడ జాగ్రత్తగా నడచుకోవాలని కోరుతున్నాను. కేవలం పురుషులపైనే నెపంవేసేకంటె మనతోటి సోదరీమణులు నడవడికలలో జాగ్రత్తగా యుండాలని విజ్ఞప్తి చేస్తున్నాను. మగువల నడవడికలను గూర్చి కూడ తోటిపాఠకులు వ్యాసాలు వ్రాసి, మంచి మార్గాలు సూచిస్తారని ఆశిస్తున్నాను.

—జి. పద్మావతిదేవి, అరవల్లి]

*     *     *

## 'నాగరీకుడు కాక—'

"హీరా" గారు "మగువలు మగవారు" అనే వ్యాసము వ్రాసినారు, వారు వ్రాసిన సంఘటన అందులోను పబ్లిక్ కంపార్టు



# వనితా వాణి



సెంటులో జరిగిందంటే నాగరికత తెలియని విద్యావిహీను డెవరో అలా ప్రవర్తించాడు కాని నాగరికత తెలిసిన వారు డెవరు అట్లు చేయరు. ఆసంగతి తెలిసికోకుండా చదువుకున్న మాతలెవ్వరైనా ఆమె చేసినటు చేసిన అది వారి అవివేకమును తెలియచేయును. "హీరా"గారు అట్లు చేయుటే కాక పత్రికలో వ్రాయుట నా కాశ్చర్యము కలుగ చేసినది.

అదే వారపత్రికలో శ్రీ వారణాసి సుబ్బలక్ష్మిగారు (అదిలాబాదు) వ్రాసినట్లు స్త్రీలలోని వికారచేష్టలే మగవారిని రేకెత్తిస్తుంది. స్త్రీలు తమ మానావవారు తలవంచుకొనిపోతే ఏ ప్రమాదము మన దేశములోను ముఖ్యముగా ఆంధ్రలో జరుగదని నా విశ్వాసము.

—తేతలి వెంకట సీతారామయ్య,
తాడేపల్లిగూడెము]

* * *

నేటి మగవారి దృష్టిలో యువతులు చాలా హీనంగా కన్పిస్తున్నారు. స్త్రీ యేకదా పన్నేమి చేయగలదని వారి భావన. అటువంటి వారికి హీరాగారు వ్రాసిన వ్యాసం జవాబుగా పని చేస్తుందనుకొంటున్నాను. సోదరులు (కొందరైనా) ఈ వ్యాసంచూసి యికముందు పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకూడదు. ధైర్యంగా మగవారి మన స్తత్వాలను గూర్చి వ్రాసిన కుమారి హీరాగారికి నా హృదయపూర్వకాభివందనములు.

-కుమారి జి. పద్మావతి, బారిపడా, ఒరిస్సా]

* * *

## గృహవైద్యం

28.4.58 ఆంధ్ర వారపత్రికలో గృహవైద్యముగురించి చదివాను. ఈ వేసవిలో ప్రస్తుత కర్తవ్యముగురించి ఆలోచించే పనుకదక్షత లేని స్త్రీలకు యీ వైద్య విషయము చాల వుపకరిస్తుంది. అందరూ వంటలూ, ఫ్యాషనులు, ఆచారాలు గురించి ప్రాముఖ్యముగా వ్రాసున్నారుగాని గృహవైద్య విషయముపై శ్రద్ధచూపి, వనితాలోకం ద్వారా సలహాలిస్తే, పనుక దక్షత లేక పిలల అనారోగ్యంతో బాధపడే స్త్రీలకు మధ్య తరగతివారికి యెక్కువ సహాకరించినవారవుతారు. శ్రీమతి డి. వి. లక్ష్మిగారు వ్రాసిన "వడదెబ్బలకు" వైద్యము చాల బాగుంది. అటువంటి పరిస్థితివస్తే యే డాక్టరు సలహా అక్కరలేకనే తక్కువ ఖర్చుతో నివారించుకోవచ్చును. తోటి పతితలు కూడ తమకు తోచిన వైద్య సలహాలను తప్పక "గృహవైద్యము" శీర్షిక ద్వారా ప్రతివారము అందిస్తారని నమ్ముచున్నాను.

యతిరాజవల్లి నారాయణాచార్య,
నరసాపురం]

* * *

గూడూరునుండి డి. వి. రమణగారు వేడిచేసి వంటికాలినొప్పికి మందు అడిగారు. నాకు తెలిసింది వ్రాస్తున్నాను. నిర్లో తప్పకుండా తగుతుంది. ఒంటికాలుగాని రెండు కాళ్లనొప్పిగాని వచ్చినప్పుడు ఒకగ్లాసు చల్లనినీళ్ళలో రెండు టేబుల్ స్పూనులు పంచదార కలపి త్రాగిన, ఐదునిమిషములలో తగ్గును. ఇంకా తగనియెడల అన్నము వార్చిన వెంటనే రెండు గరిటెల వేడి అన్నం ఒక కప్పు పెరుగులో వేసి 10 నిముషాలు వుంచి అన్నం తినేముందు అది తిని తరువాత మామూలుగా భోంచేయవలెను. ఈవిధంగా వారంరోజులపాటు ఉదయం తింటే ఒంటికాలునొప్పిరాదు. అసలు వేడి కూడా చెయ్యదు. ఇది స్వానుభవం. ఉదయం అంటే మరీ ప్రొద్దుటే తినక్కరలేదు. మామూలుగా మనం 10 గంటలకు భోజనం చేసేటప్పుడు ముందర అది తింటే చాలు.

—అక్కెళ్ల శారద, కలకత్తా]

* * *

## మరొక సూచన

వేడినీళ్లలో పేరిన నెయ్యి ఒకస్పూను, ఒకస్పూను చక్కెరవేసి తాగగల వేడిలో తాగాలి. తర్వాత తడిచేయి చేసుకొని కొద్దిగా పేరిననెయ్యి చేతిలోకి తీసుకుని కాలంతా ఒక ఐదు నిమిషములసేపు రుద్దుకోవాలి. తర్వాత ఒక చెంబు వేడినీళ్లు పోస్తే సరి 10 నిమిషాలలో గుణం కనబడుతుంది.

ఇంకొకటి :—వేడిచేసి మనకు గుండెలకు, పొట్టకు మధ్యలో విపరీతమైన నొప్పి వస్తుంది. గుండెనొప్పి అని చెప్పటానికి లేదు, పొట్టలో నొప్పి అని చెప్పటానికి లేదు. దానికి చికిత్స :-ఒక గ్లాసు నీళ్లు బాగా కాగనిచ్చి తెర్లేటప్పుడు రెండుస్పూన్లు జీలకర్రని నల్లగా వేగనిచ్చి, నీళ్లలో వేసి 5 నిమిషాలు తెర్లనివ్వాలి. తర్వాత దించి వడకట్టి ఒకస్పూను పేరిననెయ్యి వేసుకుని తాగగలిగినంత వేడిలో తాగితే ఐదు నిమిషాలలో గుణం కనపడుతుంది. నాకు తెలిసి నేను వుపయోగించే చికిత్సావిధానం. ఇదే:

— మోచర్ల పద్మ, మద్రాసు]

* * *

వేదాంతం లక్ష్మిగారు వనితాలోకంలో దోమతెర బట్టపై ఎంబ్రాయిడరి చేసే విధానం తెలియజేయమని కోరారు. నాకు తెలిసినవిధం చెబుతున్నాను.

కావలసిన వస్తువులు: బొంతకుట్టేసూది ఒకటి, 1 గజం దోమతెరగుడ్డ, తెల్లదారం రీలు ఒకటి, ఎంబ్రాయిడరి దారం (కావలసిన రంగులో) గజం దోమతెరగుడ్డ చిన్న టేబుల్ కయితే సరిపోతుంది. టేబుల్ ని బట్టి దోమతెరగుడ్డ ఎంత కావాలో కొల్చుకోవాలి ఏదైన డిజైను తెల్ల కాగితం మీద కార్బన్ పేపరుతో ట్రేసు తీసుకోవాలి, బొంతకుట్టే సూదికి రెండు పోరలు తెలుపు దారం ఎక్కించి ట్రేస్ తీసుకొన్న కాగితంపై దోమతెరబట్ట ఉంచాలి. పేపరు కదలకుండా ఉండటానికి కాగితానికి బటకు కలిపి డిజైను ఉన్న భాగం వదిలి చుట్టూ రాటాకా వేయాలి.

కుట్టేవిధానం: ఈ సారి బొంతకుట్టే సూదికి ఎంబ్రాయిడరి దారం ఆరు పోరలు ఎక్కించాలి. దోమతెర బటకు చిన్న చిన్న కన్నాలుంటాయి. డిజైను ఏకన్నం ద్వారా ప్రారంభమవుతుందో చూచుకోవాలి. సూదిలో ఎక్కించిన దారం చివర పెద్ద ముడివేయాలి. లేకపోతే దోమతెర బట్ట కన్నంనుంచి కుట్టినవన్నీ ఊడిపోతాయి. డిజైను ఏకన్నం దగ్గరనుంచి ప్రారంభమవుతుందో అక్కడ కాయితం అడుగునుంచి ఆసూదిని డిజైను పైకి తీసి డిజైను ఏలాగయితే వుందో అదే విధంగా, ఒక కన్నం నుంచి రెండవ కన్నంలోనికి సూదిని దూర్చుతూ రావాలి. కూర్పులాగా అన్నమాట. అంతే కుట్టడం చాలా తేలిక రెండు మూడు సార్లు చదివితే అర్థమవుతుంది. డిజైను అంతా కుటాక మెల్లిగా ముళ్ళు (కాగితానికి అడుగునున్నవి) అన్నీ వూడి రాకుండా కాయితాన్ని తీసేసి ముళ్ళు కనిపించకుండా అడుగున సాటిన్ ఏదైన లైనింగ్ ఇవ్వాలి.

—యం. కుసుమాంబ, తాడేపల్లిగూడెం]




## 30

పుల్లయ్య ఉదయం ఆలస్యంగా లేచేసరికి మల్లు కుక్కపిల్లను పట్టుకొని గెంతులేస్తూన్నాడు. వాడి సంతోషానికి అంతులేక పోయింది. అయ్యతో ఆ కుక్కపిల్ల యెలా దొరికిందో చెప్పాడు. ఎవడో ఆ మనిషి బూచోడిలా వున్నాడట! వాడివెంట కుక్కపిల్ల నడుస్తుంటే వెనకనుంచి వెళ్ళి పట్టుకొని పారో!

దాని కోతాడు కట్టి వాడెక్కడ వస్తాడేమోనని పెరట తడికకు కట్టాడు. దానితో మాటలకూ ఆటలకూ దిగాడు. అది కయ్‌ కయ్‌మని వుండీ వుడిగీ అరుస్తోంది. ఈసందడీ చూసుకొని పుల్లయ్య చడీచప్పుడు లేకండా చాటుగా ఒంటిగా పని వెదకటానికి వెళ్ళిపోయాడు.

ఎక్కడికివెళితే దొరుకుతుంది? చూడవలసిన పెద్ద 'కుంపునీలు' అప్పుడే చూసేసాడు. మెయిన్‌రోడ్డుమీద ఏదో పెద్దమేడ కట్తున్నారు. అక్కడ కూలీలను తెప్పించవారినెందరినో చూసాడు. 'పనివుందా?' అని ఒక మేస్త్రీని అడిగాడు. లేదు అనే సమాధానం వెంటనే వచ్చింది. "తూరుపోడ్ని, పిల్లలగలోడ్ని, మీలో ఒకడ్ని సేసుకోండయ్యా!"

"మేమే యిందరంవుంటే!"

ఆ ప్రక్కనున్న వాడు "పోనీ యీ రోజుకి తీసుకోరా," అన్నాడు.

"నూడు అలాగున్నాడుకదా? అతేం కూలిపని చేస్తాడురా"

పుల్లయ్య తనవేపు చూసుకున్నాడు. చిరిగిపోయిన చింకిమోటు బనియాను. ఆ చిరుగుల్లోనించిమాసే...యెముకలే కనిపిస్తున్నాయ్. మురుకులు దిగలేదు పంచె...మాసిపోయింది. మూతి నిండుగా మీసాలున్నాదానిని అనుకొన్న గెడ్డం బాగా మాసిపోయింది తనకేం జబ్బులేదే? ఒకటే జబ్బు—ఒకటే విచారం—"థా యీ జానెడు పొట్టకేనా యీ తంటాలూ...యీ యెత్తిపోడు పులూ?" ఎంత ప్రయత్నించినా కూలికి వస్తానన్నమాట నోటివెంబడి రాలేదు. ఆ గుంపులో ఆడవాళ్ళుకూడా ఉన్నారు. ఆ ఆడవాళ్ళలో కండలుతిరిగి సహజ సౌందర్యంతో వుటిపడే యౌవ్వనులుకూడా వున్నారు—కాస్సేపు నిల్చొని పరికించి చూసాడు. మీసాలు నల్లగావున్న ఒక మేస్త్రీ "యేమే మరదలా! మా తమ్ముడు మెత్తనోడైపోనాడా? నేకయింకోదానివల్లోనపడి అక్కర సెయ్యనేదా?" అంటున్నాడు.

ఆ జవ్వని ముసిముసినవ్వుతూ "ఆడదాన్ని సూసే తిమ్మనలాగ పళ్ళిగలించ" డండి. దానితో నోరు మూసుకున్నాడు. మరో యిద్దరు ఆ యిల్లు కట్టిస్తున్నవాడి గురించి పనిచేసుకుంటూనే బాతాకానీ వేసుకుంటున్నారు. ఆ యజమానికి, ఒకనిపై ఆడది మోజుపడటంవల్ల యింత డబ్బు వచ్చిపిందని, అదృష్టం అంటే అలాగుండాలని ఒకడంటే—"అదే ఒక అదుష్టమా—సెముటోడ్ని గడించిందే దక్కదు. ఇలాంటి వెలాగుంటాయ్!" అని మరొకడు అంటున్నారు.

ఆ ప్రక్కనున్న యింకొకడు కాలుతున్న చుట్టను ప్రక్కనుపెట్టి, "ఆ లచ్చిందేవికి నీతిలేదంరా—ఉన్నోల్నింటికే యెల్తాది. మొన్న యీడి బావమరిదే పేకట్లఆటలో యేటెయి యేలొచ్చాయట! ఇంతమంది సస్తున్నారు. ఆపేకట్లు ఆటలో పడి మా అల్లుడు ఆఖరికి యేంచేసినాడు? రైలు క్రింద తలెట్టేసినాడు—ఆడు పెళ్లాం నలుగురు పిల్లలూ నా యింటిలోపడారు—రోజులు సూసినావా యెలాగున్నాయో?" అన్నాడు.

ఈ మాటలన్నీ వింటూ పుల్లయ్య అలానే నిల్చుంటే యీ మేస్త్రీయే అన్నాడు. "పోనీ యీ రోజుకి పనిసెయ్యి...మావేయెక్కువైపోనాం!" మిగతావాళ్ళు కాదనలేదు. పుల్లయ్య సున్నం కలిపాడు—మోసాడు, కొంతసేపు—కానీ వుత్సాహంగా లేదు. మధ్యాహ్నంసరికి ఆ పెద్ద మేస్త్రి అన్నాడు. "నూసావా! ఆడిపని—ఆడదానికంటే నాసి—యిలాంటోడి సేసుకుంటే నాకేం నాబం?—యిందా—యీ అరరూపాయి తీసుకొనియెళ్ళిపో" అని పంపించివేసాడు.

పులయ్యకు ఆ ఆడవాళ్ల యెదరగా చాలా నామోషీ అనిపించింది. ఆ అర్ధరూపాయి వాడిమొహంమీద కొట్టేద్దామను

# ★ దగా పడిన తమ్ముడు ★

కున్నాడు. కానీ చెయ్యాడలేదు. ఇంట్లో మలూపిలా జ్ఞాపకం వచ్చారు. వాళ్ళు ఆకలితో యీసరికి యేడుస్తుంటారు. ఇది ఒక పూటకైనా జరుపుతుందని యింటివేపు బయలుదేరాడు. త్రోవలో ఒక మూడంతస్తులమేడ కనిపించింది. నిల్చొని పైకి చూసాడు. "అదెక్కి చూస్తేపట్నం అంతా కనుపిస్తాదేమో! ఎక్కితే బాగున్ను—" కానీ తన జన్మలో అదెక్కగలడా?

ఇంతలో "అయ్యా" అన్న కేక వినిపించింది. ముల్లు- ఇక్కడికెలా వచ్చాడు—ఏ బస్సులో కార్లక్రింద పడిపోతే...వచ్చి గట్టిగా పట్టుకుని వెంటనే నిష్ఠూరంగా మాట్లాడేస్తున్నాడు. కొడుకు నెత్తుకొనే సరికి యెక్కడలేని సత్తువ ఆనందం వచ్చింది. నాలుగడుగులు వెయ్యగానే "అయ్యా, అయ్యా...అడిగో బూచోడు!" అని చూపించాడు.

వాడు ఆరాత్రి చెట్టుక్రింద వున్న మనిషి. ఏదో గొణుక్కుంటున్నాడు. పుల్లయ్య ఆదగ్గరగా నిల్చున్నాడు — వింటున్నాడు "లోకం అంతా మోసమే—నాకు లోకం అంతా కలిసి మోసంచేసారు. అదిగో ఆడు వాడెట్టుబ్తో మూడంతస్తులమేడ కట్టేసాడు. నా కుక్కపిల్లని ఎవడో ఎత్తుకపోయాడు— అదే మిగిలింది. అది నాదైంది - అదే నా కష్టాలు విని సానుభూతిచూపించి నా వెంట తిరిగింది...అది నాకు లేదు—నేనెందుకు ఒంటరిగా బతకాలి?...అయ్యో! నేనెంత పిరికివాడ్ని...పిరికివాడు రోజూ ఛస్తాడు... ఎప్పుడో అతీగతీ లేక రోడ్డుమీద కుక్కలాగ చచ్చిపోతాడు—ఇది నిజం...కానీ నా రోదన వినేవాళ్ళింకెవరు?"...

ఆ దీనాలాపన పుల్లయ్యకు అర్థమైంది. తనూ రోజూ చచ్చిపోతున్నాడనిపించింది. తన కెందుకీ బ్రతుక లేనన్న పిరికి? ఆపల్లూడిన ముసలమ్మ కర్రపెండలం అమ్మి కొడుకును వాడి పిల్లల్ని పోషిస్తోందే! ఆ తాపీమేస్త్రీ యిలాచేసి తన కుటుంబంతోపాటు కూతురు కుటుంబం ఈడుస్తున్నాడే! తనలో ఏదో లోటుందా లనిపించింది. తనకెందుకా ఆశ? చప్పన పెళ్ళాం అన్న మాటలు స్ఫురించాయ్ "ఈ లోకంలో అందరూ రాజులు కాలేరు. -అందరూ అడుక్కోరు - రాజుకు తగ్గబతుకు రాజుది, అడుక్కున్న వాడికి తగింది వాడికి- రాజుకంటే రెండోవాడే సుకంగా ఉంటాడు - రాజుకు మారాజు కావాలన్న ఆశ వుంటాది - ఆ ఆశతో వాడికి సుకం వుండదు. అడుక్కునేవాడికి కడుపునిండిన రోజు సుకం - లేనివాడు బాధ - అంతే! తనకు నెలజీతం పనవ్వాలని కొట్లాటెందుకు? ఇలాగే యెళ్ళనీ...రోజులు బాగుంటే పేదోడు మారాజు అవడా? ఆడెవడో మేడె లాగ కట్టించేసున్నాడు?

ఈ ఆలోచనలతో పులయ్య యిల్లు చేరుకున్నాడు. పట్నంలో తొలిసారి అర్జన పెళ్ళంచేతిలో పెట్టగానే ఆ అల్పసంతోషి ముఖం ఒక్కసారి వెలిగినా వెంటనే ఎలాగ వచ్చిందో చెప్పుమన్నది. అంతా వివరంగా చెప్పగానే "ఇలాగైతే బ్రతిక్క యేం అవుతాం?" అన్నది.

సాయంత్రం కొడుకును పట్టకొని యీ కొట్లో ఆకొట్లో పనికోసం వాకబుచేసుకొని వచ్చేసరికి యింటదగర సందడిగా ఉంది పిల్లికోసం యేడ్చిన పొరుగు మనిషి దుఃఖం కాస్తా దూరం కావటం వల తన మామ్మలు స్వరూపం దాల్చింది. ఆ వీధంతా ఆమంటే హడలు. మొగవాళ్ళు కూడా ఆమె నోరు విని యింటినుంచి వెళ్ళిపోతారు. పుల్లయ్య ఆమెను యీ వేళే సరిగా చూసాడు. వయస్సు ముప్పైఐదు, నలభై మధ్యలో నుంటాయి పిల్లలు లేరు. అందుచేత మనిషి చూపుకి ముప్పైయేళ్ళ లోపు మనిషిలా ఉంటుంది. పిక్కబలం ఉండి ఆమెలో స్త్రీకి వుండే కోమలత్వం ఒక పాలు, మిగతా మూడుపాళ్లు పురుషునిదే! మొగుడిలో యిటుదటు! వాడే పెళ్ళాం యీమే మొగుడులా యింట్లో మెసులుతారని ఆ వీధిలో అనుకొంటుంటారు ఆమెకు వినిపించనట్లుగా!

పుల్లయ్య వెళ్ళినా ఆమె వాగాటి తగ్గలేదు. నీలి సన్నని గొంతుకతో యిచ్చిన సంజాయిషీ ఆమె వినిపించుకోలేదు. మొగుడ్ని చూచి నీలి యింట్లోనికి వెళ్ళిపోయింది. అడగా యింతకీ తేలిందేమిటంటే యింటి మొగుడు తెలియక రెండు రూపాయిలకి యిలు యిచ్చేసాడు. ఇంకో రూపాయి యివ్వకపోతే ఖాళీచేసి తీరాలని—

"దానికేయింత నోరుచేసిందా?" అన్నాడు.

"నిన్న పిల్లలు గోలచేసున్నారని యేదో కస్సుబుస్సు మంది. ఆ కోపం యీ కోపం కలిసింది?"

"పిల్లలు అలరి పెటక-పెదోలు పెట్టారా?- రానీ తెగువు. యెలాగ పెట్టదో చూస్తాను. నోరు జారిస్తే నువ్వూరుకోక!"

నీలి నవ్వింది. "అది జారేసిందని నేను జారేసే యేమున్నది. నాతప్పేం నేదు— నేనెందుకు దానిలాగ అయిపోవాల? కోపమంతా కక్కనీ..."

"అంతా కక్కెస్తాది-కాటి కళేవరకూ వుంటదా?"

"ఒంట్లో ఒక వుండు ఎంతకాలం వుంటాది? అది బాగు కాకపోతే మనిషే మాతాడు? ఆలాగే నెత్తేదిమనిషిలో ఎంతో కాలం వుండిపోదని మా మామ్మచెప్పింది. మంచి దగ్గర నెడ్డకి లొంగుబాటు లేకపోతే యీ పెపంచకమే నిలవదు."

పుల్లయ్య యింత సమాధానం విన్నాక మాటాడలేదు. ఆ రాత్రి నిద్రపోయేముందు నీలి రాత్రి జరిగినవిషయంగురించి యెత్తింది. పుల్లయ్య దిగులుతో మాటాడలేదు. ఆమె మౌనంగావున్న భర్తతో మెల్లగా అన్నది- "నూడు! యిలాగ పచ్చులాగ సచ్చిపోదాంగానీ దొంగతనాన్కి మాత్రం యెల్లొద్దు."

పుల్లయ్య తను దొంగతనానికి వెళ్లలేదని తను వుద్దేశము చెప్పాడు. కొంతసేపయ్యాక "పొరపాటైపోవాది. ఏదో బతుకుతానని అనుకున్నాను. మల్లా నాపీక తెగినా అలాంటి పని సేస్తానా?" అన్నాడు.

"నానూ యెవరింటికాడైనా పని సూసుకుంటే యిద్దరు తెచ్చింది సరిపోదా?"అంది.

పుల్లయ్యకు యీ నిముషములో తన గడచిన జీవితమే జ్ఞప్తికి వచ్చింది. మెయిన్ రోడులో కట్తున్న యింటిదగర ఆడవాళ్ళ మీద మగాళ్ళు విసిరే విసుర్లు నెమరు వేసుకున్నాడు.

"ఎందుకులే," అనేసాడు.

ఆ మరుచటిరోజు వీళ్ళనీ, వాళ్ళనీ పని విషయం అడిగాడు. తుళ్ళ సిండియా కం పెనీ, నేవల్ బేస్, హార్బరు వేపు వెళ్ళారు. పట్టరానివాళ్ళ కాళ్ళు పట్టాడు. కానీ లాభము లేకపోయింది. మధ్యాహ్నం ఒక దక్షిణాది వేలాం వ్యాపారస్థుడి మూటలు మోసాడు. సాయంత్రం సరికి మూడు పావలాలు యిచ్చాడు. తనకు సంతోషం లేదుగాని నీలికి యిది చాలనిపించింది. ఆ రాత్రంతా ఆవేదనే. పిల్లలు మధ్యాహ్నం ఆకలితో యేడుస్తుంటే పొరుగునున్న యాళ్ళవి పిల్ల లకు తిండి పెట్టిందట—దాని దేశాలో—కడుపు మాడుతుంటే జాతీ గీతీ ఎందు కను కున్నాడు. ఆ రాత్రిమీద తలుచుకున్న కొద్ది నిద్దుర దూరమౌతోంది. ఎదరగా చెట్టు క్రింద బూచోడు పడుకొని వున్నాడు. చలి కొద్దిగా వేస్తోంది. ఉప్పుటేరు ప్రక్కను రైలురోడ్డు వుంది. పోతూ పోతూ రైలు ఊలవేసింది—భయంకరంగా! ఆలోచనలు పట్టుతప్పి మనిషిని నీరసం చేస్తున్నాయి—రైలుక్రింద పడిపోతే—అనుకున్నాడు! "ఛా ఛా—మొగోడై పుటావ్—పావలా డబ్బులు తెచ్చుకోలేవా? ఆడది పిల్లలు యే మౌతారు? "వాళ్ళు యేడ్చుకొంటున్నట్లు అప్పుడే కళ్ళకు కటినట్లయినది. "నా నాయనా! నా మల్లూ" అని యేడ్చు కున్నాడు—నా బతుకు యేడుపుకొచ్చిందా అని మరింతయేడ్చుకున్నాడు. ఆ దుఃఖంలో యెంతో అనుకున్నాడు—"ఉద్యోగం నేక పోతే ఎలాగ బ్రతకడం? ఊరంతా తిరిగినా కానీ పుటదు. బీదోలకి సుట్టముక్క నేదు. గొప్పోలకో—ఇంత బతుకు బతికినా, నాకీ గతి యిలా తెచ్చావేం భగమంతుడా!" అను కున్నాడు.

అలా అనుకొంటుండగానే మాగన్ను నిద్దురపట్టింది. ఏవేవో కలలు. తెల్లారి లేచేక మళ్ళీ గుండె బరువెక్కింది. పాదాలు అరిగి పోయినటు తిరిగాడు. అగపడిన వాళ్లందరికీ ఆత్రుతతో ఆశతో దండాలుపెట్టాడు. రైలు స్టేషనుకు వెళ్తే లైసెన్సు కూలీలు రానిచ్చారు కాదు. ఒక ముసలమ్మ మొయ్య లేక మొయ్యలేక చిన్న మూట తెస్తూ ఉంది. పోనీకదా అని మూట అందు కుంటే కూలోడని ఒద్దు, ఒద్దు అంది. గాడీ మీద కూర్చోపెట్టాక "నానాయనా-సుఖ పడతావురా" అని దీవించింది. ఒక్క అణా డబ్బులైనా యివ్వలేదు.

సుఖమెక్కడిది-రోజంతా యెలా గడు స్తుందని ఆరాటమే-రానురాను యిటుభయం-అటుభయం-ఆకలి పీడించేస్తుంది-అభిమానం చంపేస్తోంది. "ఏమెట్టి యీ కుటుంబం పెంచేది దేముడా" అని పట్నం అంతా తిరిగి తిరిగి కాకిశోకం చేసాడు. ఎవడో తన లాంటోడే కానీ తనకంటే పొరుషమైన మనిషే. పట్నం బాగా చూసాడు. పట్నం సంగతులు బాగా తెలుసు నన్నాడు—అన్నాడు.

"ఓరన్నా! గవుర్నమెంటోడు మారక్లే ఆ దొరల్ని తగిలేస్తాడు-మారక్తే గవుర్నమెంటోడు యేలతన్నాడు. నూడు మన లాంటిబీదోలు పిప్పైపోతన్నారు. ఎక్కడా కరువే-ఎలాగ దేశవాళీ ప్రజ ఆకలితో సచ్చిపోయి మాడిపోతన్నారో..."

"అవునన్నా! మన గవుర్నమెంటోడు సిన్నోడు. పెద్దోడైతే మన పని బాగుం డదా?" అన్నాడు పుల్లయ్య.

"నువ్వు జంగిలీవోడులాగ వున్నావు. గవుర్నమెంటోళు పెద్దోళ్లే-ఆలు సరిగా పని సేస్తే మనలాంటోలికి నౌకరీ కొదవా?"

"ఆడెందుకు సెయ్యడు?"

"సేస్తే యీ కరువెందుకుంటాది? బీదాడి కష్టం యేం చెప్పేది? దానికి ఒక మొదలు సివరా నేదు. ఈ పెజ యెందుకూ పనికిరానో లైపోవారు. వంచం కట్టినోలికి వుంచినారు. నాలాంటి లేనోలికి తీసినారు. ఈళ్లందరికీ హిందూధర్మం ఎప్పుడు అలవడతాదో ఆ రోజు మనం బాగుపడతాం—హిందూ ధర్మంలో న్యాయంగాపోయి వారికి కలిగిన మటుకు అన్నీ జరిగిపోగా పక్కనున్నోడికి నూడమని... అన్నారా?"

అని పుల్లయ్యనీ మల్లునీ ఆ మనిషి వెంట తీసుకెళ్లాడు. చిన్న కాఫీహోటలు-చిన్న బెంచీ! అంతా యీగలు, దోమలుమయం.

"ఇదన్నా తాగు..."

ఆకలితో వుండటంవల్ల మారు మాటాడ లేదు. త్రాగేక యేదో నేరం చేసినట్లని పించింది. మల్లుకూడా త్రాగాడు.

బెల్లం టీ వాడికి చాలా రుచించింది. సాయంత్రం కావస్తోంది-ఇంట్లో పెళ్లాం పిల్ల జ్ఞాపకానికి వచ్చారు. తానైతే యెవడో పోసిన సానీరు పోసుకున్నాడు. వాళ్ళ గతి?

ఈ క్రొత్త స్నేహితుడు "మీటింగుకు రావా?" అన్నాడు "మీటింగేటి?"

"తెలీదా? ముందుకు ఓట్లు వస్తన్నాయి. ఎవుడికేస్తే నా బాధలు తగ్గుతాయో వాడికి యేస్తాను. పెద్దోలు బాగా యీ కరువుకి డబ్బు సేసుకున్నారు. ఎక్కడ నూసినా అన్యాయమే — ఎక్కడా వంచనే — నాలాంటోలి బతుకేమైనాది? నానుబతక లేక పోనాను — నా కష్టాలు నాసెల్లెలు నూడలేక పోయింది—"

పులయ్య ఆత్రుతతో "ఏమిసేసింది" అన్నాడు.

ఆ మనిషి కళ్ళు చెమ్మగిల్లి పోయాయి. అంతలోనే పౌరుషం చుట్టుకుంది. "నా సెల్లి మానం అమ్ముకున్నాది. కత్తితో నరకాలను కున్నాను; కత్తి సంపాదించినాను. అయేల ఒక యేటు యేసేద్దును. నాకు రెండు రోజులైంది గంజినేసు — నా సెలాగో ఉన్నాను. కానీ నా తల్లిలేని ముగురు పిల్లోళ్ళు......! దానార్జనే ఆలని ప్రేణంతో వుంచింది. ఆ రాత్రి అది గంజిపొయ్యక పోతే అంతాసరి! ఏమి సెయ్యమంటా వన్నా?"

పుల్లయ్య మనసు చివుక్కుమంది. అయ్యో పాపం అనుకున్నాడు.

"ఇదంతా అబదాలు కావన్నా! నాలుగు నిముషాలు యీ లోకంలో బతికినా నీతిగా బతికినోడితో వ వేరు—నాకు ఆకలేస్తోందని వూరందరి మీద అబద్ధం సెప్తే దేవుడు కాయడు, యీ గొప్పోల్ని వరికేమని అనను. ఆలికి మనలాంటోలి బతుకు తాలూకు బరువు తెలీదు— కావిడి మోసినోడికి బరువు తెలుస్తాదిగానన్నా వాలికేం తెలుస్తాది? ఈతకాయ యిచ్చి తాటికాయ పుచ్చుకో వాలని చూస్తారుగాని, తాటికాయ మా లాంటి బీదోలికిచ్చి మా దగ్గర నుంచి ఈత కాయంత బక్తి పుచ్చుకుంటే యెంత బాగున్నా?"

పుల్లయ్యకు యీ మాటలు యెంతో నచ్చాయి. తనకంటే ఘోరంగా బాధపడే వాళ్ళ లోకంలో వుంటే తను యింతవెట్టిగా యెందుకై పోవాలనిపించింది. తను కిరకిర చుట్టుకపోవడం బెంగ లేదనుకున్నాడు.

మీటింగు దగరకు తీసుక వెళ్ళారు. తన లాంటి వాళ్ళు చాలామంది వున్నారు. అంతా చాలవరకు కార్మికులు — మధ్య తరగతివారు! వాళ్ళ వేపు చూస్తూవుంటే పుల్లయ్యకు ఎక్కడలేని ఆనందం వేసింది. బహుశః యీ వేలకొద్దీ జనం తనలానే కష్ట

(49- వ పేజీ చూడండి)

# బాల సాహితి

## కాశీయాత్ర

కొందఱు భూసురవరులకు
  కలిగ నొక్క గాఢవాంఛ—
పాపనాశమౌ కాశీ
పట్టణమును దర్శింపగ.

ఒక్క సుదిన మా విప్రులు
  ఒక్కుమ్మడిగా కదలిరి—
దారి వెచ్చముల గైకొని
వారణాసి కభిముఖముగ.

పెంకిపిల్లవా డొక్కడు
  పయనమయ్యె వారివెనుక
విప్రులు వలదనుచున్నను
విడువకుండె తన పంతము.

వారిక చేయునది లేక
  వెంటవచ్చు నాబాలుని
దారి పొడుగునను కసరుచు
దూషింపగ సాగినారు.

అంతట మధ్యాహ్నమాయె
  చెంత నెగల మఱ్ఱి క్రింద
విశ్రమించినా రందరు-
విప్పినారు చల్దిమూట.

ప్రక్కనున్న అరటితోట
  పెంకివాని కండ్లబడెను
పాఱుల నేడ్పించుట కిది
తరుణమ్మని తలచి వాడు.

తోటలోని ఆకులన్ని
  త్రుంచి తెచ్చినాడు వేగ
అరటితోట నాశనమై
ఆకారము కోలుపోయె!

భుజియించిన పాంథులంత
  భుక్తాయాసమున మేను
వాల్చినారు - అంతలోన
వచ్చెనటకు తోటకాపు.

అరటితోట తీరుచూచి
  రగిలె కాపువాని కడుపు
మండిపడుచు, బ్రాహ్మణుల
బడితె నెత్తి మోదబోయె!

"ఎరుగము మేమేపాపము
  ఆతుంటరిపనియే యిది!"
అని విప్రులు దవ్వు నున్న
చిన్నవాని జూపినారు.

పటపత్రములతో వాడు
  విస్తరొకటి కుట్టుచుండె
తన్ను కొట్టవచ్చుచున్న
కాపుతోడ పలికె నిట్లు:

"వెఱ్ఱివాడ - ఆగుమింక!
  మఱ్ఱాకులతో విస్తరి
కుట్టుట కన్పడుట లేద?
కొట్టవత్తు వేల నన్ను?—

ఆ పాఱులు తమ తప్పును
  నాపై నిడదలచినారు"—
ఆమాటలు నమ్మి కాపు
"ఔనౌ"నని వెను దిరిగెను.

బ్రాహ్మణు నొక్కని విడువక
  బడితెపూజ చేసినాడు
వాని మొరటు దెబ్బల కో
ర్వంగ తరమె బ్రాహ్మణులకు!

అచటి నుండి కదిలినారు
  అవనిసురులు వెనువెంటనె
ఆతుంటరి జోలికేగ
సాహసింపలేదు మరల. ★

# సుముఖి

వి. వరలక్ష్మి

అనగా అనగా ఒక కుమ్మరపల్లె. ఆ పల్లెలో సిద్ధసాధుడు అనే కుమ్మరి ఒక డుండేవాడు. అతనికి లేక లేక కలిగిన బిడ్డపేరు సుముఖి.

సుముఖి తోటి పిల్లలకు మల్లే ఆట లాడుకోదు. ఎవరితోనూ మాట్లాడదు. మళ్లా తండ్రిచెప్పిన పని చేసేది. అందుకని తోటిపిల్ల లందరూ సుముఖిని పట్టి మొద్దుకింద జమ కట్టారు.

తండ్రికి, 'ఈ పిల్లలకు పెళ్లి ఎట్లా అవుతుందా!' అన్న దిగులు పట్టుకుంది. అందుకని తన బంధువుల పిల్లవాడిని తీసుకువచ్చి, తనే పెంచిపెద్దవాడిని చేసి, కూతురునిచ్చి పెళ్లి చేశాడు. అతనిపేరు మంద ప్రజ్ఞుడు. తండ్రి కొన్నాళ్లకు చనిపోయాడు.

మందప్రజ్ఞుడు భార్యని చూసి "నాపేరుకు మల్లేనే నా ప్రజ్ఞ కూడాను. మీ నాన్న ఉన్నంతకాలమూ కూర్చుని తిన్నాం. ఇప్పుడైనా మన పని మనం చేసుకోకపోతే పొట్ట గడవదు. నువ్వు నదికిపోయి బంక మన్ను తీసుకురా, నేను కుండలు చేస్తాను. అవి అమ్మి డబ్బు సంపాయిద్దాం; అన్నాడు. సుముఖి సరే నంది. వాళ్లకి బాగానే రోజులు గడిచిపోతున్నాయి

ఒక రోజు సుముఖి చాలా బంక మన్ను నింపి గంపకి ఎత్తుకు వద్దామనుకుంది. కాని, బరువు మోయలేక ఒకచోట కూలబడి ఏడవటం మొదలుపెట్టింది. తోటివాళ్లంతా వెళ్లిపోయారు.

అప్పుడా దారిన ఒక మునీశ్వరుడు పోతూ సుముఖిని చూచి "ఎందుకు ఏడుస్తున్నావు" అని అడిగాడు. సుముఖి చెప్పింది. అప్పుడు ఆయన, నీవు పూర్వజన్మలో మునీశ్వరులవద్ద సేవచేస్తూ ఉండేదానివి. అంత గొప్ప మునులవద్ద నుండి కూడా వారినుండి ఏమీ గ్రహించలేక పోయినావు. చేట ఎట్లాగైతే సారమంతా తను ఉంచుకుని రాళ్లూ, రప్పా అవతలికి తోసేస్తుందో అట్లాగే మనుషులుకూడా ఎక్కడ ఉన్నా మంచిని గ్రహించి చెడును వదలిపెట్టాలి. నువ్వట్లా చెయ్యలేదు. కనుక నీ కిటువంటి జన్మవచ్చింది. నీవు నీభర్తను పూజించు. పతిసేవే మోక్షసాధనమని తెలుసుకో. ఇట్లా చేస్తే నీకే కష్టమూ ఉండదు," అన్నాడు. ఆమెకు ఒక మంత్రం కూడా ఉపదేశించాడు.



ఎండాకాలం ఎలా వుంటుంది తాతయ్యా!

—చిత్రకారుడు: పి. నాగేశ్వరరావు, సత్తెనపల్లి.]

సుముఖి అతను చెప్పినట్లే చేస్తున్నది. రోజూ తట్టనెత్తిన పెట్టుకొని ఇంటికి వస్తూంటే అది తలకుతగలటంలేదు. దానంతట అదే వస్తున్నది.

ఒకనాడు మట్టికి పోతూంటే త్రోవలో ఏరు బాగా పొంగి ప్రవహిస్తున్నది. మిగతా వాళ్ళందరూ దానిని చూచి భయపడిపోయినారు. సుముఖిమాత్రము ఏమీ భయపడకుండా నదిని దాటబోయేసరికి, ఏరే ఆమెకు దారిచ్చింది. తోటివాళ్ళం




"అయితే, బాబూ! జేబుదొంగ లున్నారూ ?"
"ఓ—లేకేం! కొల్లలు!!"

—చిత్రకారుడు: ఎ. సూర్యారావు.]

 సుముఖి 

దనూ "మొన్న మొన్నటిదాకా వట్టి మొద్దులా ఉండేది. ఇప్పుడిట్లా అయిందే!" అనుకుని ఆశ్చర్య పడ్డారు.

సుముఖి రోజూ సరిగ్గా రెండు జాములకు భర్తకు భోజనం పెట్టేది. ఎంత పని ఉన్నా సరిగ్గా ఆ వేళకు పెట్టేది,అందరికీ ఆశ్చరంగా ఉండేది.

మంత్రిగారి భార్య ఈ మాట విని "చూద్దాం! రేపు పిలిచి చాలా ఆలస్యం చేయిస్తాను. రెండు జాములకు ఎట్లా అన్నం పెడుతుందో చూస్తాను," అనుకుంది.

మర్నాడు సుముఖి కుండలమ్ముతుంటే పిలిచి ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెపుతూ, బేరం చేస్తూ పోనివ్వకుండా ఆపింది. చివరికి బేరం చేసింది. ఆ తరవాత దబ్బున డబ్బులివ్వకుండా మాట్లాడుతూ కూచుంది. "సుముఖి" నాకు తొందరగా డబ్బిప్పించండి. నేను పోవాలి అంటున్నది. ఎట్లాగో మంత్రి భార్య మూడున్నర జాముల దాకా గడిపింది. గడియార యంత్రంలో మూడున్నర అయిందే కాని, సూర్యుడు రెండుజాములకు ఎక్కడ ఉంటాడో అక్కడే ఉన్నాడు. మంత్రి భార్య ఆమె ప్రభావానికి ఆశ్చర్యపడి పల్లకిలో వాళ్ళింటికి పంపింది.

ఇది రాజుగారు విన్నారు.

ఒకరోజున రాజుగారు సుముఖి ఇల్లు తగలబెట్టి రమ్మని కొందర్ని పంపించాడు. సుముఖి యొక్క గొప్పతనం దీంతో తేల్తుంది, అని ఆయన అనుకున్నాడు. ఆరాత్రి వాళ్ళొచ్చి సుముఖి ఇల్లు తగలబెట్టారు. మందప్రజ్ఞుడు గాబరాతో అరుస్తూ సుముఖిని లేపాడు. సుముఖిఏమీ తొందర పడకుండా ఆ మునీశ్వరు డుపదేశించిన మంత్రాన్ని చదివేటప్పటికి మంటలు ఆరిపోయి ఇల్లుమామూలు లాగా అయింది. రాజుగారు చాలా ఆశ్చర్యపోయారు. సుముఖిని చాలా గౌరవంతో సత్కరించారు.

సుముఖి అలాగే కాలం గడిపి అవసానంలో మోక్షం పొందింది.



#  నిజానిజాలు 

(23-వ పేజీ తరువాయి)

'ఎందుకిదంతా మాలతీ?' అంది సరస్వతి- మాలతినవ్వింది. ఇంతలో శివరావుకూడా వచ్చాడు. మాలతిని అతనికి పరిచయం చేసింది. శివరావు తను తీసుకొచ్చిన మల్లెపూలచెండు భార్యచేతికిచ్చాడు. సరస్వతి దాన్ని ఆప్యాయంగా తలలో వుంచుకోటం చూసి మాలతి నిట్టూర్చింది. ఏమిటో! ఆమె అనుకున్న జీవితం ఒకటి—ఎదుర్కొంటున్న సమస్యలు వేరు. పదినిమిషాలపాటు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

'మాలతీ! మా యిల్లు చూస్తుంటే నీకు అసహ్యం వేయటం లేదూ?'

'సరూ! నువ్వు తెల్లవన్ని పాలని మోసపోతున్నావు—అంతే! అది సరేకాని ఏమండోయ్! మా సరు వెర్రి బాగులి—దాన్ని ఏమీ అనకండి. దాని మనస్తత్వం చిన్నప్పట్నుంచే నాకు తెలుసు...రామం నిన్ను మీ అమ్మ, నాన్న ఎప్పుడూ కొట్టరూ?'

రామం సిగ్గుపడిపోయాడు. 'లేదండి' అన్నాడు.

తను తాగిన కాఫీ అమృతంలా వుందని సర్టిఫికేట్ యిచ్చింది.

తిరిగి వెళ్ళిపోతూ కారులో అడుగు పెడుతున్నప్పుడు సరస్వతి, మాలతి ముఖంలో అంతులేని అసంతృప్తి, విచార రేఖలు విస్తరించటం గమనించింది.

'అదృష్టవంతురాలు' అనుకుంది మాలతి.

అయిదురోజులు గడిచాయి

తలుపుదగ్గరగా వేసివుంది సరస్వతి తలుపు తీసుకుని లోపలకు వెళ్ళింది హాల్లో పనిమనిషివుంది. మాలతివచ్చి పలకరించింది. ఆమెకళ్ళు బెదురుతున్నాయి.

పక్కగదిలోంచి సంభాషణ నెమ్మదిగా వినిపించింది:

'చూడు! శ్రీపతీ! నువ్విట్లా నాశనం కావటం నాకెంతమాత్రం యిష్టంలేదు. నీకిదివరలో చాలాసార్లు చెప్పాను. నా చేతిలో దొరికావు కనక తప్పించుకుపోతున్నావు. స్నేహితంకోసం నా కర్తవ్యాన్ని కూడా నెరవేర్చటం మానుకుంటున్నాను. మరో ఇన్స్పెక్టర్ నిన్ను పసిగట్టివుంటే ఎప్పుడో అరెస్టుచేసి వుంటాడు. అందులో గవర్నమెంటు వుద్యోగివికూడా—ఛీ...ఛీ...' అది కటువైన కంఠం.

మాలతి ఆపైన విననివ్వకుండా సరస్వతిని [illegible]మీదికి లాక్కుపోయింది. ఆమెను ఓసోఫాలో కూర్చోబెట్టి తనూ ఎదురుగా కూర్చుంది. సరస్వతి ఆశ్చర్యంగా చూసింది.

మాలతి చెంపలమీదుగా కన్నీరు-

'సరూ! ఆశ్చర్యపోతున్నావు కదూ!... నాకు జీవితంలో మిగిలేదియిదే! ఆనాడు నువ్వన్నావు — డబ్బువుంటే సుఖాన్ని కొనవచ్చని - జ్ఞాపకంవుందా? అది పొరపాటని ఏనాడైనా నువ్వు గ్రహించక తప్పదు—నాకింతధనంవుంది ఏమిటనుభవిస్తున్నాను? ప్రతిక్షణం భయంతో వణుకుతున్నాను. మా ఆయన్ని చూడు. కావలసిన దురభ్యాసాలన్నీ వున్నాయి. ఆవేళ రైలుబండిలో ఆయన్ని చూశావు కదూ! అప్పుడు తప్పతాగి నిషాలో వున్నారు. ఇందాకా సంభాషణ విన్నావు కదూ! నాలుగైదుసార్లు ప్రొహిబిషన్ ఇన్స్పెక్టర్ చేతిలో పడ్డారు. కాని ఆయన స్నేహితుడు కనక వదిలేశాడు. చివరకు ఆయనక్కూడా విసుగెత్తిపోయింది ఈమారు ఎలాంటి ప్రమాదం వస్తుందో యేమో! ఒక్కనాడైనా ఆప్యాయంగా మాట్లాడరు. నిజానికి మీ సంసారం చూస్తుంటే నాకు అసూయగా వుంది - ఎంతప్రేమగా వున్నారు. నాబాధ ఎవరితో చెప్పుకు ఏడవను? లోపల ఎంత మథనపడుతున్నా ఇలా పైకి నవ్వుతూ జీవితం గడపాల్సిందే-మనసు కోతిలాంటిది- మన చేత ఎప్పుడు ఎలాంటి పనులు చేయిస్తుందో చెప్పలేం — నేను



# స్వర్గసీమ



(30 వ పేజీ తరువాయి)

సాయంత్రం వచ్చేప్పుడు." అంది పద్మ. ఒకసారి పద్మ ముఖంవైపు అదోలా (ఇంక యిలా ప్రాణాలు తీసుంది కాబోలురా అర్ధాంగి అని) చూసి ఆఫీసుకి వెళ్ళిపోయాడు మధు.

వాళ్ళుండేది మూడుగదుల వాటా. వాసాలకి బూజుపట్టి యిల్లంతా అసహ్యంగా వుంది. వీధి గదిలో ఉన్న డ్రాయరు, కుర్చీలు చక్కగా అమర్చి ఆఫీసుగదిలా మార్చి, బూజు దులిపి అవసరమైనవి, అందమైనవి రెండుమూడు ఫోటోలు తగిలించింది. మధ్యగదిలో వున్న మంచాలకి దోమతెర తీసి వేసింది. ఒంటరి జీవితంలో మధు శరీరంక్రింద చిరకాలం నలిగి కురూపం వచ్చిన దుప్పటిని తీసి మరొక తెల్లనిదుప్పటి వేసింది పనిమనిషి సహాయంతో వంటయింట్లో గోడకి బల్ల ఒకటి మేకు బందిచేసి పాత్ర సామాను సర్దింది. ఆఫీసు గదిలో వున్న మధు పుస్తకాలు షెల్ఫులో అమర్చింది. అందమైన డిజైను వేసి స్వయంగా అల్లిన టేబుల్ క్లాత్ వేసింది. ఆ పగలంతా పనిమనిషి సహాయంతో యిల్లంతా ఒక క్రమంలో ఏర్పాటుచేసింది పద్మ.

సాయంత్రం మధు రంగుదారాలు కొని సూర్యనారాయణ ఇంటి మెట్లెక్కుతూ లోపల మాటలు వినిపించి ఆగాడు.

"మధు భార్యని తీసుకువచ్చాడట. ఒకసారి వెళ్ళి చూసిరారాదూ?" మధ్యాహ్నం అంతా సెలవుపెట్టి యింటివద్ద కూర్చున్న సూర్యనారాయణ కమలతో అన్నాడు.

"ఎందుకులెండి, మీరు చెప్పినదానినిబట్టి మధు, తనపాటకి వంతపాడే పశువుని కట్టుకున్నాడని తోస్తోంది."

"నీ మనసులో ఎలావున్నా ఒకసారి వెళ్ళిచూడటం మంచిది. పెళ్ళికికూడా నేనొక్కణ్ణే వెళ్ళాను. నువ్వు రానందుకు అతనెంత బాధపడ్డాడో తెలుసా?"

"సరేకాని, చాలా బాగుందా ఆ అమ్మాయి?"

"ఏమో. అందంగా వుందో లేదో నే చెప్పేదానినిబట్టి ఊహించు—ఆ అమ్మాయి ముఖానికి రంగుకోసం, మెరుపుకోసం పౌడర్లూ, స్నోలూ అవసరంలేదు లిప్ స్టిక్ రాయకుండానే ఆమె పెదవులు ఎఱ్ఱగా వుంటాయి."

"ఇదంతా ఎందుకూ? ఆ అమ్మాయి అప్సరస అనండి."

"అదింకా తక్కువపదమే అంటాను."

"అతిలోక సుందరిఅంటే."

"ఓ మాదిరిగా పరవాలేదు."

"మధు మాటెలావున్నా ముందు ఆ అమ్మాయి మీకు బాగా నచ్చినట్టుందే... మొత్తంమీద ఆ అమ్మాయి ఒక అందమైన పశువన్నమాట." అని ముగించింది కమల నిర్లక్ష్యంగా నవ్వుతూ.

ఇంక మాటలు వినడానికిష్టంలేక వెనక్కు తిరిగివచ్చేశాడు మధు. వంటచేస్తున్న పద్మ చప్పుడు వినివచ్చి తలుపుతీసింది. మధు ముఖం కొంచెం కోపంగా వుండటం చూసి రంగుదారా లడగకుండా లోపలికి వెళ్ళింది పద్మ. గబ్బిలాలకంపు వదలకొట్టడానికి వెలిగించిన అగరువాసనగదిలో అడుగు పెట్టగానే ఆహ్లాదంకలుగజేసింది మధుకి. మారిపోయిన గృహపరిస్థితిని విస్తుపోయి పడకకుర్చీలో కూర్చునిచూస్తూ వుండిపోయాడు.

పద్మవచ్చి చిరునవ్వుతో "బట్టలుమార్చుకొని కాళ్ళుకడుక్కోండి" అంది.

"చిత్తం. ఆజ్ఞ" అన్నాడు మధు కుర్చీలోంచి లేస్తూ. కాళ్ళు కడుక్కునివచ్చి వాలుకుర్చీలో విశ్రమించి ఆలోచించటం మొదలుపెట్టాడు—'పద్మని ఎంత అపార్థం చేసుకుంది కమల! బాధ్యత గుర్తించిన స్త్రీ! ఒళ్ళుదాచుకోని వనిత! పద్మ తనభార్య కావటం తన అదృష్టం. లేకపోతే తనపాట్లు సూర్యనారాయణమాదిరే ఉండేది.

కాఫీ పట్టుకువచ్చింది పద్మ. కాఫీ త్రాగుతూ పద్మవైపు నవ్వుతూ చూస్తూ "ఏమిటి పద్మా! ఇంటివికారం వదలగొట్టేసినట్లున్నావు?" అన్నాడు. చిరుసిగ్గుతో తలవంచుకుని లోపలికి వెళ్ళింది. భర్త తన నిర్వాహకత్వానికి మురిసి, మెచ్చుకున్నాడు. అంతకంటె ఏంకావాలి తనకు! ప్రొద్దుటినుంచి పడినశ్రమ కనపడటం లేదిప్పుడు—ఆమెహృదయం తృప్తిపడింది.

రాత్రిభోజనం అయినతర్వాత మధు మంచంమీద పడుకుని భారతిలో 'చరణదాసుల' నేకథ చదువుతున్నాడు. ఇంటి పనులు ముగించుకుని వచ్చింది పద్మ.

"ఈ పుస్తకం చదివావా?" అన్నాడు మధు.

చదివానని తలవూపింది పద్మ.

"చరణదాసుల్లో భర్తని భార్య 'ఒరేయ్' అని పిలవచ్చని రచయిత భావించాడు. నువ్వేమంటావు?" అన్నాడు మధు.

"నేనేమీ అనను." అంది పద్మ మనసు భావాన్ని కప్పి పుచ్చుతూ.

"పరవాలేదు చెప్పు మీ ఆయనని ఒరే అనొద్దులే అన్నాడు నవ్వుతూ మధు.

"రచయిత ఉద్దేశం భర్త భార్యని ఒసేయ్ అని పిలిచినప్పుడు భార్య భర్తని ఒరేయ్ అని సంబోధించవచ్చని అయినా కాకపోయినా భర్త ఎలాంటి గౌరవం యివ్వబడుతున్నాడో భార్య అదే విలువను భర్తనుండి పొంద దగినదని కావచ్చు. ఆత్మీయత లోపించినప్పుడు సంబోధనలో తేనెల్లు కురిసినా వ్యర్థమే అంది భిడియంతో.

తనభార్య విజ్ఞత మధు గ్రహించి సంతోషించాడు.

"నిజం పద్మా! భార్యాభర్తలది విచిత్ర స్నేహం. ఉభయులూ కలిసి కష్టాలు సుఖాలు ధైర్యంతో ఎదుర్కొంటూ జీవితం గడపాలి. నేను నీకు ఒక విషయం చెప్పదలచాను. నువ్వు యిక్కడకు రాకముందు నీకు కొన్ని జాగ్రతలు చెప్పాలనుకొన్నాను కాని యివేమీ అవసరంలేదని గ్రహించాను. మా స్నేహితుని భార్య—కమల అనేపేరు గల ఆమె రావచ్చు. సంస్కరణాభిలాషి. చదువుకున్నది. భర్తను గూడ సరిదిద్దు మనస్తత్వం గలది. తగిన మర్యాద చెయ్యి. నీకు నేనేమీ ప్రత్యేక బాధ్యతలు అప్పజెప్పలేను ఒక్కటి తప్ప—నాదన్నది ప్రతీది నీది నీకు మన సంసారంలోని అన్ని విషయాల్లోనూ సర్వహక్కులు వున్నాయి అంతే అన్నాడు మధు

భర్తకి తనపైన ఏర్పడిన సద్భావానికి భగవంతునికి ధన్యవాదాలర్పించింది పద్మ.

# నిజానిజాలు

ఇంతకాలం బతికి నేర్చుకున్న పాఠం యిది డబ్బువున్నంత మాత్రాన సుఖం రాదు. చాలామంది అలాగే అనుకుంటారు. అంటే అందరు ధనవంతులు మనోవ్యాధులతో బాధపడుతూ ఆనందానికి దూరంగా వుంటున్నారని కాదు నేననేది. ఆనందమనేది ఆత్మలో వుంటుంది-నిజానికి మీకేం లోటు? ఒకరొకరు అర్థంచేసుకున్నారు. హాయిగా వున్నారు. మరి నాబతుకు?

ఈసారి మాలతి దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చింది. చాలాసేపటివరకు ఆ గదిలో టక్కుటక్కుమనే గోడగడియారం చప్పుడు తప్పించి మరేధ్వని లేదు.

ఆ సాయంత్రం.

శివరావు ఆఫీసునుంచి రాగానే సరస్వతి చిరునవ్వులు చిలికింది.

'నన్ను క్షమించరూ!' అంది.

'దేనికి? నువేం తప్పుచేయలేదుగా! ఓ! మర్చిపోయాను. మాలతి ముందుగానే చెప్పిందిగా! నువ్వు అమాయకురాలివని.' అంటూ పకపకనవ్వుతూ బుగ్గగిల్లబోయాడు. కాని రామం లేడిలా చెంగునగెంతుతూ, పానకంలో పుడకలా అప్పుడే రావాలి??

★

# ★ దగాపడిన తమ్ముడు ★

(43-వ పేజీ తరువాయి)

పడేవాళ్ళేనా? లేదా అంటే మీటింగు కెందుకొస్తారు? అరె — అదిగో తన పాటుగున ఉన్న జేబుదొంగ — వీడినుంచే తనూ దొంగతనానికి వెళ్ళాడు! ఎంతగట్టిగా అరుస్తున్నాడో? ప్రజలలో ఆ కోలాహలము— తనెప్పుడూ యిలాంటిది చూడలేదు. ప్రజలలో యింత వుత్సాహం ఉంది. తన కెందుకు లేకపోవాలా.........ఒక మనిషి సన్నంగా పేలవంగా ఉన్నాడు. గాలేసే ఎగిరిపోతాడేమో? సభా వేదిక యొక్క పరికి జయజయధ్వానాలు మ్రోగాయి! పుల్లయ్య జై కొట్టాడు. తండ్రిని చూచి కొడుకు గొంతుక తెగిపోయినట్లు అరిచాడు—

తన ప్రక్కనున్న అన్న అన్నాడు "ఓరన్నా! సత్తెం ఏనాటికైనా జయిస్తాది. ఈ పెద్దోళ్ళందరు ఆ దొరలకాలంలో బాగా మింగడం నేర్చారు. అలవాటైపోనాది మరి. పోతాదా? రోజుకో ధర - రోజుకో యుక్తి తోని లోకాన్ని కాల్చేస్తున్నారు - వీళ్ళ ఆశ అడుగంటదా? అంతా మాయలోపడి గాని యీ యదవలంతా యెన్నాళ్లు బతుకుతారు. హరిశ్చంద్రుడు మారాజు - కష్టాలు, పడరానికష్టాలు పడ్డాడు. కాటి కాపరిగా మాలకాడిదగ్గర పనిచేసాడు- కాని మారాజు సచ్చిపోనాడా? అది బతుకు గాని-నూసావా ఎలాగున్నాడో ఆ బాబు?"

పుల్లయ్య వింతగా చూసాడు. ఆ మనిషి మళ్లీ మాటలు పొదిగిస్తూ "నాయం యెటుపోతాది? యీ దోసుకున్నాళ్లంతా సివరికి యీదిలోని కుక్కలాగ సచ్చిపోరా? యీ కుర్రోల్లు లేస్తున్నారు పైకి. ఈళలో ధర్మం, న్యాయం ఉన్నాది. పెదుగును కదిగెసి వదిలేస్తారు. ఇక అల ఆటలు సాగనివ్వరులే-విను ఆ బాబు మాటలు...!"

ఉపన్యాసకుడు 'చీపురు పుల్ల లాగ ఉన్నాడు గాని గంగాప్రవాహంలా ఉపన్యాసం గంటకు పైగా ప్రవహింపజేసాడు. ఎన్నిసార్లో ప్రజలు కుతూహలంగా జయజయధ్వానాలు చేసారు. ఉద్రేకంతో కేకలు వేసారు. కూర్చున్నవాళ్ళ నరాలు పొంగి లేచి పోయి ముందుకురికారు. ప్రజారాజ్యం రాక ఏమౌతుందని సవాలుచేసాడు ఉపన్యాసకుడు. తన ధోరణిలో తన ఉనికనే మైమరచిపోయాడు. మీటింగు అయిపోయాక వోట్లుకోసం విజ్ఞప్తి జరిగింది. బ్రతుకుభారం మోయలేక గిజగిజ గింజుకొంటూ, జీవితంమీద, భావిమీద ఆశతో బ్రతుకున్న ప్రజానీకంలో ఆ ఉపన్యాసం కాసేపు గింగురుమని ఆ కష్టాల్ని తేలిక పరిచింది

ఈ చివర నిల్చోని వెళ్ళిపోతున్న ప్రజల నుద్దేశించి యెవడో యేదో చెప్పుతున్నాడు. ఎవరది? "అయ్యా! అదుగో బూచోడు?" అని మల్లు చూపించాడు. ఆ బూచాడే గొణుక్కొంటున్నాడు. "అమాయకుల్లారా!" ఒక్క నవ్వు నవ్వాడు. "వాడికి వసపోసి విడిచిపెట్టారు. కాని బుర్రలేదర్రా! వాడికి ఒక్కటే తెలుసు — దుయ్యబట్టడం! తట్టే నాలుక మంచికీ తిరుతుంది చెడ్డకీ తిరుతుంది. వాడికి మనుష్యులపేర్లు తెలుసు కాని చరిత్రగతే వాడికి తెలీదు! మీ అమాయకుల కళ్లల్లో వాడి సగము తెలివితో దుమ్ముకొట్టున్నాడు" పకపక నవ్వుతూ "మీలో ఎందరు క్రాస్ వర్డు బ్రాకెట్లకోసం ప్రాకులాడరో చేతులెత్తండి? మీలో పెనపెద్ద కట్నాలు పుచ్చుకోకండా పెళ్లిచేసుకోలేని వాళ్లెందరో చేతులెత్తండి? ఎక్కడ్నుంచో సులభంగా వేలు వచ్చిపడిపోవాలని దురాశతో లేని వాళ్లెందరో చెప్పండి? మీరంతా దురాశ అనే మాయలో చిక్కుకొని వాడి దబాయింపుల్లో పడిపోయారు! కాకపోతే అంతా మేజిక్ లా అయిపోవాలంటాడు? వందయేళ్లనుంచి అంటిపెట్టుకున్నది ఒక్క రోజులో మార్చి వేయమంటాడు? గానుగెద్దు ఒక్కసారి దుక్కిటెద్దు అయిపోతుందా? అమాటలాడే వాడు పిచ్చివాడురా అబ్బాయిలూ!"

అలా వెళిపోతున్నవారు బూచోడువైపు చూచి హేళనగా పకపక నవ్వారు. బూచోడు మళ్ళీ గొణగడం ప్రారంభించాడు! "పిచ్చివాడు కాకపోతే— ప్రజలకు మరింత సంపాదించడానికి చేసే పోరాటంలో ఇదివరకు ఉన్న వాడినిపాడుచేసేమనే వాడిని ఇంకేం అనాలో నాకు తోచలేదు. ఉన్నది నాశనంచేయటం పనిగా పెట్టుకొనే స్వభావం గలవారు ముందుకు ఏదైనా ఎలా నిర్మించగలరో నాకు అర్థంకాకుండా ఉంది- సంతృప్తిగల ప్రజలలో అలాంటి ఎడతెగని ఆశలను రేకెత్తిస్తున్నాడు. అంటే వాళ్ల ఆశలు ఆకాశంమీదకు పంపించి-సంతృప్తిని మరచిపోనిస్తున్నాడు! అలాంటి వాళ్లను నివ్వు రాజ్యానికివచ్చి ఎంత యిచ్చినా తృప్తి ఉండదు — నిజానికి అలాంటి రకంవాళ్లను నువ్వెప్పుడు సుఖపెట్టలేవు. నీ దుష్ప్రచారముతో వాళ్ల అసలైన సౌఖ్యాన్ని ఎందుకు కాల్చివేస్తావు. గోడకట్టినటు ఇటుకమీద యిటుకలా సౌఖ్యపరచే పనులుచేసావంటే సంతృప్తిగల మనిషే వర్ణించలేని సౌఖ్యాన్ని ఆనందాన్ని పొందుతాడు. అలాంటి మనుషులు హెచ్చున్న దేశమే శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లి కలకాలం నిలుస్తుంది. మీకందరికీ కష్టంగా ఉంటుంది — నేనేమన్నా! నాయనలారా నేను బాధపడ్డానురా! ఒకరి బాధలు పంచుకోడానికి ప్రయత్నించినవాడినిరా! ఏదైనా నాకు చెప్పటానిక్కూ నాకు లేకపోతే యింకెవరికుంది? వినండి వినకపోండి? చూడండి ఈ రోజుల్లో యెన్ని కులాలు యెన్ని పార్టీలు - యెన్ని సంఘాలు! ఇలా సంఘాలుగాఉండివీళ్లంతా వున్నంతగా పోలేద? ఒకరిమీద ఒకరికి అసహ్యము వ్యాపింపజేస్తున్నారు. మానవత్వంమీద అసహ్యాన్ని ప్రేరేపించడానిక్కా సంఘాలు ఒద్దునాయనా. నాదేశం, తలుచుకుంటుంటే యీ యుగ సంధిలో యింత అధ్వాన్నం అయిందా అని ఏడుపొస్తుంది..."

ఇంకా ఎవరూ వినేవాళ్లు లేకపోయినా అలా మాటాడుతూనే కళ్ళంట నీరు కారుస్తూ ముందుకు నడచిపోయాడు.

పుల్లయ్య ఇంటివేపు వుత్సాహముతో అడుగులువేసినా యిల్లు దగ్గరౌతున్నకొద్దీ మళ్ళీ మనసులో ఈపూట కెలాగునవనే ఆందోళన రేగింది. ఆరాత్రి నీలి పారుగమ్మదగ్గర చోడిపిండి అప్పుతెచ్చి అంబలికాయడంవల్ల త్రాగాడు. ఆరాత్రి ఆలోచించి మరుచటి రోజు బజారులో తట్టపట్టుకొని కూలికవెళ్తే మంచిదనిపించింది. నిద్రపోయాడు.

[ఇంకావుంది]

---

ఎంతోమంది స్త్రీలు భర్తల నర్థం చేసుకోలేక, భర్తలు సత్పురుషులు కాక బాధపడటం తాను వింది. తనభర్త సద్గుణాల పుంజం. ఎదటివాళ్ళ మనస్తత్వం చిటికెలో గ్రహించే మేధావి. తమజీవితం నిష్కంటకమైన రాజబాటపై నడుస్తుంది. తన సంసారం స్వర్గసీమ.

—మిగతా వచ్చేవారం]

---

## అడిగిచెప్తా!

రామయ్య:- నెలాఖరయింది. చేతిలో దమ్మిడీ లేదు. పంతులుగారిని పదిరూపాయలడిగి తెమ్మంది నా భార్య.

పంతులు:- అయితే వుండు. ఇమ్మంటుందో, వద్దంటుందో మా ఆవిణ్ణే అడిగి వస్తాను.

—కొ. లక్ష్మీపతి.



# సినిమా

ఈ మధ్య చిన్న చిన్న అద్భుతాలు జరుగుతున్నాయి. అశోక్, కిశోర్ లాంటి పని రద్దీనటులు ఇళ్లదగ్గర దొరకుతున్నారు.

'ఏం కథ' అంటే. "ముడిఫిలిం కొరత పుణ్యమా అని, షూటింగ్ కాల్‌షీట్లు రద్దు అయిపోయి మాకు కాస్తంత అనుకోని విశ్రాంతి దొరుకుతోంది" అంటున్నారు నవ్వుతూ.

అలా,అని, వాళ్లు ఈ సమస్య వచ్చిపడ్డందుకు ఆమందానంద కందళిత హృదయారవిందులై, ఆనందాబ్ధి నోలలాడుచుండిరని పాఠక మహాశయులు భావింపజనదు.

ఐసెన్‌హోవర్, క్రుష్చేవ్ లాంటి అగ్రరాజ్య నాయకులు కలుసుకోవడం రాజకీయ ప్రపంచంలో ఎంత కష్టసాధ్యమో, అశోక్ కుమార్, మీనాకుమారి, జానీవాకర్ ఒకచోట చేరడం ఫిలిం ప్రపంచంలో అంతటి ఘనవిషయమూను. ఫిలింప్రొడ్యూసరు పాలిట ఇది యజ్ఞం అంతపని. ఈ మహాకార్యాన్ని సాధించుకు, అందర్నీ ఆకట్టుకు వచ్చిన నిర్మాత, తీరా కెమెరా తిరగడానికి అందులో ఫిలిం లేదని తెలుసుకోగానే ఎంత బాధపడతాడో, ఎంత నష్టపడతాడో, నిర్మాతకే తెలుస్తుంది. తాము నటిస్తున్న చిత్రం చప్పున బయటపడి నాలుగు డబ్బులు చేసుకోవాలని పరదాపడే నటులూ అంతా నొచ్చుకుంటారనడానికేం సందేహం లేదు.

## బొంబాయి సినిమా

ఎందరు ఎంత నొచ్చుకున్నా ప్రభుత్వానికి, ముడిఫిలిం సమస్య గురించి గట్టిగా నచ్చచెప్పలేకపోతున్నారు. అందుకే ఇంకా దిగుమతిలో నూటికి 40 వంతుల కోత అలాగే ఉంది. దాని ఫలితం: ఉదయాస్తమానం పని రద్దీతో కలకలలాడే స్టుడియోలు ఒకటి రెండు వారాలుగా చిన్నబోయాయి. ఫిలిం తెచ్చుకొన్న ఘనులు కొద్దిమందే నిర్మాణం సాగిస్తున్నారు. అనేకులు ఫిలింకోటా సలహా సంఘం చుట్టూ తిరుగుతున్నారు.

* * *

వెనకటి కో పెద్దమనిషి వేళాకోళంగా అన్న ముక్క ఇవాళ అక్షరాలా అమలులో కొచ్చేలావుంది.

'ఫిలిం ముహూరత్'(ప్రారంభోత్సవా)ల గురించి మాట్లాడుతూ, అవన్నీ మూఢనమ్మకాల జాబితాలోవనీ, అందుచేతనే, ఆ సమయంలో కొందరు నిర్మాతలు, కెమెరాలో ఫిలిం పెటకుండానే, వచ్చిన పెద్దమనిషి చేత మీట నొక్కించి చప్పట్లుకొట్టించి, డబ్బు పాడుపుచేస్తారనీ ఆయన అన్నాడు.

సినిమావాళ్లు, సెనగపప్పులా డబ్బు ఖర్చు పెడతారన్న దురభిప్రాయం ఉన్నవాళ్లు ఈ మాట నమ్మకపోయినా, ఇపుడు, [illegible] పోయిన ముడిఫిలింను మటుకు,హాండ్ బాగ్‌ల తయారీకికూడా ఇచ్చేసేటంత 'ధారాళంగా వాడతారని చెప్పలేము. అందుచేత ఇదివర[illegible] వేళాకోళం ఇపుడు, తప్పనిసరి మర్యాద అయేలావుంది. ముహూరత్ సమయంలో కెమెరాలు ఖాళీగానే ఉండడం జరుగుతోందని అభిజ్ఞవర్గాలవారు చెబుతున్నారు.

* * *

ఈ ట్రిక్కును లోగడవెల్లడించిన నిర్మాత రమేష్‌సైగాల్ అసలు ఆయనపేరు మీరు అనుకున్నట్టు రమేష్‌సైగల్ అయితే నేమి ఆయనే చెప్పినట్లు, సినిమా సీమలో అడుగడుగునా పాటించబడే 'సూపర్ స్టిషన్' (మూఢనమ్మకాలు)ల ఫలితంగా, ఒక పెద్దమనిషి, సైగల్ కన్న సెహ్(హ)గాల్ అని పేరు మార్చుకుంటే అదృష్టం కలిసివస్తుందన్నారు. ఈయనా ముందువెనక నమ్మి మార్చుకున్నారు. ఆ పేరు పెట్టుకున్నాక తీసిన చిత్రం 'న్యూఢిల్లీ' బాక్సాఫీస్ హిట్ అయింది.

'పాటించక తప్పదు ఇందులో [illegible] న్నాట్యూను' అంటారాయన నవ్వుతూ.

తమాషా ఏమిటంటే, మొన్న ఆయన కొత్తచిత్రం మొదలు పెట్టినపుడు ఇలాటిదే



జలరుహావారి 'రాజనందిని'లో కృష్ణకుమారి

వరసగా హాల్లో వచ్చి కనబడ్డాయి. చిత్రం పేరు "అప్నా హాత్ జగన్నాధ్"

చిత్రం ఆరంభించినపుడు పూజకు వచ్చిన ఒక పెద్దమనిషి, హిట్ చిత్రం 'న్యూఢిల్లీ'కీ దీనికీ సామ్యాలు చూపించాడు.....

అవి...ఆ చిత్రం పూజకు, పౌరోహిత్యం చేసిన శాస్త్రిలుగారే దీనికీ పురోహితుడు.

పూజాముహూర్తం దానికి ఉదయం 7-30 కు పెట్టారు. దీనికీ సరిగ్గా అంతే.

ఆ చిత్రం ముహూరత్ నాడు తొలిసన్నివేశంలో కెమెరా ఎదట నిలబడ్డ నటుడు కిశోర్ కుమార్, ఇంకో ఇద్దరు చిన్న నటులు. ఈ చిత్రానికి ఆ ముగ్గురే హాజరయ్యారు!

ఈ మహాసత్యాలు వినగానే రమేష్ పకపకనవ్వి, తను ఇంకో రెండు సత్యాలు కూడా ఆవిష్కరించి ఆశ్చర్యపోయారు. అవి: (1) 'న్యూఢిల్లీ' చిత్రానికి పని చేసిన టెక్నిషియన్లు యావన్మంది దీనికి పని చేస్తున్నారు.

(2) ఆ చిత్రం ఆరంభించినరోజు గురువారం. ఇదీ అంతే!

అదీ కథ.

ఈ కొత్తచిత్రం కథకూ, పైన పేర్కొన్న కథకూ ఏం సంబంధం లేదు. రెక్కాడందే డొక్క ఆడదు అన్న సామెతను, కొద్దిగా సర్ది, "రెక్కాడితే, డొక్క ఆడి తీరుతుంది. కష్టపడి పనిచేసే వాడికి పని దొరక్కపోవడం, తిండి లేక ఛావడం ఎన్నడూ జరగదు" అని హామీ ఇస్తూ జి. డి. మద్గూల్కర్ దీనికి కథను వ్రాశారు. అందుకే పేరు 'అప్నా హాత్ జగన్నాథ్' అని పెట్టారు. ఇందులో కిశోర్ నాయకుడు. హీరోయిన్ ఇంకా నిర్ధారణ కాలేదు. వజీర్ హుసేన్ ఒక ముఖ్య పాత్ర ధరిస్తాడు. సంగీతం, సచిన్‌దేవ బర్మన్ సమకూర్చుతారు. ఈ సంస్థ (డీలక్స్ ఫిలింస్) రెండవ చిత్రం 'లాజ్‌వంతి'కి కూడా ఆయనే సంగీత దర్శకుడు.

నవకేతన్ వారి 'కాలాపానీ' చురుకుగా తయారవుతోంది. దేవానంద్, మధుబాల, నళినీజయవంత్, కిశోర్ సాహులు నలుగురూ ఇందులో కనబడతారు. నాలుగూ పెద్ద భూమికలే. ఈ చిత్రానికి, రాజ్ ఖోస్లా దర్శకుడు. సంగీతం సచిన్‌దేవ బర్మన్.

* * *

దాస్తొయెవ్‌స్కీ నవల 'నేరమూ-శిక్షా' ఆధారంగా పారిజాత్ పిక్చర్స్ పేరిట రమేష్ సైగల్ నిర్మిస్తున్న 'ఫిర్ సుభా హోగీ' ఆగష్టులో విడుదల కాగలదని తెలుస్తుంది. ఇందులో రాస్కోల్నికొవ్ రాజ్‌కపూర్. సోనియా పేరు మాలాసిన్హా.

సంగీతదర్శకుడు ఖయ్యాం.

* * *

ఈ కంపెనీ, తరువాతి చిత్రం 'ప్రతీలీ కహో'లో ప్రదీప్‌కుమార్ మాలాసిన్హా నాయికా నాయకులు. రెహమాన్, కమల్ కపూర్ నజీర్ హుసేన్, మారుతి, ధుమన్ ఇతరపాత్రలు ధరిస్తారు. సంగీతం ఖయ్యాం. దర్శకుడు నరేష్ సైగల్.

* * *

పాంచ్‌దీప్ పిక్చర్స్‌వారి 'కారిగార్' మే నెలాఖరుకు విడుదల అవుతుంది. అశోక్ కుమార్, నిరూపరాయ్, రమేష్‌కపూర్, ఓంప్రకాష్, లలితాపావర్ పాల్గొన్న ఈ చిత్రానికి వసంత్ జోగేల్కర్ దర్శకుడు.

సంగీత దర్శకుడు సి. రామచంద్ర.

* * *

జయశ్రీ, భరత్‌భూషణ్, నాయికా నాయకులుగా, కె. కె. ఆర్స్ ప్రొడక్షన్స వారు 'దర్శన్ మేలా' అనే సంగీత ప్రధాన చిత్రం తీస్తున్నారు. అగ్రశేణి సంగీత దర్శకులకు అభిమానపాత్రుడైన సజ్జద్ హుసేన్ దీనికి సంగీతం సమకూర్చుతారు. పాటలు రాజేంద్రకృష్ణ వ్రాస్తారు.

అసిత్ సేన్ దర్శకత్వాన తయారయే ఈ చిత్రం నిర్మాణం మొన్ననే జూపిటర్ స్టూడియోలో ఆరంభం అయింది. మాస్టర్ రోమి-ఇందులో ఒక ముఖ్యపాత్ర ధరిస్తున్నాడు.

* * *

ఎస్. కె. మాలిక్ ప్రొడక్షన్స్‌వారి చారిత్రక-చిత్రం 'మహారాణా ప్రతాప్', దర్శకనిర్మాత మాలిక్ స్వంత స్టుడియోలో తయారవుతోంది. ప్రదీప్‌కుమార్, బీనా రాయ్, కె. ఎన్. సింగ్, తివారీ, కమల్



'లైట్ హౌస్' చిత్రంలో నూతన్

కపూర్, ఎం. రాజన్ మొదలుగువారు ఇందులో పాల్గొంటున్నారు. కే. కే. అల్ నజీర్ ఇందులో అక్బరుపాత్రను నిర్వహించాడు. ఆయన ఆఖరుచిత్రం ఇదే.

సంగీతదర్శకుడు జమాల్ సెన్ నాలుగు పాటలు రికార్డు చేశారు.

*　*　*

నర్గీస్, కిశోర్ నటిస్తున్న నీల్ కమల్ వారి 'ఏక్ థా రాజా, ఏక్ థీ రాణీ', ఎం. ఎల్. ఆనంద్ దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది. శంకర్, జైకిషన్ దీనికి సంగీత దర్శకులు.

*　*　*

హెచ్. ఎస్. రావెల్ చిత్రం 'షరారత్' నిర్మాణం పూర్తిఅయింది. మీనాకుమారి, కిశోర్ కుమార్, రాజ్ (మదరిండియా) కుమార్, కుంకుం, రమేష్ సిన్హా, రాజేంద్రనాథ్ ఇందులో పాల్గొన్నారు.

సంగీతం శంకర్, జైకిషన్ సమకూర్చారు.

ఎస్. డి. నరాంగ్ చిత్రం 'ఢిల్లీకాఠగ్' నిర్మాణం పూర్తి కావచ్చింది. నూతన్, కిశోర్ కుమార్ ఇందులో చిలకాగోరింకలు. ఇతరులు: ష్మృతిబిశ్వాస్, కృష్ణకాంత్, మదన్ పురి, అమర్, ఇఫ్తికర్. సంగీత దర్శకుడు రవి.

*　*　*

ఫిల్మిండియా కార్పొరేషన్ వారి 'సోనే కీ చిడియా' ఈ నెల 16న విడుదలఅవుతోంది. బల్ రాజ్ సాహ్ని, నూతన్, తలత్ మహమ్మద్, ధుమల్, ౙ్రకమ్ కపూర్ ఇందులో పాల్గొన్నారు. దర్శకుడు షహీద్ లతీఫ్. సంగీత దర్శకుడు ఒ. పి. నయ్యర్. ★

(ఆంధ్ర వార పత్రిక బొంబాయి విలేఖరి)

## శాంతారాం కొత్తచిత్రం

రాజ్ కమల్ కళామందిర్ వారి కొత్త చిత్రం 'మాసీ', విడుదలకు, సెన్సార్ సర్టిఫికెట్ నిరాకరించ బడింది. దర్శక నిర్మాత శాంతారాం కోరిక పై పునః పరిశీలన జరిగినా కూడా ఫలితం లేకపోయింది.

ఈ చిత్రానికి కథ సంభాషణలూ ప్రముఖ రచయిత జి. డి. మడ్గూల్కర్ వ్రాశారు. దర్శకుడు, శాంతారాం కుమారుడు ప్రభాత్ (తుఫాన్ ఔర్ దీయా) కుమార్.

ఈ విషయం పరిశీలించి న్యాయం చేయాలని శాంతారాం కేంద్ర ప్రభుత్వాన్ని కోరారు.

*　*　*

## జె. సి. బోస్‌పై డాక్యుమెంటరీ

ప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్త జగదీశచంద్ర బోస్ జీవిత చరిత్రను చిత్రిస్తూ ఒక డాక్యుమెంటరీ నిర్మించాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించుకుంది. ఈ చిత్ర నిర్మాణాన్ని బెంగాలీ దర్శకుడు తపన్ సిన్హాకు ఒప్పగించ నిశ్చయించినట్లు తెలిసింది. తపన్ సిన్హా తీసిన 'కాబూలీవాలా' గత సంవత్సరం రాష్ట్రపతి సువర్ణపతకం సంపాదించుకోవడం విదితమే.

ప్రభుత్వం నిర్మించదలచిన "టాగూర్" చిత్రం దర్శకత్వం, సత్యజిత్ రాయ్‌కి ఒప్పగించడం జరుగవచ్చునన్న విషయం విదితమే.

*　*　*

## బెంగుళూరులో ఫిలిం స్టుడియో

కన్నడ చిత్రపరిశ్రమకై, త్వరలోనే బెంగుళూరులో ఒక పెద్ద ఫిలిం స్టుడియో నెలకొనబోతున్నది. లాల్ బాగ్‌కు మూడు మైళ్ళ దూరాన, నరాపూర్ మెయిన్ రోడ్ పక్కగా నలభై ఎకరాల స్థలాన్ని దీనికి కేటాయించారు. షూటింగ్ ఫ్లోర్లు, లెబారెటరీ, వర్క్‌షాపులు, మొదలైన [illegible] భవనాల నిర్మాణానికి ఏర్పాట్లు చేస్తున్నారు. ఆర్. కె. మైనింగ్ ఇండస్ట్రీస్ అధిపతి డా॥ఎం. రామదాసుగారు ఈ స్టుడియోను నిర్మిస్తున్నారు. ఈ వచ్చే అక్టోబరులో చిత్ర నిర్మాణం ఆరంభించడానికి వీలుగా స్టుడియో నిర్మాణం ఏర్పాట్లు పూర్తి అవుతాయని తెలుస్తోంది.

## హాలీవుడ్

సాగనుగా ఈదడంలో ప్రవీణుల ప్రశంసలందుకొన్నంతటి ప్రావీణ్యం గడించుకున్న హాలీవుడ్ 'సినీమెర్ మెయిడ్' ఎస్తర్ విలియంస్ (బేదింగ్ బ్యూటీ), తన భర్త బెన్ గేజ్‌కి ఇటీవల విడాకు లిచ్చింది. గత పన్నెండేళ్ళుగా పొరపొచ్చాలు లేకుండా కాపరంచేసిన హాలీవుడ్ జంటలలో ఇది ఒకటి. అక్కడి సినీమణులకు ఇది పెద్ద రికార్డు. మామూలుగా ఆర్నెల్లు, ఆరు వారాలూ, ఆరు రోజులూ పెళ్ళిళ్ళు నిలుస్తాయి. ఈ మాటను పన్నెండేళ్ళుగా, హాలీవుడ్ సినీఫాన్ పత్రికలు పోటీలుపడి రా[illegible] వచ్చాయి.

లక్షలు గడించిన ఎస్తర్ విలియంస్‌కు ఇటుపై (మాజీ) భర్తనుండి ముట్టబోయే మనోవర్తి: ఏడాదికి 12 డాలర్లు.

జలరుహా వారి రాజనందినిలో ఎన్. టి. రామారావు.



# ?

"80 కోట్ల రూపాయల పెట్టుబడి తిరుగుతున్న ఫిలింపరిశ్రమ శాఖోపశాఖలలో దాదాపు 65 వేలమంది పనిచేస్తున్నారు. దీనికి దెబ్బ తగలనీయడం శ్రేయస్కరం కాదు. కాబట్టి ప్రభుత్వం ముడి ఫిలిందిగుమతిపై అమలు చేస్తున్న 40% కోతను పూర్తిగా రద్దుచేయాలి" అని శ్రీ బి. నాగిరెడ్డి, ఎం.జి. రామచంద్రన్, ఎ. రామయ్య, ఎస్. కృష్ణస్వామి, డి. రామానుజం, డి. కెంపరాజ్ ప్రభృతి నిర్మాతలంతా ప్రభుత్వానికి తిరిగి విజ్ఞప్తిచేశారు.

* * *

ఓ. జి. ఎల్. జాబితాలోంచి ముడిఫిలిం పేరును మురార్జీ దేశాయిగారు చెరిపించి వేసినపుడు, అందరూ (ఫిలిం పరిశ్రమలోవారు) ఆశ్చర్యపోయారు.

# !

ఇదేమిటి. ఇక్కడ తయారుకాని సరుకును ఎక్కడినించో తెచ్చుకోనీకపోతే ఎలా అని. అప్పుడు నిలవలో కొంత ఫిలిం ఉంది.

తరవాత అది అయిపోయింది. తరవాత ఇంకోటికూడా జరిగింది. ప్రభుత్వం కోతను 60% కి పెంచింది.

బొంబాయివాళ్లు యీలా సర్దుకుంటున్నారో తెలీదుగాని, దక్షిణాదిన ఇది తీవ్ర సమస్య అయిపోయింది. కొండంత పెట్టుబడి, వ్యాపార పరిభాష ప్రకారం 'బ్లాక్' అయిపోయింది. చిత్రాల విడుదల కార్యక్రమాలు అల్లకల్లోలం అయిపోతాయని కూడా భయపడ్డారు.

# ?

మద్రాసులో రాఫిలిం కమిటీ, కోటాల ప్రకారం వాటాలువేస్తూ కూర్చుంది. ఇపుడు అది పెద్దసమస్య అయిపోయింది. 400 మంది నిర్మాతలు 600 చిత్రాలకు కోటాలు సిఫార్సు చెయ్యమని దరఖాస్తులు పెట్టుకు తిరుగుతున్నారు. రాబోయే ఫిలిముకూ, కావలసినదానికీ ఏ కోశానా తాడు అందటంలేదు. ఎవరికి ఎంతఇవ్వడం, ఎందరికి లేదనడం, ఎలా అనడం అన్నది పెద్దసమస్య. ఇది కాక, విడుదలకు సిద్ధమైనవి 12 చిత్రాలు ఉన్నాయి. వాటికి కోటికచొప్పున ప్రతులు తీయించాలి. అది ఇంకో ప్రశ్నార్థకం.

# ●

నిలవలూ పలకలూ తొడిగి, నానాటికి పెరుగుతున్న ఈ పద్ధతి పరిశ్రమమీద ఆశ్చర్య, ప్రశ్నార్థకాల తరవాత, ఈ విధానం ఇలాగే సాగితే, ఫుల్ స్టాప్ క్రీనీడ పడుతుందేమోనని దీర్ఘదర్శులు అయినవారు భయం వెలిబుచ్చారు. ★



కలకత్తా ఆంధ్రసంఘంవారు మే 4-న ప్రదర్శించిన "బ్రహ్మముడి" నాటకంలో ఎడమనుండి: ప్రిన్సిపాల్‌గా జి. భాస్కర్, మీనాక్షిగా కుమారి ఎం. రాజేశ్వరి, అటెండర్‌గా శంకరం.

## పౌరధర్మ బాలవాచకం

అగ్ని ప్రమాదాలపై ఫిలింస్ డివిజన్‌వారు తీసిన కొత్త డాక్యుమెంటరీ చిత్రం గత వారం విడుదల అయింది.

తెలుసు ననిపించినా, నిజంగా చాలామందికి తెలియని సంగతులు, తెలిసినా, 'ఈ మాత్రానికేం భాగ్యం' అని చాలామంది కొట్టిపారేసే చిన్న సంగతులూ కూడా ఎంతముఖ్యమైనవో తెలియచేస్తూ ఈ చిత్రాన్ని తయారుచేశారు. పౌరధర్మాల గురించి,వీరు తీస్తున్న చాల వాచకాలలో ఇది మరో బాలవాచకం. నీరు నిప్పును ఆర్పును' అనే దగ్గరనుండి చెప్పారు. అలా అని కొట్టిపారెయ్యక్కరలేదు. కొంపకి నిప్పంటుకుని, గదులన్నీ పొగలు కమ్మినపుడు ఆత్మరక్షణ ఎలా? ఉక్కిరి బిక్కిరి అయి స్పృహతప్పిపోయిన వాళ్లని బయటకు చేర్చడం ఎలా? అగ్ని మాపకదళం వచ్చినపుడు, మనం వాళ్లకి చెయ్యగల మహోపకారం ఏమిటి? (గంతులు వేసి వాళ్లకి అడ్డుతగలకుండా ఉండడం) వగైరాపనికొచ్చేవన్నీ చెప్పుకొచ్చారు. చివర నీతి పాఠాలలో కుంపటి ఆర్పడం నిప్పులుఆర్పడం ఎలాగోకూడా చెప్పుకొచ్చారు. నిప్పులు కిందపోసి, వాటిమీద నీళ్లు జల్లాలి. ఆ తరవాత, కుంపట్లో ఓ చెంబెడు నీళ్ళు గుమ్మరించాలిట. కుంపటి ఆ వేడికీ ఈ తడికీ తట్టుకోలేక విరిగిపోతే ఫిలింస్ డివిజన్ వారినిగాని, ఇజ్రామీరీ గారినిగాని అడగబోకండి. వారు అందుకు బాధ్యులు కారు.

## 'దొంగాటకం'

ఆంధ్ర సమితి (మద్రాసు) ఆధ్వర్యాన, గత వారం మద్రాసు వై. ఎం. ఐ. ఎ. మందిరంలో కీ. శే. విశ్వనాథకవిరాజుగారి హాస్య నాటిక 'దొంగాటకం' ప్రదర్శించబడింది.

ఊళ్ళో తిరుగుతున్న గజదొంగని పడతానంటూ నట్టింటో నానాఆర్భాటంచేసిన ఒకవీర, ధీర హనుమాన్లు, తీరా దొంగ, దొర టోపీ, పిస్తోలూ, గంతలూ, వగైరా హంగులతో సిద్ధమయేవరకు, ఎంతటి ధీరగంభీరహనుమాన్లుగా తర్జుమా అయిపోతాడో, ఆంధ్ర ప్రేక్షకులు పలుమార్లు ఈ నాటకం 'దొంగాటకం'లో చూచి ఉంటారు.

రంగస్థలంమీద హంగులు అట్టే అవసరం లేకుండా విశ్వనాథకవిరాజు దీనిని రూపొందించిపెట్టారు. ఉన్న కొద్ది సదుపాయాలతోటే మొన్న మద్రాసు ప్రేక్షకులకు దీని-



గగ్గం ప్రశస్తంగా వుందని ఎన్నిక చేయటంలేదు. "సాహెబ్ గారూ! నేను చెప్పింది మరచిపోకండేం!" అని హెచ్చరిస్తున్నారు రావుబహద్దర్ గంగాధరంగారు—వేషంగుట్టు తెలిస్తే చిక్కే వచ్చేది—రిపబ్లిక్ వారి "పెళ్ళిసందడి"లో నాగేశ్వరరావు, సి. యస్. ఆర్.

---

చూపించిన నటులు చిదానందం, సీత, కె. వి. రత్నం హుషారుగా నటించి 20 నిమిషాలసేపూ నవ్వులకు తెరిపి లేకుండా చేశారు. ముఖ్యంగా దొంగను పడతానన్న డి. పి. సంఘం అధ్యక్షుడుగా చిదానందం, పాత్ర అవధులనుకూడా దాటి ప్రశంసనీయంగా నవ్వించారు.

ప్రదర్శనకు ముందు ఆధునిక కవితపై విద్వాన్ విశ్వం, ఆరుద్రగారలు ఉపన్యసించారు, సమితి ఉపాధ్యక్షుడు వేమరాజు భానుమూర్తిగారు, నగరంలో సంచార గ్రంథాలయానికి, పుస్తకాలు విరాళం ఇవ్వాలని విజ్ఞప్తి చేశారు. కార్యదర్శి ఎ. హెచ్. వి. సుబ్బారావు వందన సమర్పణతో సభ ముగిసింది. ★

---

# న్యూఢిల్లీ లేఖ

(5-వ పేజీ తరువాయి)

జరిగితే పేతప్పక సాధ్యమవుతుందని ప్లానింగ్ కమిషన్ స్పష్టపరుస్తున్నది. ఆయా ప్రాజెక్టులకు ప్రాధాన్యక్రమాన్ని తిరిగి రూపొందించాలనికూడా నిర్ణయించింది. ఈ పరిస్థితులలో కొత్తచక్కెర మిలులస్థాపన ఏ విధంగా సమర్థనీయమవుతుందోకూడా కమిషన్ ఆలోచించాలి. వీటి స్థాపనకు అవసరమైన పెట్టుబడి దేశంలోనూ, విదేశాలలోనూ ఎంతవరకు లభ్యమవుతుందో జాగ్రత్తగా పరిశీలించాలి.

ధరను తెగపెంచుతూపోతే, వినియోగదారుడి ప్రతిఘటన అనేదొకటి ఏర్పడుతుందనే విషయాన్ని మరువకూడదని హాడ్‌ఫీల్డ్ ఇదివరకే హెచ్చరిక చేశారు. కేంద్రప్రభుత్వ ఆహారశాఖ చక్కెర ధరను పెంచితే పెంచవచ్చుకాని, వినియోగదారులందరూ ఎక్కువ ధరపెట్టి చక్కెరే కొనాలని నిర్బంధించడం మాత్రం అసంభవం. చక్కెర గాకపోతే దాని బాబులాంటి మరో పదార్థం (కలకండ) కొని వాడుకుంటారని మరచిపోకూడదు.

ఇందులో మరో విషయం కూడా వున్నది. జీవనవ్యయ సూచిలో చక్కెర ధరకు కూడా స్థానం వున్నది. మనుకురూపాయి పెంచితే దాని ప్రభావం వెంటనే జీవనవ్యయ సూచి మీదపడి తీరుతుంది. దానితో సర్వత్రా అధిక వేతనాలకు ఆందోళన ప్రారంభమవుతుంది. కేంద్ర ఆహారశాఖకు చక్కెర ధర పెంచే అధికారం వుండవచ్చుగాని, వేతనాలను ఒక స్థిరమైన హద్దులో వుంచే అధికారంలేదు. చక్కెర పరిశ్రమలోనే అధిక వేతనాల సమస్యను ఎదుర్కొవలసి వస్తుంది.

• • •

ఖండసారీ (కలకండ) పరిశ్రమ అనాటికానాడు విస్తరిస్తున్నందుకు చక్కెర పరిశ్రమదారులు ఇప్పటికే ఆందోళన పడుతున్నారు. చక్కెర పరిశ్రమ అనపదిలా విస్తరిస్తున్నందుకు ఖండసారీ పరిశ్రమదారులూ ఆందోళన పడుతున్నారు. ఖండసారీ ఉత్పత్తి అన్నది గ్రామీణులకు ఉద్యోగావకాశాలు కల్పించే గృహపరిశ్రమలాంటిది. ఖద్దరుమీద కోట్లకొద్దీ ధనం వెచ్చించే పెద్దలు ఈ గృహపరిశ్రమ నష్టదాయకమైనదని విమర్శించలేరు. అందుచేత ఖండసారీ పరిశ్రమ చక్కెర పరిశ్రమ పాలిటికి పచ్చివెలక్కాయలాంటిది; అందుచేత చక్కెర ధరను తారస్థాయికి తీసుకువెళ్ళినా వినియోగదారలు భయపడరు. ముందు ముందు ప్రభుత్వం ఏ విధమైన నిర్ణయాలకు వస్తుందో చూడాలి. చక్కెర ధర పెంచితే, వినియోగదారులందరినీ కూడకట్టుకువచ్చి [illegible] సాగించి తీరుతామని పార్లమెంటులో నిపోషలిస్టు సభ్యుడు ఇదివరకే హెచ్చరిక చేసి వున్నాడు. చక్కెర ధర పెంచే[illegible]చన వున్నదని ప్రభుత్వం అన్నదో లేదో, అప్పుడే ధర పెరగడం ప్రారంభమైంది! ★



"జంటకళ్ళు"

—ఫోటో: టి. రామమోహనరావు, పెనమలూరు

# వాగుడు
(35 వ పేజీ తరువాయి)

మనను నొప్పించడం దేనికి? ముఖ్యంగా (అయితే పురుషుల్లో కూడా ఉన్నారనుకోండి) స్త్రీలలోనే ఆ విధమయినవాళ్ళు చాలామంది ఉంటారని నాకు తోస్తుంది. బహుశా అతిగా మాట్లాడేవాళ్ళకు గాని కొంచెం పన్ను విధిస్తే – ఆంధ్రప్రదేశ్ లోటు బడ్జెటు కొంతవరకూ తగ్గొచ్చు.

కొందరు కనపడితే ఎదుటివారికి భయం– ఎక్కడ జిడ్డులాగా తగులుకొంటారో నని. మాటల్లో పడితే ఇక వదలరు. "అవతల పనుండి తర్వాత మాట్లాడుదా" మంటే – "ఆఁ – ఎప్పుడూ ఉండేపని గదటండీ!" అంటారు. మాటలుమాత్రం ఎప్పుడూ ఉండనట్లు? ఇలాంటి వాళ్ళను చూచినప్పుడు కొంచెంసేపు కులాసాగా కబుర్లు చెప్పుకుందామనే ఉత్సాహం నశించి – బాధగా వినాలికాబోలురా భగవంతుడా అనిపిస్తుంది!

## గొప్పకోసం

కొంతమంది ప్రపంచంలో వాళ్ళే గొప్ప అయినట్లూ మిగతావాళ్ళు ఎందుకూ కొరమాలినవాళ్ళు అయినట్లూ మాట్లాడుతారు! ఇలాంటివాళ్ళతో వేగడం మహా విసుగు! "మా నాన్న కోటీశ్వరుడు—మా పెద్దన్నకు అయిదు కార్లున్నయ్. మాకు పెట్రోలుకే నెలకు ఎనిమిది వందలవుతుంది!" అని ఏమేమో చెప్పుకొనిపోతూ ఉంటారు. వాళ్ళ గొప్పనుగూర్చి మన మేమయినా అడిగామటండీ—వాళ్ళ స్వభావమే అంత! అడక్కపోయినా చెప్పేస్తారు. మాటకు ముందు – కార్లు – రేడియోలు, ఇట్లాంటి విషయాలు మాట్లాడితే అవతలి వ్యక్తులు చాలా బాధపడుతారు. వాళ్ళగొప్ప వుంటే ఉండవచ్చు. కాని పదేపదే చెప్పుకోడంలో వీళ్ళకేమీ లేదేమో ననిపిస్తుంది!

పూర్వం ఒక బ్రాహ్మణుడు "నేను మాంసము తినను" అని బోర్డు ఒకటి వ్రాసి మెడకు తగిలించుకొన్నాడట. అట్లా వుంటుంది వీళ్ళవరస. అన్నీ కోతలేమోనని గూడా అనిపిస్తుంది వాళ్ళ పరిస్థితులు పూర్తిగా తెలియనివారికి. మరునటి రోజు "ఏమండీ సుబ్బాయమ్మగారూ కొద్దిగా జిలకర్రా మిరియాలుంటే పెడ్తురూ?" అంటూ వస్తారు. అలాంటప్పుడు మొఖాన్నే అడిగివెయ్యాలని అనిపిస్తుంది గాని – పోనీలె వాళ్ళ మనస్తత్వమే అంత అనుకొని వుండిపోతాము. ఇలాంటివాళ్ళు గూడా వాళ్ళ ప్రవరన మానుకొంటే ఆంధ్ర దేశానికి ఎంతో మంచిది.

ఒక చిన్న మనవి:—పై విషయాలు నిర్మొగమాటంగా వ్రాశానని నన్ను తిట్టకండేం! పైఅలవాట్లు వుండేవాళ్ళ నేమాత్రం. ★

# భర్తృవిహీనల దుర్భరస్థితి
(38-వ పేజీ తరువాయి)

అనేదికూడా ఒక సమస్య. అటువంటివారికి మగదతుత లేకుండా కాలం గడవదు. వారిలాగే, ఆడతోడులేకుండా చిన్నపిల్లలతో అవస్థపడే విధురులు యీ వితంతువులను పెండ్లాడితే ఇద్దరి సమస్యా తీరుతుంది. ఇటువంటి వివాహాలు శారీరకవాంఛా తృప్తి కోసం కాక, ఒకరికొకరు సహాయంగా ఉండేందుకు ఉద్దేశింపబడేవి కనుక పరస్పరం అర్థంచేసుకునేందుకు అవకాశాలు ఎక్కువ. పిల్లల తల్లి జీవితంతో చెలగాటం ఆడే వీలులేదు. ఆమెచేసే ప్రతిపనీ, ప్రతి ఆలోచనా పిల్లలక్షేమం దృష్టిలో పెట్టుకునే చేస్తుంది. అంటే ఆమె కేవలం తనసౌఖ్యం కోసం ద్వితీయ వివాహానికి సిద్ధపడదు. తన పిల్లల అభివృద్ధికి మార్గాంతరం లేదనుకున్నప్పుడే ఆమె ఈ పద్ధతి అవలంబిస్తుంది. ఈవిధమైన వివాహాలు జరగాలంటే, పురుషులలో కొంత మానసిక పరివర్తనం రావాలి; సవతి పిల్లలను స్త్రీలు ప్రేమించినట్లే, పురుషులుకూడా ప్రేమించటం అలవాటు చేసుకోవాలి. ఈ మార్పులు ఒక్కసారిగా రావాలంటే కష్టమే. కానీ, ఆలోచన అంటూ సంఘం దృష్టిలోవుంటే కాలక్రమాన కార్యరూపం ధరిస్తుంది.

ఇక బాలవితంతువుల సంగతి – వీరికి పిల్లలు కూడా లేకపోవటంవలన బాధ్యతారహితమైన జీవితంగడిపినా ఆశ్చర్యంలేదు. పురుషులకు వలెనే, స్త్రీలకు కూడా – శరీర ధర్మాన్ననుసరించి వివాహం అవసరమని శాస్త్రజ్ఞుల ఉద్దేశం. మరి విధురులకు లేని కఠోర నియమాలు బాలవితంతువుల కెందుకు? ఎటువంటి నియమాలు నిర్బంధాలు అయినా, ప్రసుత పరిస్థితులలో ఆదినుంచి అంతమువరకూ సక్రమంగా నెరవేరుతాయనే గారంటీ ఎవ్వరూ ఇవ్వలేరు. ఈ సమస్య సులభంగా పరిష్కరించాలంటే కన్యల వలెనే బాల వితంతువులను కూడా వివాహార్హలుగా పరిగణించాలి.

ఈ విధమైన మార్పులు జరిగితే, సనాతనులు నిర్ణయించిన నియమావళిగాని, ప్రభుత్వం నెలకొల్పిన అభయ నిలయాలు, పతిత స్త్రీ జనోద్ధరణాలుగాని అవసరమే వుండదు.

ఈ వ్యాసంలో మారే సాంఘిక పరిస్థితులకు ఏనుకటి పద్ధతులు ఏవిధంగా అనుకూలంగా లేవో తెలియజేశాను కాని, సనాతనుల శిష్టాచారములను విమర్శించలేదని మనవి.



## రెండు బహుమతులు

ఒకామె:- హిందీ పరీక్షలో అందరికన్న ఫస్టుగా ప్యాసైనందుకు పారితోషికంగా మావారు ఈ కొత్తచీర కొని పెట్టారమ్మా.

రెండవామె:- ఏలాగైతే నేమి హిందీపరీక్షలో ఫెయిల్ అయినందుకు విలపిస్తుంటే, నన్నుఓదార్చడానికి మావారీ కొత్తచీర కొన్నారండి!

—కొ. లక్ష్మీపతి.



సిప్పీ ఫిలింస్‌వారి 'ష్వెలోవ్లాక్'లో వహీదా రెహమాన్

# సినిమా వార్తలు

**ఆర్.** ఆర్. ప్రొడక్షన్స్‌వారి ద్విభాషా చిత్రం "కార్తవరాయుడి కథ" నిర్మాణం పూర్తికావస్తోంది. జూన్‌లో విడుదలకు సిద్ధంకాగలదని తెలుస్తూంది. ఎన్. టి. రామారావు, సావిత్రి, ముక్కామల, బాలకృష్ణ, పద్మనాభం మొదలగువారు పాల్గొంటున్నారు. తమిళచిత్రంలో శివాజీ గణేశన్ నాయకుడు. పెద్ద సెట్‌లతో భారీఎత్తున తయారవుతున్న ఈ చిత్రానికి రామణ్ణ దర్శకుడు. సంయుక్త దర్శకుడు వి. ఎన్. సూరి.

తెలుగుచిత్రానికి మాటలు మద్దిపట్ల సూరి, పాటలు దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ వ్రాస్తున్నారు. సంగీతం జి. రామనాథన్.

* * *

రాజ్యం పిక్చర్స్‌వారి 'కృష్ణలీలలు' జంపన చంద్రశేఖరరావు దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది.

* * *

శ్రీరాజరాజేశ్వరీ ఫిలింకంపెనీవారి సాహసరస ప్రధాన పౌరాణికం 'శ్రీ కృష్ణమాయ' త్వరలోనే విడుదల కాబోతోంది. శారదసంసారం ఇందులో కథ. నాగేశ్వరరావు, జమున, రఘురామయ్య, ఎ. వి. సుబ్బారావు, కుటుంబరావు, రాజసులోచన, కె. వి. ఎస్. శర్మ, మాలతి, సూర్యకళ, సూర్యకాంతం, ఛాయాదేవి మొదలగువారు పాల్గొన్నారు. సి. ఎస్. రావు ఈ చిత్రానికి దర్శకుడు.

నేషనల్‌టాకీ డిస్ట్రిబ్యూటర్స్‌వారి 'వీరఖడ్గం' మే 16 న విడుదల అయింది. ఎం. జి. రామచంద్రన్, టి. ఆర్. (చంద్రశేఖ)రాజకుమారి బి. ఎస్. సరోజ, ఇ. వి. సరోజ, బాలయ్య, చంద్రబాబు, ఇందులో నటించారు. పాలగుమ్మి పద్మరాజు, మాటలూ, ఆరుద్రపాటలూ వ్రాశారు. దర్శకుడు రామణ్ణ.

* * *

జలరుహావారి జానపదం 'రాజనందిని' కూడా మేలో విడుదలకాగలచిత్రం. రామారావు, అంజలీదేవి, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు, జి. వరలక్ష్మి, గిరిజ, కృష్ణకుమారి రాజసులోచన, కె. వి. ఎస్. శర్మ, మహంకాళి వెంకయ్య మొదలగువారు పాల్గొన్న యీ చిత్రానికి వేదాంతం రాఘవయ్య దర్శకుడు, రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి, సంగీతం టి. వి. రాజు.

* * *

వాసన్‌గారి 'వంజికోట వాలిబన్' త్వరలోనే తెలుగులో రాబోతోంది. మాటలూ పాటలూ శ్రీ శ్రీ వ్రాస్తున్నారు.

* * *

బి. ఆర్. పంతులు, కన్నడ తమిళ భాషలలో తీసిన 'స్కూల్ మాస్టర్' కూడా తెలుగులో రాబోతోంది. ఇందులో పంతులు, రాజమ్మ, బి. సరోజ, సూర్యకుమార్ అనే క్రొత్త నటుడు పాల్గొన్నారు. సూర్యకుమార్ తెలుగు నటుడైనా, తొలిచిత్రం తమిళం, కన్నడ భాషలలో తయారైనది. ప్రస్తుతం అతడు నాలుగైదు తమిళ చిత్రాలలో నటిస్తున్నాడు. 'స్కూల్ మాస్టర్'కు రావూరి సత్యనారాయణ మాటలూ పాటలూ వ్రాస్తున్నారు.

* * *

వినోదా ప్రొడక్షన్స్‌వారు, 'మహాదేవి' తమిళ చిత్రాన్ని తెనిగించి త్వరలో విడుదలచేస్తున్నారు. సావిత్రి, ఎం. జి. రామచంద్రన్ ఇందులో నాయికా నాయకులు. సంభాషణలు శ్రీ శ్రీ వ్రాశారు. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

మే
విడుదల!









జలరుహా వారి

# రాజనందిని

RAMDAS.K

దర్శకత్వము... వేదాంతం రాఘవయ్య




FLOODLIGHT

ఆంధ్రప్రదేశ్ కు డిస్ట్రిబ్యూటర్లు: శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్-విజయవాడ- సికింద్రాబాద్, గుంతకల్లు, మద్రాసు.